విజయవంతముగా ప్రదర్శింపబడుతున్న చిత్రం!
అజయ్ ఆర్ట్ పిక్చర్స్
శ్రీరామరక్ష
ఈస్ట్మన్ కలర్






# అమెరికాకి వెడుతూ, యూరోప్‌లో ఆగి వెళ్ళండి.

AI-3508A

సంస్థాపకులు
కీ॥శే॥ వి.వి. రాఘవయ్య




మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య

డిసెంబరు 1978

సహకార సంపాదకుడు : వేమూరి సత్యనారాయణ

సంపుటి 16 **విషయసూచిక** సంచిక 11



నవలానుబంధం

జాబిల్లి కూనలు —వంశీ

ముఖచిత్రం: 'మనవూరి పాండవులు'లో గీత

జ్యోతి, 17-B రాజారాం కాలనీ, P.B. నెం. 2650, మద్రాసు-600 024.
ఫోన్: 423123. సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో రు. 42/-)

# 3 నెలలు వచ్చిన తర్వాత, పాలు మాత్రం యిస్తే చాలదు





## డాక్టర్లు సిఫార్సు చేస్తారు

# ఫారెక్స్®

## మీ పాపాయియొక్క ఆదర్శవంతమైన ఘన ఆహారం

**డాక్టర్లు ఫారెక్స్ సిఫార్సు చేస్తారు! ఎందువల్ల?**

ఎందుకంటే, మీ పాపాయి ఘన ఆహారం తీసుకోవడం ప్రారంభించే సమయంలో అతడి అవసరాలను తీర్చే సంపూర్ణ సంతులిత ఆహారం ఇది. దీనిలో మెదడు, శరీరం పెరుగుదల కోసం తగినన్ని సులభంగా జీర్ణమయ్యే ప్రొటీన్లు, శక్తి కోసం కార్బోహైడ్రేట్లు, గట్టి ఎముకలు, పళ్ల కోసం కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్ డి ఉన్నాయి. అన్నిటికంటే ముఖ్యంగా, ఆరోగ్యమైన రక్తం కోసం తగినంత ఐరన్ ఉంది.

3 నెలలప్పుడు పాపాయి జీర్ణకోశం ఇంకా మామూలు ఘన ఆహారాలను తీసుకోలేనంత సున్నితంగా ఉంటుంది. ఫారెక్స్ పాపాయి జీర్ణశక్తికి తగినట్టు ప్రత్యేకంగా తయారుచేయబడింది. సరిగ్గా నమిలి చక్కగా జీర్ణంచేసుకోవడం పాపాయి నేర్చుకోవాలి. ఫారెక్స్ అందుకు తోడ్పడుతుంది.

ఫారెక్స్—కొత్త 200 గ్రా. అట్టపెట్టెలో కూడా లభిస్తుంది. ఎంతో ఆదా... మరెంతో శ్రేష్ఠత!




**సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం**

లింటాస్-GLF/60-1736 TL

# తొలిమాట

ఫలితం సంగతెలా వున్నా, ఆ ఫలితం దేశ రాజకీయాలపై యెటువంటి.. ఫలితాలు తెస్తుందో ఇదమిద్ధంగా తెలియకపోయినా, కర్ణాటకలోని చిక్‌మగలూర్ నియోజకవర్గంలో పార్లమెంటుకు జరిగిన వుప ఎన్నిక దేశంలోనేగాక, ప్రపంచం మొత్తం మీదా అత్యంత వుత్కంఠ కలిగించింది. భారతదేశ ప్రధానిగా పదకొండేళ్ళున్న ఇందిరా గాంధి, 1977 ఓటమి తర్వాత పార్లమెంటుకి పోటీ చేయడమే ఈ వుత్కంఠకు ప్రధాన కారణం. జనతా అభ్యర్థి నిర్ణయం జరగడంలో మొదట్లో కొంచెం కిందు మీదులయినా చివరకు కర్ణాటక రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా పనిచేసిన వీరేంద్రపాటిల్‌ని అభ్యర్థిగా నిలబెట్టటంతో చిక్‌మగ్‌లూర్ ఎన్నికపై వుత్కంఠ మరింత పెరిగింది. ఆ పార్టీ అధ్యక్షురాలిగా, జరుగుతున్న ఎన్నికలో ఒక అభ్యర్థిగా వున్న ఇందిరా గాంధి నాయకత్వంలో కాంగ్రెస్ (ఐ), కేంద్ర మంత్రి జార్జి ఫెర్నాండెస్ నాయకత్వంలో జనతా వుధృతంగా ప్రచారం సాగించాయి. అంతకు ముందే అత్యంత రసవత్తరంగా ముగిసిన పాకిస్తాన్ - భారతదేశాల మధ్య క్రికెట్ టెస్ట్ పోటీ అందించిన వుద్వేగం, వెంటనే ఈ ఎన్నికవల్ల చెలరేగిన వుత్కంఠ మొత్తం భారతదేశపు దృష్టి చిక్‌మగ్‌లూర్ పై కేంద్రీకృతమై వుంది. ఇది రాస్తున్న రోజే ఓట్ల లెక్కింపు ప్రారంభమయింది. ఈ పత్రిక మీ చేతుల్లో వుండేసరికి ఇందిరాగాంధియో, వీరేంద్ర పాటిలో పార్లమెంటుకి ఎన్నికై వుంటారు. అలాకాక మిగిలిన అభ్యర్థులలో మరొకరెవరో గెలిచే అద్భుతం జరుగుతుందని ఎవరూ 'కల'కూడా కనడంలేదు. విజయం ఎవరిదైనా యీ ఎన్నిక ద్వారా 'చిక్‌మగ్‌లూర్' మాత్రం ప్రపంచం మొత్తానికి తెలిసిపోయింది.

* * *

అమ్మ - తన బిడ్డపై విపరీతమైన అభిమానం చూపడం, అమ్మే తనలోకంగా భావించేలా బిడ్డను ఆదరించడంవల్ల కూడా అవాంఛనీయమనిపించే పరిణామాలూ యేర్పడవచ్చు—41 పేజీ చూడండి.

* * *

సరిగ్గా ఈ పేజీలు ముద్రణకు వెళ్తుండగా అందిన వార్త!

ఇందిరాగాంధి చిక్‌మగ్‌లూరులో గెలుపొంది భారత పార్లమెంటుకి ఎన్నికయారు. ఇక రాజకీయ పరిణామాలకు ఎదురు చూడండి!

# ఉత్తరాలు

నవంబర్ '78 జ్యోతిలోని రామకృష్ణారావు గారి రసవద్గీత చాలా బాగుంది. రాజకీయ రంగంలో జరుగుతున్న అన్యాయాలను అక్రమాలను కేవలం అయిదారు గీతల్లోనే కళ్ళకు చూపెడుతున్న రావుగారు నిజంగా అభినందనీయులు. శ్రీశ్రీగారి శీర్షిక లేనిలోటు ఈనెల జ్యోతిలోకన్పిస్తూనే ఉంది. ఇంతవరకు తెలియని విషయాలను గురించి (వి) చిత్రవిజ్ఞానం ద్వారా మాకు తెలియచేస్తున్న డాక్టర్ జయదేవ్‌గారికి మా కృతజ్ఞతలు. యికపోతే మీరు చందాదారులకు పంపే జ్యోతి పత్రికలేకాదు క్రొత్త సంవత్సరానికి దీపావళికో ఫ్రెండ్సుకు పంపే గ్రీటింగ్స్ కూడా వారికి అందడం లేదంటే ... తపాలా శాఖలో పనిచేస్తున్నవారు తమ విద్యుక్త ధర్మాన్ని ఎంత మాత్రం నిర్వర్తిస్తున్నారో అర్థం చేసుకోవచ్చు. ఈనెల జ్యోతిలో 'మలుపు' 'ఆకాశమంత పందిరి' కథలు తప్ప మిగిలిన కథలు చాలా బాగున్నాయి. ఆకాశమంత పందిరి కథ ముగింపు ఏమీ బాగలేదు. తల్లి మాటలు విని సుధాకర్ లలితను చేసుకొనేందుకు తిరస్కరించాడా లేదా అన్న విషయాన్ని తెల్పి ఉంటే బాగుండేది. కథలలోకంతా ఏ మాత్రం బాగలేని కథ 'మలుపు'. తండ్రి కూడా బిడ్డలపట్ల తన కర్తవ్యాన్ని విస్మరించడని చెప్పేందుకోసమే వ్రాసినట్లుందీ కథ. యిలాంటి కథలను ప్రచురించి మా దృష్టిలో జ్యోతికున్న విలువకు 'మలుపు' కలిగించేలా చేయవద్దని మా మనవి.

—వీరపల్లె వీణావాణి, పేటమిట్ట.

నేను ప్రతి నెలా "జ్యోతి" మాసపత్రిక చదువుచున్నాను. నవంబరు మాస పత్రికలో "ఈ బహుమతి ఎవరికి?" అనే కథ పత్రికకే హైలైట్. ఈ కథలో పెళ్ళికూతురులాంటి త్యాగమయులు, ధైర్యంగల స్త్రీలు వున్నారంటే ఆశ్చర్యంగా వున్నది.

—టి. శేషరెడ్డి, గోపాలదిన్నె.

నవంబర్ జ్యోతి చదివాను. పంచాయితికథ మాకు చాల నచ్చినది. ప్రేమసింహాసనం సీరియల్ మమ్ములని చాల ముగ్ధుల్ని చేసింది.

—కే. మైసయ్య, భువనగిరి.

నవంబరు నెల 'జ్యోతి' చదివాము. ముఖ్యంగా "ప్రేమసింహాసనం" సీరియల్ మమ్మల్నెంతో ఆకర్షించింది. స్వప్నవంటి అబల నేటి సమాజములో వున్నట్లయితే, ఆదరణ చూపేవారుండాలి! అపుడే స్త్రీకి సంఘంలో గౌరవముంటుంది. ఏది ఏమైనా చక్కని శైలిలో అందించిన మా అభిమాన యద్దనపూడి సులోచనారాణి గార్కి మా అభినందనలు!

—ఎల్.పి. చంద్ర, టి. భాగ్యశ్రీ,

—లక్కరాజు ప్రపుల్ల, ధర్మవరం-2.

నవంబరు జ్యోతిలో మొదలుపెట్టిన యద్దనపూడి సులోచనారాణిగారి నవల చాల బాగుగా వున్నది. మిగిలిన కథలుకూడ చాల బాగున్నవి. ముఖ్యంగా "ముల్లు" మరియు "పంచాయతి" నవలలు చాల బాగున్నాయి. చక్కటి కథలు ప్రచురిస్తూ మాకు మీరందిస్తున్న ఈ జ్యోతి నిజంగా ఒక చక్కటి మాసపత్రిక.

—తంగిరాల రామలక్ష్మి, రూర్కెలా.

నవంబర్ సంచిక బాగుందనే చెప్పవచ్చు. ముల్లు పెద్ద కథలో ఆర్. ఇందిరగారు చాలా చోట్ల ఆంగ్ల పదప్రయోగం చేసారు. ఇదికొన్ని

టెక్నికల్ టర్మ్స్‌కి మాత్రం వాడితే బాగుణ్ను. ఇంగ్లీష్ తెలియని పాఠకులకు శర్మ "ఆపర్చ్యునిజమ్", "అగ్లిటింపర్‌మెంట్లు", అర్థంకాక పోవచ్చు. కథలలో మాకునచ్చిన కథ 'దేవుడూః మేం ప్రయాణికులం'. మిగతావి చాలా వరకు "క్రొత్త సీసాలో పాత సారా." ఎక్కువగా ఆనందించిన విషయం ప్రేమసింహాసనం సీరియల్‌కి బాపుగారి బొమ్మలు ఇకనుంచి సీరియల్‌కి అందాన్నిస్తాయి.

—సుధ, షిరాజ్, సురేష్, నెల్లూరు-2.

నవంబర్ జ్యోతిలో మా అభిమాన రచయిత్రి సీరియల్ చదివాను. ప్రారంభమే చక్కగా వుంది. ఆసక్తిని కలిగించి వచ్చేనెల కొరకు ఎదురుచూసేటట్టు చెయ్యగల శక్తి ఒక్క సులోచనారాణిగారికేవుంది. కథకథకు వ్యత్యాసం చూపగల నేర్పు ఆమెది. డిసెంబరు సంచిక ఎప్పుడొస్తుందో? ఇంకా ఈ నెల జ్యోతిలో నాకు నచ్చిన యింకో అంశం కార్టూన్స్ చాలా బాగున్నాయి. కథలలో అంతా యింతే బాగుంది. నవల బాగులేదు.

—కె. సత్యవతి, సికింద్రాబాద్.

నవంబర్ "జ్యోతి" మాసపత్రికలో యద్దనపూడి సులోచకారాణిగారి "ప్రేమసింహాసనం" సీరియల్ చదివాను. అది అమితానందంగా వుంది. కాని మంచి సమయంలో "సశేషం" అనేసరికి బాధతో అలాగే ఆగిపోయాను. డిసెంబర్ జ్యోతి పత్రికకోసం ఎదురుచూస్తున్నాము. యద్దనపూడి సులోచనారాణిగారి సీరియల్‌కోసం నెల రోజులనుంచి ఎదురు చూసాను. ఈనాడు నేను చదివాను. చాల అద్భుతంగా వుంది. ఈ సీరియల్ అందించిన రచయిత(త్రు)లు గార్కి నా అభినందనలు.

—టి. అనంతరామశర్మ, కోదాడ.

నేటి అందాల జంట కృష్ణ, జయప్రదలను ముఖచిత్రంగా వచ్చిన నవంబరునెల "జ్యోతి" ఎంతో అందంగా తయారై వచ్చి, రాగానే, మా ముద్దులందుకుంది! ఆలేటి నాగమణి నవల "పంచాయితీ" ఈ నెల జ్యోతికే హైలైట్!!! ఈనెల శ్రీశ్రీ లేకపోవడం నిజంగా పత్రికలో ఏదో "వెలితి"గానే వుందంటే నమ్మండి! "మయసభ"ను నిర్వహిస్తున్న శ్రీ రామసంజీవి గారు అభినందనీయులు. నిజంగా ఈ శీర్షిక మన జ్యోతిస్థాయిని పెంచినదనడంలో సందేహంలేదు! ఈ నెల కథలన్నీ బాగానే వున్నాయి! కార్టూను ఎంతో బాగున్నాయి. మల్లాదివారి సీరియల్ చివరవరకూ చదివి, చివరన "సశేషం" అనే మాట చూసిన తర్వాత ఆయనమీద, సంపాదకులమీద ఓ విధమైన కోపం వస్తుందంటే, ఆ సీరియల్ మాకు ఎంతగా నచ్చిందో ఊహించగలరు. "వాగ్దానం" కథ అన్ని కథలకంటే బాగుంది. రచయితకు ధన్యవాదములు. చక్కటి సాహిత్యానికి వేదిక మన "జ్యోతి" మాత్రమేనని మరోసారి మనవి చేస్తున్నాము. ముఖచిత్రాలు వేయడంలో మరింత శ్రద్ధ తీసుకోమని సలహా యిస్తున్నాం!!!

—యార్లగడ్డ రాజేశ్వరరావు, సుశీర,
—పి. నాస్సీదేవి, పాలకొల్లు.

నవంబరు జ్యోతి నవలానుబంధం రచయిత్రి ఆలేటి నాగమణి "పంచాయితీ" ద్వార పురోగామిగా చూపించవలననే ఆకాంక్ష వున్నట్లు బాలమ్మ, రాజయ్య పాత్రలద్వార కనుపిస్తారు. అయితే నవల సాగినకొలది నేడు అసంఖ్యాకంగా వస్తున్న సెంటిమెంటల్ కథల ప్రాబల్యంనుండి వీరుగూడ తప్పించుకోలేక పోయారు. బాలమ్మ పాత్ర ఒక నిర్దిష్టమయిన ఉద్దేశ్యంతో సృజించిన ఆ ఔన్నత్యం రచయిత్రి బాలమ్మ పాత్ర మీద కాపాడలేక పోవటం పెద్ద తప్పు. రచయిత్రి బూదెమ్మ పాత్రకు రూపం దిద్దారు కాని ప్రాణం పొయ్యటంలో వెనకాడారు. ఈ నవల మొత్తంమీద రచయిత్రి చేసిన మంచిపని మనసులో పెట్టుకొని రాజయ్య పాత్రను తీర్చిదిద్దటమే. పెద్ద కథలలో "మైలపడిన చీర" బావుంది.

కథలలో "అంతా ఇంతే" "కాదు సుమాకల" తప్ప మరేవి బాలేవు. "దేవుడూ మేం ప్రయాణీకులం" కథ 33 పేరాలో గడ విరిగి పోయింది. 38 వ పేరాలో పాపయ్య చేతిలోని గడ రంగి (ఎలా?) తీసుకొన్నది. "మయసభ" శీర్షిక చదువుచున్నంతసేపూ, జోక్స్ చదివినంత అనుభూతి కలిగించిన రామసంజీవిగారికి మా అభినందలు.

—ఈతకోట సుబ్బారావు నెల్లూరు-1. *

ఎం.రామకృష్ణారెడ్డి B.E.
సమర్పించు
శ్రీరామకృష్ణ కంబైన్స్

# సీతాపతి సంసారం



దర్శకత్వం
ఎం.ఎస్.కోటారెడ్డి

నిర్మాతలు ఎం.సుబ్బరామిరెడ్డి, కె.శంకరరెడ్డి M.A.

సంగీతం:చక్రవర్తి మాటలు:జంధ్యాల ఫోటోగ్రఫీ:పి.భాస్కరరావు కూర్పు:నరసింహారావు కళ:భాస్కరరాజు

DIMPLE



# మయసభ

వాడూ వీడూకాదు, సాక్షాత్తు ఆ శ్రీకృష్ణ పరమాత్ముడే భగవద్గీతలో చెప్పాడు:

"పత్రం, పుష్పం, ఫలం, తోయం
యోమే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుప హృతం
అశ్నామి ప్రయతాత్మనః"

పరిశుద్ధమైన మనసుతో ప్రీతితో భక్తుడు ఆకునుగాని పువ్వునుగాని, పండుగాని, ఆఖరికి కొంచెం నీళ్ళయినా గాని ఇస్తేచాలు. నేను ఆనందంతో ఆరగిస్తాను అని సవివిరంగా, సెక్షన్—బై—సెక్షన్‌గా విపులీకరించాడు.

"ఏవిటి చెప్మా, ఈ దేవుడికింత కష్టకాల మొచ్చింది" అన్పిస్తుంది నాబోటి తామసులకు సలక్షణంగా పచ్చ కర్పూరం, జీడిపప్పు, బాదంవేసి, ఘుమ ఘుమలాడే నేతిలో చేసిన లడ్లు, చక్కెర పొంగలి, పులిహోర,దద్దోజనం లాటి షడ్రసోపేతమయిన నైవేద్యాలార గించే స్వామివారు—పోలీసులకు భయపడి అడవుల్లో దాక్కున్న నక్సలైటువలె—ఆకూ అలమూ తింటానంటా డేవిటీ....అన్పిస్తుంది. లేకపోతే ఈ దేవస్థానాలూ, దేవాదాయ ధర్మాదాయ శాఖలూ—వీళ్ళ వ్యవహారాలన్నీ చూచి చూచి హింసాత్మకమైన విప్లవం వినా మరే మార్గం లేదని ఆ శ్రీమన్నారాయణుడు సత్యనారాయణ సింగ్‌లా శ్రీకాకుళం అడవుల్లోకి వెళ్ళిపోయినప్పుడు ఇచ్చిన స్టేట్‌మెంటేమో నన్పిస్తుంది.

కర్నూల్లో మా ఆఫీసులో జిలానీ ఒకత నుండేవాడు. మనిషి చూడడానికి అంజాద్‌ఖాన్‌లా వుండేవాడు కాని మాట మాత్రం లతా మంగేష్కర్ పాటలా వుండేది. నే నాఫీసులో చేరి రెండు నెలలయినా కాలేదు. ఒకరోజు మధ్యాహ్నం మూడింటికి నన్ను వరండాలో అటకాయించాడు.

"సంజీవిగారూ." అన్నాడు. అరనిముషం సైలెన్స్‌తో మాంచి ఎఫెక్టిచ్చాడు. "నాకో పెద్ద సమస్య వచ్చి పడింది. అర్జంటుగా ఒక పాతిక రూపాయలు సర్దండి. వచ్చేవారం జీతం రాగానే ఇచ్చేస్తాను."

నేను దంగైపోయాను. నాతో అతడికి పరిచయంలేదు. పైపెచ్చు నాదగ్గర అయిదే రూపాయలున్నాయి.

"పాతిక రూపాయలా .." అని నసిగాను.

"పాతిక ఇబ్బంది అయితే పదిహేను చూడండి. కృష్ణమూర్తిని మిగతా దిమ్మంటాను." అన్నాడు జిలానీ.

"పదిహేనుకూడా..." సాగదీశాను.

"పోన్లెండి పదిచ్చేయండి. అడ్జస్టయి పోతానెలానో...."

"నా దగ్గర అంతకూడా...."

"అవున్లెండి మనందరం ఎన్జీవోలమే కదా. అయిదిప్పించండి...."

వి. రామసంజీవి

## మోపెడ్ అందాన్ని చూచి మోసపోవద్దు. ఈ క్రింది అంశాలన్ని



## దానిలో ఉన్నాయో లేదో ముందు చూచి, లేకుంటే ఆవైపే పోవద్దు.

- పొదుపు ప్రాధాన్యత
  సరిక్రొత్త ఎస్ఎస్ సిరీస్ కార్బ్యురేటర్ ఒకే ఒక లీటర్ పెట్రోల్‌నకు నిలకడైన వేగము మరియు 70 కిలోమీటర్ల ప్రయాణం యివ్వగలదు.
- మన్నిక ప్రాధాన్యత
  గతుకుల రోడ్లయందు కుదుపులు లేకుండా సుఖంగా ప్రయాణం చేయుటకు మా డీలక్స్ మాడల్ నందు క్రోమ్డ్ అల్యూమినియం మిశ్రమ సిలిండర్లు మరియు వెనుకతాకిడులను తట్టుకొనుటకు వీలుగా మేలురకం పరికరములు గలవు.
- పిలియన్ సీటు ప్రాధాన్యత
  సువేగా డీలక్స్ మాడల్ సీట్లు రెండు—జంట పొదుపునకు అనుకూలము
- తేలికగా బయలుదేరు ప్రాధాన్యత
  ఒకే ఒక దెబ్బతో యిది తేలికగా బయలుదేరుతుంది
- భద్రత ప్రాధాన్యత
  అధిక భద్రతకై బలమైన పెట్టి రూపమునగల ఫ్రేము మరియు చెయిన్ సహాయపు ప్రయాణం ద్వారా యీ బండి సన్నగా ఉండేట్లు కనబడుతుంది. అయినా చక్కని భద్రత మరియు స్థిరత్వముగలది.

వెనుక చూపువద్దు—సువేగా కొనండి.

వివరములకు మీ సమీపమందలి సువేగా డీలరును కలుసుకోండి.




**సువేగా సాటిలేని మోపెడ్‌కు మారుపేరు.**



మోపెడ్స్
ఇండియా
లిమిటెడ్
తిరుపతి, ఆంధ్రప్రదేశ్.

"నా దగ్గర అయిదేవున్నాయి. జీతానికింకా అయిదు రోజులున్నాయి...."

"అలాగని మొదటే చెప్పకపోయారా.... ఏమీ బాధపడకండి. రెండుతో ఈపూట దాటిం చేయగలను."

ఈ జిలానీ అవరోహణకు మతిపోయి ఏమీ మాట్లాడ లేకుండా నేనుంటే అతడు చక చక మరో రెండు మెట్లు దిగిపోయి....

"....పోనీ వన్ రుపీ. ..అదీ ఇబ్బందయితే హాఫ్ రుపీ ఇవ్వండి. సిగరెట్లు కొనుక్కుం టాను." అని అర్ధరూపాయా పుచ్చేసుకుని రాజాలాగా వెళ్ళిపోయాడు!

మరి పద్మనాభుడూ, పన్నగశయనుడూ అయిన విష్ణూజీ కూడా మా జిలానీలా తన కొటేషనింత 'స్టీప్'గా దిగజార్చుకున్నా దేవిటి చెప్మా... అనిపించింది ఆలోచిస్తే .... పాపం ఆయన ఈ విధంగా 'కనీస ప్రణాళిక'ను ప్రకటించడం ఈ కలియుగంలోని మనలాటి 'Have-Nots' కోసమే కాబోలునని స్ఫురిం చింది. 'ఏదో ఒకటివుంది....నన్ను మాత్రం మరవకండి—' అని మొర పెట్టుకున్నాడేమో ఆ తండ్రి—అని తోచింది.

మున్సిపలాఫీసులు, ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజిలూ, జి—ప—కార్యాలయాలూ వగైరా వగైరాలలో కూడా తమ తమ కొటేషన్లనా విధంగా L.I.G.N.I.G,....అని తగ్గించితే బాగుండును కదా....

కాని వాళ్ళలా చేయరు. కాగితంమీద ముద్ర పడాలి అంటే ఇంత, ఫలానా సర్టిఫికేటు కయితే ఇంత, రిజిస్ట్రేషన్ కయితే ఇంత, ఉద్యోగానికి పేరు పంపాలంటే ఇంత—అని ఖచ్చితంగా వుంది. ఒక్కరేటు మీద నిలబడే హరిశ్చంద్రులు వాళ్ళు; ఒక్కపని ఒక్క రేటు అనే అభినవ శ్రీరామచంద్రులు వాళ్లు. జనతా పార్టీ నాయకుల్లా వాళ్ళ ప్రకటనల్లో వైరుధ్యం వుండదు.

మీరు నేరకపోయి ఇల్లో నివేశనమో కొన్నారనుకోండి. అదేదో బజారులో కూరగాయలవలె ఇలా డబ్బులు పారేసి, అలా సంచీ నింపు కొచ్చేయడం కాదు. మధ్యలో సర్కారు వారి సంతకాలు, ముద్రలు, మొహరులు చాల తతంగంవుంది. మన మంత్రులూ వాళ్ళూ అంటుంటారు కదా! ఈ ప్రభుత్వమూ అధికారులూ అంతా మన సేవకోసమే కదా.... ఈ రిజిస్ట్రేషన్ కోసం వెళ్ళగానే ఆ ఆఫీసులో వాళ్ళందరూ.... "రండి రండి వల్లభరావు గారూ....సదా మీ సేవకోసమే వున్నామ్మేము. అలా కూచోండి .... ఏవీ కాగితాలు .... ఒక అయిదు నిమిషాలుండండి...." అని మీపని ముగించి, గుమ్మందాక వచ్చి మిమ్మల్ని సాగ నంపుతారని అనుకుంటే — మీరు తెలుగు నవల్సినిమాలు మరీ ఎక్కువ చూస్తున్నారన్న మాట....దానికి విరుగుడు కలెక్టరాఫీసు దఫేదారే!

"అయితే నీ దంతా విపరీతం బ్రదర్... దేశం, సంఘం ప్రభుత్వం ...అంటే మజా కావా—" అని మిత్రుడు నారపరెడ్డి చెప్పిన భాష్యం ఇలావుంది,

పత్రం, పుష్పం, ఫలం తోయం అన్నటు వంటి ఆర్టికిల్స్ నాల్గూకూడా ఆధునిక రాజ్యాంగ చట్టం, అయిదో షెడ్యూల్లోవున్న (సామ, దాన, భేద, దండ అన్న) చతుర్విధాలలో రెండవ అధికరణం క్రింద కొస్తాయి. కాలంతో బాటు....అన్నీ మారినట్లే మాటలు అర్థాలలో మారుతాయి. అది తెలిసి నడచు కున్నవాడే వివేకి.

అది ఎట్లన్నన్?

పత్రం—అంటే కోత, ద్వాపర, త్రేతా యుగాల్లోని పత్రం కాదు. ప్రళయకాలంలో ఆ దేవదేవుడికి పడకగా వుండిన వటపత్రం అంత కన్నా కాదు. అడ్డమైన దేశాల దగ్గరా అప్పు లుచ్చుకునేప్పుడు మన రాయబారులూ, విదేశాంగ మంత్రులూ సంతకాలు పెడతారే ఆ పత్రాలు అసలేకాదు.

ఈనాడు సకాలంలో సజావుగా పనులు కావాలంటే, ప్రీతితో కాకపోయినా సరే సమర్పించ వలసిన పత్రాలు వేరేవున్నాయి. అవి పవిత్ర గోదావరీ నదీ జన్మస్థలం అయిన

'నాసిక్'లో అవతరిస్తాయి. రంగు రంగులలో వుండే ఈ పత్రాల మీద పులులు, ఆనకట్టలు ఓడలు వుంటాయి; సాంఖ్యయోగానికి ప్రతీక లయిన కొన్ని అంకెలూ వుంటాయి; అప్పుడపుడు గాంధీగారి బొమ్మలుకూడా కనపడ వచ్చు. ఇటువంటి ఈ పత్రాలను సమర్పించు నాయనా! నీపని సుకరం అవుతుంది సుమా— అని అర్థమట. అర్థంకానివాడు సూకరమట!

అయితే మరీ (బంగారుధర) హెచ్చేం పకేలు వారొచ్చాక "డీమానిటైజేషన్" వంటి దారుణాస్త్రాలు ప్రయోగిస్తున్నారు కనుక చాల మంది దీర్ఘదర్శులూ, దివ్యజ్ఞానులూ పైన చెప్పిన పత్రాలను చూపిస్తే మేనకను చూడ నిచ్చగించని విశ్వామిత్రులవలె చేతులు అడ్డం పెడుతున్నారట. ఇదేవిటి చెప్మా అని డైల మాలో పడిన దలైలామా లందరూ.... అప్పుడు అభినవ భగవద్గీతా భాష్యకారులను సంప్రతించి, వావిళ్ళవారి 'వ్రతరత్నాకరం'లోని పూజావిధిలో చెప్పిన విధంగా "సువర్ణ పుష్పాణి సమర్పయామి?" అని బంగారంగా యెదుట పెడితే ఆ అపర విశ్వామిత్రులు చేతు లడ్డం తీసేసి... "వారి నా ఇల్లు బంగారంకాను....నీ పనెంత నేపయ్యా...." అంటూ ఫోన్‌లో ఆదేశాలిస్తూ ఈ దేశాన్ని ఏలుతున్నవారష!

కానీ ఈ దక్షిణ మార్గంలోనే కొన్ని కష్ట తరమయిన సిద్ధులు పొందాలంటే పత్రం, పుష్పాలతో ప్రదక్షిణలు ముగియడంలేదు. వాటితోబాటే 'ఫలం' కూడా అర్పించవలసి వస్తుంది. ఫలం అంటే ఆపిల్ పళ్ళనీ అమృతపాణులనీ అనుకుంటే తెలుగు మీడియం ఎం. ఏ. అయినంత ఒట్టుస్మండీ! 'ఫలం' అనగా 'ఫలి' లేదా 'ఫలిని' అని చదువు కోవలెను. 'ఫలేరోహ' 'ఫల్గువు' అని గ్రహిం చినా మీ పని జరిగిపోతుంది. ఈ విధమైన 'పనికత్తె' లీ విషాద భారతంలో వీధి కొక రయినా దొరుకుతారు; కొండొకచో వాళ్ళే రాజ్య చక్రాలను తిప్పే అదృశ్య హస్తినులుగా కూడా భాసించడం కద్దు. ఇదంతా తెలియ కుండా ఏవిటీ గోల అని విసుక్కుంటిరా.... వచ్చే జన్మలో విశాఖపట్నం రోడ్డయి పుట్ట గలరు....

పురుషులందు పుణ్యపురుషులవలెనే, పూర్ణ పురుషులూ వుందురు. వాళ్ళు నిండు కుండలు; పత్రం, పుష్పం, ఫలాలతో తృప్తిచెందని ఈ పూర్ణచంద్రరావులకు 'తోయం' చాల వాంఛనీయం. అంతో ఇంతో ఎంతో కొంతోయు పోయ మందుకి తోయజాగ్రేసరులు. ఒకచో 'రమ్మ'ందురు; ఒకచో ఆ 'జిన్ను'ందు కొమ్మం దురు; కొండొకచో మన 'విస్కీ' ములు వేరే తెమ్మందురు; మాటలు 'బీరు' పోనివ్వమందురు. తెల్ల గుర్రాలశ్రేణి విరిగి వర్షించినా వి'బ్రాంది'న్ జెందరు. ఆ సతత సలిల సలీములే ఈనాటి అక్బరు పాదుషాలు? ఈ 'షా' నామాలు తెలి యని పౌరులు అనార్కలీలు. వారి కోరికలకు మిగిలేవి సమాధులు.

—అంటూ మా నారపరెడ్డి చాల హోదాగా ముగించిన ఈ వ్యాఖ్యానం విని నేను ప్రకటనలే తప్ప వార్తల్లేని దిన పత్రికలా వుండిపోయాను.

ఎడగడానికెందుకు అంత తొందర—అన్న సినీ కవి సూక్తి వెనక వున్న గొడవంతా అర్థమయింది.

ఇందుకోసమే కదా ఈ కర్మభూమియందు ఏ అయిదారువేల ఏళ్ళ ముందో అవతరించిన ఆ రాజకీయవేత్త శ్రీకృష్ణుడు ఇంత టూకీగా పత్రం పుష్పంఫలంతోయం—అని సూక్ష్మంలో మోక్షం చెప్పాడూ అని తేటతెల్లమయింది.

వేమన్న చెప్పినట్లు మోక్షగామి కాని వాడెవ్వడు?

ఇహ ఎలాటిమోక్షం అంటారా?

అది పేరే కొశ్చను

ఎవడి స్వర్గం వాడిది.

ఎవడి మోక్షం వాడిది.

మరి సర్వస్వతంత్రాలున్న ప్రజాస్వామ్యం కదా మనది? □

# పగలే వెన్నెలా

# జగమే ఊయలా!

అవును. పగలే వెన్నెల కాస్తున్నట్లు వుంది!

జగత్తు ఊయల ఊగుతున్నట్లుగానూ వుంది!

కాదు, నేనే అటూ యిటూ ప్రక్కలకి ఉయ్యాల ఊగుతున్నట్లుగా వుంది. ఈ ఉయ్యాల ముందుకేగాని వెనక్కి ఊగదు!

బైట హోరుమని తుపాను గాలి వంటి శబ్దం.

లోపల తబలా వాయిస్తున్నటువంటి శబ్దాలు!

సూర్యుడు చందమామలాలేడు. వెండిలా కరుగుతున్నాడు. వెన్న ముద్దలా అవుపిస్తూన్నాడు! నిజం! సూర్యునికేసి మీరు సూటిగా చూడగలరా? మరి నేను చూడగలిగాను!

నేనేమైనా తపశ్శాలి ననుకొనేరు.

అబ్బే! అదేంలేదు. కనీసం బాబానైనాకాదు. మేజిక్కులసలే తెలియవు.

ఈ లోకపుమాయ అపుడపుడు మనసుని గజగజ ఒణికిస్తున్నా, చిన్నమాయతెర పీలికైనా కప్పలేను దానికి.

అవేంటవి?

సత్యాగ్రహుల్లా నిటారుగా నిలబడ్డాయి బారులు తీర్చి.

"కొట్టండి. చంపండి, నరకండి, అయినా మిమ్మల్ని మేమేం చెయ్యం. మా గుండెల్లో విషంలేదు! అమృతమే స్రవిస్తుంది! అంతే కాదు. మీకు నిలువనీడ నిస్తాం. మీ శుభ కార్యాలలో పాల్గొంటాం"

అంటున్నాయవి.

ఏంటవి?

తాటిచెట్లు!

మనం వాటి కపకారం చేసినా, అవి మనకి ఉపకారమే చేస్తాయట!

"అపకారికి ఉపకారము నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ" అన్నాడు. ఎవడా పిచ్చి సన్యాసి. వేమన కాదు కదా! ఎవడైనాగాని పిచ్చి సన్యాసే!

ఉపకారికి ఉపకారం చేసేవాళ్లే లేరీ మనుషుల్లో. అపకారికి ఉపకారం కూడానా? అబద్ధం. అటువంటివి జంతువుల్లో చెట్లు చేమల్లో వుంటాయి.

మదగజాల్లా ముందుకు తోసుకువస్తున్నాయి మేఘాలు.

మోరలెత్తి నాతో మాట్లాడుతున్నాయి.

తొండాలెత్తవు గదా!

"మీ తొండాలెత్తకండర్రోయ్. ఆ వర్ష ధారలకి ప్రకృతంతా తడిసిపోతే దాని అందాలెట్లా చూస్తాను?"

అవి నా మాట వినలేదు.

గుంపుగా గుమిగూడుతున్నాయి. గుసగుసలాడుతున్నాయి.

"మీ దుంప తెగ మీరిహ నామాట వినరు" అని సూర్యునికేసి చూసాను.

సూర్యుడు నా సౌంజ్ఞ గ్రహించాడు. తన కిరణాలతో వాటిని తరిమాడు.

అవి ఒకటేపరుగు. చెల్లాచెదురైపోయాయి.

నేను తనకి పని పురమాయించానని కోపగించాడేమో, తన కిరణాలతో నా కళ్ళలో గుచ్చుతాడేమో అనే సందేహంతో సూర్యుణ్ణి పరకాయించి చూశాను.

ఆదిమధ్య. రమణమ్మ

అబ్బే అదేంలేదు!

"ఏం చేస్తాం మీరు తెలివి మీరిపోయారు. మమ్మల్నే జయించేస్తున్నారు. అయినా అతి తెలివి మంచిది కాదు" అన్నాడు సూర్యుడు.

అంటే? కోపం వుందన్నమాట. వీలుగాక మనసులో దాచుకున్నాడు.

ఇకేంటవి? నీళ్ళా? అబ్బో; పెద్ద నది.

ఈ తెల్ల కాగితం ప్లేట్లో ఏంటవి? ఆ నది లోంచి ఎగిరొచ్చిన చేపలుగాని కాదుగదా!

ఛీ. ఛీ కాదు. అరటికాయ బజ్జీలు! అరవై పైసలట.

చప్పగా వున్నాయి. యింతకంటె మద్రాసు బీచ్‌లో అరవమామి వేయిస్తూన్న వేడివేడి మసాలా వడలే బాగున్నాయి! బెజవాడ కనక దుర్గ కొండ క్రింద మిరపకాయ బజ్జీలే బాగు న్నాయి ఖారం ఖారంగా.

అవన్నీ పరువంలోవున్న వరిపైరులే! ఏంటో ఆ పచ్చదనం ఏదోలా అవుపిస్తోంది.

వాళ్లెవరు? కొండపల్లి బొమ్మల్లావున్నారు? కూలీలా? కర్షకులా?

అవును వాళ్లే! మనకి వాళ్ళంటే చిన్న మాపుకదూ? దరిద్రులూ దౌర్భాగ్యులూ అని.

వాళ్లు దరిద్రులా? ఛ. ఛ. కారే!

వారెంత భాగ్యవంతులో!

వారే దరిద్రులయితే ఇంత భూమాతను కష్టించి పండించి, ఎందరి కడుపులో ఎలా నింపుతారు? వారెంత భాగ్యవంతులో!

ఏ కష్టమూ పడ్డాని కిష్టం లేకుండా కుష న్స్‌లో కూర్చున్న మనమే దరిద్రులం! స్వార్థంతో కుతర్కంతో ఎవరినీ పిసరంత విదపం! రాను రాను ప్రకృతిలో బంగారు కాంతులు కరిగి కరిగి చీకట్లు అలుముకుంటున్నాయి. ఆకాశం చిన్నబోయింది. సూర్యుడు కబుర్లు చెప్పిచెప్పి, నేనూ సామాన్యుణ్ని అయిపోతు న్నానే అనే ఆవేదనతో వెళ్ళిపోయాడు.

రానురాను కారుచీకటి.

ఎంత కళ్ళు చిట్లించి చూస్తున్నా బైట ప్రపంచమేమీ కనపడ్డంలేదు.

పైగా—

నా ముఖమే నాకు కనిపిస్తోంది అద్దాల్లో.

లోపలున్న సాటిన్ తెరలు సోఫాలు అన్నీ గమ్మత్తుగా కనిపిస్తున్నాయి.

అద్దాలు కంటె నిజాలు చెప్పేదెవరు.

ఎప్పుడూ పైకి చూడాలనే మానవుని తపన. తనలోకి తను చూసుకుంటే ఎంత బాగుండును. ఈ అద్దాల్లా పక్క దృష్టిని అడ్డగించి తమలోనికి తాము చూసుకొనే జ్ఞానాన్ని ఎవరైనా కలిగిస్తే ఎంత బాగుండును!

అయినా నా ప్రయత్నం మానలేదు. ఇంకా గుచ్చి గుచ్చి చూస్తుంటే తెరల ప్రతిబింబాలు అవతలనుంచి అపుడపుడు మినుకు మినుకు మనే దీపాలు కనిపిస్తూన్నాయి. ఏవో వూళ్ళో, పట్నాలో కాబోలు.

ఆ దృశ్యం ఎలా వుందంటే—నాటక ప్రారంభం ముందు, తెర వెనుక హారతి వెలి గించి పాటలు పాడే కనిపించని నటీనటుల దృశ్యంలా వుంది.

నా వన్నీ అబద్ధాలు అనుకుంటున్నారుకదూ?

అంతే లెండి మాయ ప్రపంచంలో వున్న మీరంతకంటె వూహించలేరు.

కాని నావి నిజాలు!

కావాలంటే మీరు, ఏరైలైనా సరే ఎ. సి. కంపార్టుమెంట్‌లోకి ఎక్కి ప్రయాణించండి. నా మాటలు అబద్ధాలో నిజాలో తెలుస్తుంది.

ప్రకృతి రహస్యాలని కొల్లగొట్టి కృత్రిమ సుఖాల నమర్చుకుంటున్నాడు మానవుడు.

అవి నిజమైన సుఖాలు కావంటోంది ప్రకృతి.

ఈ రెండింటిలో ఏది నిజమో నాకు తెలి యదు సుమండీ!



# ఆత్మ సంస్తవ యోగం

ఏ గుమ్మంలో చూడు ఎంచక్కని స్వయం ఉపాధి ప్రణాళిక
గుమ్మటంలా కూచుని ఉంటుంది కుల వధూనిక, అదే ఆమె వేదిక
ఏ పుట్టింటారి గొప్ప గురించో ఉపన్యాసం దంచుతూ ఉంటుంది
పనిలేని ప్రేక్షక జనాభాకి మన పుణ్యభూమిలోనా ఇబ్బంది!



అంటు జబ్బులాంటి డబ్బూ అజీర్తి లాంటి కీర్తీ
సంపాదించుకుంటారు పెద్దలు పాపం ఎంతో కష్టపడి
చచ్చే దాకా తపనే, నిలబెట్టుకోవాలని ఆస్థాయి
పోల్చి చూస్తే దాంతో, సామాన్యుడి పని ఎంత హాయి!



'ఈ గొంతుక మా ముత్తాతది. మరి ఇదో, మా నాయనమ్మగారిది
అక్కడక్కడ ఆయాసం అనిపించింది చూశారా, ఆ స్వరం మా నాన్నది...
....అంటూ వంశపు 'త్రేపురికార్డు' వినిపిస్తున్న అతగాడే అమాయకుడు
అప్పుకోసం వచ్చి ఆపద్ధర్మంగా తలూపుతున్న ఆ శ్రోతకి పుస్తెడు చెవుడు!



ఈ సహస్రనామ జపాలు, లక్ష ఒత్తులనోములు, కోటి లింగార్చనలు
మొక్కుబడిగా దేవుడికి అర్పించి యిలాంటి ప్రశంసా పత్రాలు
క్రమంగా చేసుకున్నాడు మనిషి తనని తను పొగుడుకునే వీలు
అవే నేటి సన్మాన సభలు, అభిమాన సంఘాలు, వారం వారం భజనలు!



'మీ ఫిగరు బావుంటుంది. చిన్న ఫోటో తీసుకోనివ్వరూ మేష్టారూ?'
అని కెమేరాతో లేడీ స్టూడెంట్ తయారైతే ఏ లెక్చెరరు కాదనగలరూ?
ఏ పోజు మోజు దానిది. ఆ అమ్మాయిదే ఆ ఏటి హైయెస్టు ఫోటలు
ఆ కెమేరాలో సాధారణంగా ఫిల్ము ఉండదని ఎందుకండీ కిట్టని మాటలు?



జీవితం అంతా ప్రజాసేవకి మీదు కట్టిన ఓ మినిష్టరుగారు
కేవలం రెండే రెండు కోరికలతో తృప్తి పడుతున్నారు
మరేం లేదు యింటింటా వారి జీవిత చరిత్ర పఠనా
మహా అయితే ప్రతివీధి చివరా చిన్న శిలావిగ్రహస్థాపనా!

అవసరాల రామకృష్ణారావు ఆలపించు రసవద్గీత (12)

సీరియల్




**3**

రెండు నెలల అనంతరం....

సుధీర్ ఆఫీసు రూమ్‌లో కూర్చుని ఎవరితోనో మాట్లాడుతున్నాడు. లక్ష్మీరంజనంగారు ఆ గదిలోకి వచ్చారు. ఆయన వెంట స్వప్న వుంది. లక్ష్మీరంజనంగారిని చూడగానే, సుధీర్ కూర్చోమని కుర్చీ చూపించాడు. ఆయన కూర్చున్నారు. పక్కనే వున్న మరో కుర్చీలో స్వప్న కూర్చుంది. సుధీర్ వచ్చినవాళ్ళతో మాట్లాడటం పూర్తిచేసి, వాళ్ళని పంపి గదిలోకి తిరిగి వచ్చాడు.

అతన్ని చూడగానే లక్ష్మీరంజనంగారు కుర్చీలోనుంచి లేచాడు.

ఆయన వెంటే స్వప్న కూడా లేచి నిలబడింది.

"చెప్పండి మాస్టారూ! ఏమిటి?" అన్నాడు సుధీర్.

"ఏం లేదు బాబూ! ఈ రోజు వూరువెళ్ళిపోతున్నాం. అందుకని చెప్పటానికి వచ్చాను" అంటూనే ఆయన జేబులో నుంచి వంద రూపాయల నోట్లు రెండు తీసి సుధీర్‌కి యిస్తూ, "స్వప్నకోసం నువ్వు బోలెడంత ఖర్చు చేసావు. నాకింతకంటే శక్తిలేదు. యిది వుంచు" అన్నారు.

సుధీర్ క్షణంసేపు ఆయన చేతిలో వున్న నోట్లవంక, నిస్సహాయంగా వున్న ఆయన ముఖం వంక మార్చి మార్చి చూసాడు.

"ఏమిటి మాస్టారూ యిది? నేను డబ్బు కోసం యీ కేసు తీసుకున్నానను కున్నారా?" అతని గొంతులో నమ్రతతో కూడిన నిష్ఠూరం వుంది.

"కాదు కాదు. కలలో కూడా నేను అలా అనటం లేదు. భగవంతుడు నీకు బీదవాళ్ళని చూడాలనే గొప్ప మనసు యిచ్చాడు. ఆ గొప్ప మనసుతోనే నేను అడగగానే యింత సాయం చేసావు. స్వప్నకి నువ్వు మళ్ళీ జీవితం ప్రసాదించావు. నీ అండేగనక లేకపోయినట్టయితే...." ఆయన చప్పున వుత్తరీయంతో కళ్ళు తుడుచుకున్నారు. "నీ ఋణం యీ జన్మలో తీర్చుకోలేను."

సుధీర్ మాట్లాడలేదు. ఆయన చేతిలో వున్న నోట్లు అందుకుని, తిరిగి ఆయన జేబులోనే పెట్టేసాడు.

"ఊరు ఎప్పుడు వెళ్తున్నారు?"

"సాయంత్రం రైలుకి."

"అమ్మని కలిసారా?"

"ఆ! నేను వచ్చి చాలాసేపయింది. నువ్వు క్లయింట్స్‌తో మాట్లాడుతున్నావంటే అమ్మగారి దగ్గర కూర్చున్నాను. నువ్వు నిజంగా ఆ తల్లికి తగ్గకొడుకువే! ఈ కష్ట సమయంలో, ఆమె మాకెంతో ధైర్యం చెప్పబట్టి, మతి చెడకుండా, మామూలు మనిషిగా నిలబడగలిగాను. అలాంటి గొప్ప బుద్ధిగల వ్యక్తిని నేనెక్కడా చూడలేదు."

తల్లి ప్రసక్తిరాగానే అతని కళ్ళల్లో గర్వరేఖ తొంగి చూసింది. "అలాంటి అమ్మని కలిగి వుండటం నా అదృష్టంకదూ మాష్టారూ!" అన్నాడతను.

"అవును బాబూ! నువ్వు అన్ని విషయాల్లోనూ అదృష్టవంతుడివే!"

"ఏది? మీలాటి మాష్టారుగారిని పొంది, చిన్నప్పుడు దెబ్బలు తినడంలో కూడానా?" అతను చిరునవ్వుతో అన్నాడు.

లక్ష్మీరంజనం మాష్టారు ముఖంలో దుఃఖం, బాధ మాయమై, చిరునవ్వు విరిసింది.

"ఆహా! అందులో కూడా. నిన్ను చూస్తూంటే నాకెంత గర్వంగా వుందో తెలుసా! యింత చిన్న వయసులో యింత పేరు, ప్రతిష్ట. కోర్టులో యీ కేసు కోసం మొట్ట మొదటిసారి వెళ్ళగానే, నువ్వు మా లాయరువి అని చెప్పగానే అందరూ ఏమన్నారో తెలుసా? యిక మీరు ఆ కేసు గెలిచినట్టే భావించి నిశ్చింతగా వుండండి అని చెప్పారు."

"అబ్బా! చిన్నప్పుడు హోమ్‌వర్క్ చేయలేదని, మీచేత తెగ తిట్లు తిని, యిప్పుడిలా పొగడ్తలు వింటుంటే. నిజంగా చాలా ఆనందంగా వుంది."

---

జరిగిన కథ :

తనని బలవంతం చేసిన పొరుగింటి మోహన్‌ను ఆత్మరక్షణార్థం చేతికందిన వస్తువుతో కొట్టింది స్వప్న. మోహన్ మరణించాడు. స్వప్నపై హత్యానేరం మోపబడింది. ఆ షాక్‌తో స్వప్న తల్లి చనిపోయింది. స్వప్న మేనమామ లక్ష్మీరంజనం స్వప్నను కాపాడమని తన శిష్యుడు సుధీర్‌ను కోరాడు.

---

# గ్రామాల్లో గంగావతరణం...

త్రాగేందుకు పరిశుభ్రమైన మంచినీరు మన ప్రాథమిక అవసరాల్లో ఒకటి.

ఆంధ్రప్రదేశ్ ప్రణాళికల్లో గ్రామీణ నీటిసరఫరా పథకాలకు తగిన ప్రాధాన్యతను ఇవ్వడం జరిగింది.

ఈ పథకాలను చురుకుగా అమలు జరిపేందుకే 1978–79 బడ్జెట్‌లో రు. 7.25 కోట్ల రూపాయల నిధులను కేటాయించడం జరిగింది.

ఈ మొత్తంలో రిగ్గుల సేకరణ, బోరింగు బావుల నిమిత్తం ఆంధ్రప్రదేశ్‌లో నీటిపారుదల అభివృద్ధి సంస్థకు ఒక కోటి రూపాయలు కేటాయించారు. ప్రస్తుతం ఉన్న బావుల్లో నీటిసరఫరాను మెరుగుపర్చడానికి కొన్ని ప్రాంతాలలో తటాకాలను నిర్మిస్తున్నారు.

మన ఆంధ్రప్రదేశ్‌లోని కోట్లాది ప్రజానీకం మంచినీటి అవసరాన్ని తీర్చడానికే ఈ భగీరథ కృషి

---

"అయితే నువ్వేదీ మర్చిపోలేదన్న మాట! అవునవును, అప్పుడు కూడా అంతే, ఒకసారి చదివితే వచ్చేసేది. కానీ చదివేవాడివే కాదు. అప్పుడు ఆ ఆటలు, యీత ఆ మోజు మీద వుండేది నీ మనసంతా. వస్తాను. ఈ వూరువస్తే అమ్మగారికి కనిపించకుండా వెళ్ళను. నీ ఉపకారం జన్మలో మర్చిపోలేను."

"అలా అనకండి! చిన్నప్పుడు మీ దగ్గర చదువుకున్న చదువుకి నేనీ గురుదక్షిణ యిచ్చాననుకోండి."

"పుత్రపౌత్రాభిరస్తు" ఆయన చేయి ఎత్తి దీవించారు. "చల్లగా నూరేళ్ళపాటు బ్రతికి, మాలాటి పేదవాళ్ళకి యిలాగే సాయం చేస్తూ వుండాలి."

"చూసారా, మీ రిచ్చిన యీ ఆశీస్సుకి ప్రపంచంలో వున్న ఏ డబ్బూ సరి తూగదు!" అతను నవ్వుతూ అన్నాడు.

సుధీర్ మాష్టారుగారితో మాట్లాడుతూనే వున్నా, మధ్య మధ్యలో అతని కళ్ళు చురుగ్గా స్వప్న మీద నిల్చి, ఆ అమ్మాయి ముఖ కవళికల్ని నిశితంగా పరిశీలిస్తున్నాయి. స్వప్న మ్యూజియంలో పాలరాతి బొమ్మలా నిలబడి వుంది. బొమ్మ చూడటానికి అందంగా, సజీవంగా కన్పిస్తుంది. కానీ మాట్లాడదు. స్వప్న కూడా అలాగే వుంది.

నిజం చెప్పాలంటే, ఆ అమ్మాయి శారీరకంగా అక్కడ నిలబడివుందేగానీ, మానసికంగా లేనట్లుగా, పరధ్యానంగా వుంది!

లక్ష్మీరంజనంగారు వెళ్ళటానికి బైలుదేరుతుంటే, స్వప్న యంత్రంలా ఆయనవెంటే నడిచింది.

"అతనితో వెళ్తున్నానని చెప్పు స్వప్నా" గుమ్మం దాటుతుండగా, తగ్గు స్వరంలో ఆయన మేడకోడలిని మందలించేరు.

స్వప్న ఆగింది. వెనక్కి తిరిగింది.

వెనకగదిలో సుధీర్ టేబిల్ ఆనుకుని నిలబడి యిటే చూస్తున్నాడు. మామయ్య చెప్పాడు కాబట్టి, ఆ పని చేసెయ్యాలన్నట్టుగా, స్వప్న పెదవులు ఏదో చెప్పటానికి విడివడినాయి. కాని మళ్ళీ ఏం చెప్పాలో తెలియనట్టుగా, ఆ పని తనవల్ల కాదన్నట్టుగా, మూసుకున్నాయి.

కానీ క్షణంలో సగంసేపే అయినా, ఆ కొద్దికాలంలోనే, యిద్దరి చూపులూ కలుసుకున్నాయి.

సుధీర్ స్వప్ననే చూస్తున్నాడు! ఆ అమ్మాయి కళ్ళలో ఎలాటి భావం లేదు! మూగపోయిన వీణలావుంది! ఏమనుకుందో ఏమో, గిరుక్కున వెనక్కి తిరిగింది. మేనమామకంటే రెండడుగులు ముందే నడిచింది.

లక్ష్మీరంజనం మాస్టారు వెనక్కి తిరిగి క్షమాపణగా చూస్తూ అన్నారు.

"నిజంగానే దీని మనసు సరిగ్గాలేదు బాబూ! కనీసం కృతజ్ఞతగా నీతో ఒక మాటయినా అనటం లేదు."

"ఫర్వాలేదు మాస్టారూ. నేను ఏదయినా సాయం చేసివుంటే, మీకు అని చేసానుకానీ, ఆ అమ్మాయికోసం చేయలేదుగా!" అన్నాడు. ఆ క్షణంలో అతన్ని చూస్తుంటే, ప్రతిదాన్ని చిరునవ్వుతో స్వీకరించే శక్తి అతనికి భగవంతుడు యిచ్చిన వరంగా అనిపించింది!

"వస్తాను." ఆయన మరోసారి చెప్పి వెళ్ళిపోయారు.

సుధీర్ వచ్చి టేబిల్ దగ్గర కూర్చున్నాడు. డ్రాయరు తెరిచి ఏవో ముఖ్యమైన కాగితాలు తీయబోయిన అతనికి, స్వప్నకేసు ఫైలు కనిపించింది! క్షణంసేపు అతని దృష్టి తదేకంగా, దానిమీద నిల్చింది.

ఆ రోజు మాస్టారుగారితో వెళ్ళి, జుడీషియల్ కస్టడీలోవున్న స్వప్నని జామీను యిచ్చి విడిపించినప్పటి నుంచీ యీనాటి వరకూ, రోజూ, యింట్లో తల్లి తను కూర్చుని మాట్లాడే సమయంలో స్వప్నని గురించి ప్రసంగం ఏదో ఒక మాటలో వస్తూనేవుంది!

స్వప్న! వాట్ ఎ బ్యూటిఫుల్ నేమ్! ఆ రోజు పేరు వినగానే అనిపించింది!

లక్ష్మీరంజనంగారితో వెళ్ళి స్వప్నని చూసిన మొదటి క్షణంలో, ఆ పేరు యింకా, ఎన్నోరెట్లు బాగున్నట్టు అనిపించింది. చాలామందికి మంచి పేరువుంటే, వాళ్ళరూపం పేరుతో జత కుదరదు! కానీ, స్వప్నకి రూపం, పేరు పోటీ పడుతున్నట్లుగా వుంటాయి! కుర్చీలో వెనక్కి ఆనుకుని, అతను ఆ ఫైల్ శ్రద్ధగా తిరగేసాడు.

అతని కళ్ళు క్షణంసేపు స్వప్న తండ్రిపేరుమీద నిల్చినాయి. అతని కళ్ళ ముందు,మాస్టారుగారు 'వెళ్తున్నామని' చెప్పమని స్వప్నని మందలించటం, ఆ అమ్మాయి వెనక్కి తిరిగి, ఏదో చెప్పబోయి వెంటనే ఆగి, గిరుక్కున తిరిగి వెళ్ళటం, ఆ దృశ్యం అతని కళ్ళముందు మెదిలింది! ఈ రెండునెలల్లో స్వప్నతో తను చాలా మాట్లాడాడు! స్వప్న నోటినుంచి ఆ నాటిరాత్రి నిజంగా ఏం జరిగిందో రాబట్టటమే అతనికి పెద్దకష్టం అయిపోయింది!

ఇక్కడే యీ గదిలోనే, అదంతా అడిగాడు. లక్ష్మీరంజనం మాస్టారు ఆదుర్దాగా, యీ ఎదురు కుర్చీలో కూర్చునివున్నారు. ఆ అమ్మాయి తల దించుకుని కూర్చుంది.

"స్వప్నా! ఇది నీకు జీవన్మరణ సమస్య! ఆ రోజు రాత్రి నువ్వు వెళ్ళినప్పుడు ఏం జరిగిందీ, సిగ్గుపడకుండా, దాపరికం లేకుండా చెప్పెయ్యి!" అని అడిగాడు తను.

స్వప్న మాట్లాడలేదు! నిటారుగా, తల దించుకుని కూర్చుంది. పయిటచెంగు




మెలిపెడ్తున్న చేతివేళ్ళ కదలిక మినహా ఆ శరీరంలో యింకే చలనమూ లేదు.

"చెప్పమ్మా! అతను అడగకుండానే చెప్పాల్సిన బాధ్యత నీది! అలాటిది ఎన్నిసార్లు అడిగినా చెప్పకపోతే ఎలా!" లక్ష్మీరంజనంగారు, విసుగ్గా, కోపంగా అన్నారు. అరగంట నుంచీ ఆయన స్వప్న ధోరణిని చూస్తూనేవున్నారు. సుధీర్ ఎంతో సహనంతో, ఎన్ని విధాలగానో అడుగుతుంటే, 'ఊ' 'ఆ' అనకుండా, రాయిలా కూర్చుంది!

"ఏంజరిగితే ఎందుకు మామయ్యా! అతను చచ్చిపోయాడు! నేను చంపే సాను! నాకు శిక్ష పడుతుందనేగా నీ భయం! నాకు ఆ శిక్షగురించి భయం లేనప్పుడు, నీ కెందుకు! నేను నీకు మొదటే లాయర్ వద్దని చెప్పాను!"

సుధీర్ టేబిల్‌ని ఆనుకుని స్వప్ననే చూస్తున్నాడు. స్వప్నలో ఒక విధమైన పాషాణంలాటి నిశ్శబ్దత, మౌనం కన్పిస్తున్నాయి!

లక్ష్మీరంజనంగారిలో అంతవరకూ బిగబట్టుకుంటున్న కోపం భగ్గుమన్నట్టు తారస్థాయికి లేచింది. కుర్చీలోనుంచి ఆవేశం పట్టలేనట్టు లేచారు. "స్వప్నా! నీ ధోరణేమిటో నాకు బొత్తిగా అర్థంగావటంలేదు! అంటే నీ వుద్దేశ్యం ఏమిటి! నీ ఖర్మానికి నిన్ను వదిలేసి నాదోవని నన్ను పొమ్మనా! అలాపోతే, చచ్చిన నా చెల్లెలి ఆత్మకి శాంతి వుంటుందా!"

స్వప్న పెదవులమీద చిరునవ్వు కదిలింది.

ఆ చిరునవ్వులో వేదాంతంతో కూడిన హేళనవుంది.

# ప్రాథమిక విద్యారంగంలో నూతన దృక్పథం...

ఆంధ్రప్రదేశ్‌లో ప్రాథమిక విద్యారంగంలో ప్రమాణీకృతమైన పెంపుదలను సాధించే దృష్టితో "అభ్యుదయ ప్రాథమిక విద్యాసంస్థ"ను ఏర్పాటు చేస్తున్నారు. ప్రజల విరాళాలతో మాత్రమేగాక వివిధ దేవాదాయ, ధర్మాదాయ సంస్థలనుంచి నిధులు సేకరించి ఈ సంస్థ అవసరమైన కార్యక్రమాలను అమలు జరుపుతుంది.

దాదాపు ఆరు వందల పాఠశాలలను అభ్యుదయ ప్రాథమిక విద్యాసంస్థ అధీనంచేస్తారు. యువతరం నడవడికను తీర్చిదిద్దడంలో తోడ్పడే వృత్తిపరమైన విద్య, నైతిక విద్యను బోధించడానికి ఉపాధ్యాయులకు అవసరమైన ప్రత్యేక శిక్షణ యివ్వడంతోపాటు పాఠశాలలకు అవసర భవనాలు, ఆటస్థలాలు మొదలైన అన్ని సౌకర్యాలు ఈ సంస్థ కల్పిస్తుంది.

నిజానికి అభ్యుదయ ప్రాథమిక విద్యాసంస్థ ఏర్పాటుతో ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యారంగంలో గమనార్హమైన ముందడుగు వేసిందనే చెప్పాలి.

---

సమాచార పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.

21/78-79

"హుః శాంతిః అమ్మ బ్రతికివున్నప్పుడు శాంతి లేదుః చనిపోయిన ఆత్మకి శాంతికావాలిః"

"అంటే, అంటే నీ వుద్దేశ్యంః అది బ్రతికివున్నప్పుడు నేను ఏం సాయం చేయలేకపోయాననేగాః నేను చాతగాని చవటననేగాః అందుకు నేను ఏడుస్తూనే వున్నానుః నువ్వు నన్ను దెప్పనవసరంలేదు. కనీసం నిన్నయినా రక్షిస్తే, చచ్చి పోయిన మీ అమ్మకి కాదే, శాంతి, నాకుః నాకుః" ఆయనచేత్తో ఛాతీమీద చరుచు కున్నారు.

"మాస్టారూః మీరు అనవసరంగా ఆవేశపడుతున్నారుః"

సుధీర్ ఆయన దగ్గరగావచ్చి చేయి పట్టుకున్నాడు. "మీరు యిలా రండిః కూర్చోండిః మనకి కావాల్సిన విషయం వదిలేసి యింకేదో మాట్లాడుతున్నారు."

"చూడవయ్యాః అది నన్ను ఎలా చూస్తోందో! నేనేంచెయ్యను చెప్పుః వీళ్ళని యింటికి తీసుకెళ్ళి అట్టిపెట్టుకున్నానుః ఆడవాళ్ళకి పడలేదుః వీళ్ళు చెప్ప కుండా వెళ్ళారు. నేను వచ్చి తీసుకువెళదామనే అనుకుంటున్నానుః ఇంతలో యీ అఘాయిత్యం జరిగిపోయిందిః దానిమీద నాకు అభిమానం లేకపోతే, నేను ఎందుకింత ప్రాకులాడుతానుః నాకేం అవసరంః"

స్వప్న కుర్చీలోనుంచి లేచింది. "నీకు యీ ప్రాకులాట వద్దనే నేను చెబుతున్నానుః అందుకే నా చావు నన్ను చావనీయమన్నానుః యీ బెయిలు, యీ లాయర్లు, యీ గొడవేం వద్దన్నాను. ఇంట్లోంచి వెళ్ళగొట్టినవాళ్లు మళ్ళీ నా జోలికి ఎందుకు రావాలిః నువ్వు నామీద అభిమానంతో యీ సహాయం చేయటం లేదుః నువ్వు నాకోసం ప్రాకులాడటం లేదుః లోకం కోసంః లోకం నవ్వుతుం దేమో, హేళన చేస్తుందేమోననే భయంతో వచ్చావుః"

"విన్నావాః విన్నావా సుధీర్ః దీని మాటలుః"

ఆయన ఏడుపు గొంతుతో చిన్న పిల్లాడిలా అన్నాడు.

ఆయనని కుర్చీలో కూర్చోపెడుతున్న సుధీర్ స్వప్ననే చూస్తున్నాడుః ఆ అమ్మాయి కళ్ళలో తీక్షణత్వానికి అతను విస్తుపోయాడుః బెబ్బులిలావుంది స్వప్నః ఆ నిదానం, మౌనం, అంతా ఒక ఆచ్ఛాదన మాత్రమేః దానివెనక భగ్గునమండే మంట వుందిః

కుర్చీలోనుంచి లేచిన స్వప్న కాళ్ళతో దాన్ని వెనక్కితోసిందిః "నే నిప్పుడు మళ్ళీ చెబుతున్నానుః నా సంగతి నీకు అనవసరంః నాకు యీ బెయిలు, యీ లాయరు, యీ గొడవంతా ఏమీవద్దు. నేను సరాసరి పోలీసుల దగ్గరకి వెళ్తున్నాను. నా అదృష్టం ఎలావుంటే అలా జరుగుతుందిః నా పేరుకూడా నువ్వు తలవద్దుః మీ చెల్లెలితో పాటు, స్వప్నకూడా చచ్చిపోయిందని అనుకోః" స్వప్న అలా అంటూనే గబగబా అడుగులువేసి, చరచరా వెళ్ళిపోతూనే వుందిః

"స్వప్నా!" సుధీర్ పిలిచాడు. ఆ అమ్మాయిని అతను మొదటిసారి పిలవటం అది.

స్వప్న ఆగింది.

అతను దగ్గరకి వచ్చాడు. "నేను నీకు బెయిల్ యిచ్చి విడిపించాను. యిప్పుడు నీ బాధ్యత నాది! ఆ మాట మర్చిపోకు!"

"నే నెక్కడకీ పారిపోవటంలేదు! పోలీసుల దగ్గరకేగా వెళ్తున్నాను!"

"మహా గొప్ప పనిచేస్తున్నావు! నేను జామీనుయిచ్చి విడిపించిన వ్యక్తి, మళ్లీ పోలీసుల దగ్గరకి వెళితే, వాళ్ళేమనుకుంటారు!"

ఈలోపలే లక్ష్మీరంజనంగారు అక్కడకి వచ్చారు. ఆయన స్వప్న రెండు చేతులూ పట్టుకున్నారు. "స్వప్నా! నువ్వు నాకు యింకే శిక్ష అయినా వెయ్యవే! సంతోషంగా భరిస్తాను। కానీ-కానీ-యిలా మాత్రంకాదు. ఇప్పటికే నేను సగం చచ్చిపోయాను."

సుధీర్ అన్నాడు. "వెళ్ళిపోవటం నీ యిష్టమే అనుకోకు! పెద్దాయనని ఎందుకలా బాధపెడ్తావు! రా! లోపలకి!"

స్వప్న మాట్లాడలేదు.

"నీకే చెప్పేది!"

స్వప్న మరింత నిటారుగా అయింది! ఆ కళ్లల్లో భగ్గుమన్న అవమానం అతన్ని కాల్చెయ్యటానికి బుసలు కొడ్తున్నట్టుగా చూసింది!

'నువ్వు నన్ను ఏం చెయ్యలేవు!' అన్నట్టుగా చూస్తూ అడుగు ముందుకేయటానికి కాలు కదిపింది.

సుధీర్ చెయ్యి చటుక్కున స్వప్న జబ్బని పట్టుకుంది. అది పోలీసు బేడీలా కఠినంగా, బలంగా వుంది.

"నువ్వు యింకా మొండితనం చేసావంటే, నీ కాళ్ళూ చేతులూ కట్టి గదిలో పడెయ్యమంటాను! రామూ! రామూ!" గట్టిగా పిలిచాడు. రాము 'వస్తున్నా అయ్యా' అన్నాడు.

మరుక్షణంలో రాము వస్తూ కనిపించాడు. స్వప్న తృటికాలం సుధీర్ కళ్ళలోకి చూసింది. అతను అన్నంతపనీ చేసేట్టే వున్నాడు స్వప్న సుధీర్ చెయ్యి బలంగా విదిలించి, వదిలించుకుంది. వెనక్కి తిరిగి వచ్చి కుర్చీలో కూర్చుంది.

లక్ష్మీరంజనంగారు బ్రతుకుజీవుడా అన్నట్టు చూస్తూ తిరిగి తన కుర్చీ దగ్గరకి వచ్చారు.

"ఏంటయ్యా పిల్చారు?" అన్నాడు రాము.

సుధీర్ తమాయించుకున్నట్లు చూశాడు.

# అందరికీ ఆరోగ్యం

ఆరోగ్యమే మహాభాగ్యం.

ఆ మహాభాగ్యం అందరికీ అందించాలి మరి.

అందుకు:

పల్లెపట్టుల్లో పట్టణాల్లో ప్రజలందరికి వైద్య సౌకర్యాలు అందించేందుకు ప్రణాళికా వేత్తలు ప్రాధాన్యతనివ్వాలి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఈ రంగంలో కూడా ముందడుగు వేసింది. హైదరాబాదులో ఉస్మానియా జనరల్ ఆస్పత్రిలో మూడు దొంతరల వైద్య పథకం ఒకటి చేపట్టారు. డబ్బు చెల్లించే పద్ధతిపై ఆస్పత్రిలోని రోగులకు అదనపు వైద్య సౌకర్యాలు రాత్రిబవళ్ళు వైద్య సేవలు లభింపజేయడం ఈ పథకం లక్ష్యం.

ఈ ప్రయోగాత్మక పథకం విజయవంతమైతే రాష్ట్రంలో మిగతా వైద్య కళాశాలల అనుబంధ ఆస్పత్రుల్లో సైతం ఈ పథకం అమలు జరిగేందుకు ఉద్దేశింపబడింది.

ఇంకా:

ఆంధ్రప్రదేశ్ లోని వివిధ జిల్లాల్లో క్రొత్త వైద్యశాలల స్థాపనకు, వైద్య సంస్థల భవనాల నిర్మాణానికి క్రొత్త కార్యక్రమాలు చేపట్టడం జరుగుతూంది. ఇందుకు 1978-79 బడ్జెట్ లో 93 లక్షల రూపాయలు ప్రత్యేకించబడ్డాయి.

అనారోగ్యాన్ని పారద్రోలడం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ లక్ష్యం.

సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.

22/78-79




"మూడు కప్పులు కాఫీ పట్టుకురా." అన్నాడు. అతను కూడా టేబిల్ దగ్గరికి వచ్చాడు.

"ఊ! చెప్పు. ఏం జరిగింది" అడిగాడు సుధీర్.

స్వప్న చెప్పటం ప్రారంభించింది.

అతను ఆ మాటలు వింటూ, కాగితం మీద పాయింట్స్ నోట్ చేసుకుంటున్నాడు.

వ్రాస్తున్న అతను మధ్యలో ఎందుకో తలెత్తేసరికి, స్వప్న జబ్బ దగ్గర జాకెట్ చేతి దిగువుగా చూసుకుంటోంది. సుధీర్ కూడా అటు చూసాడు. స్వప్న చేతిమీద అతని వేళ్ళ గుర్తులు ఎర్రగా కంది స్పష్టంగా కన్పిస్తున్నాయి.

కేసు గెలవటానికి సుధీర్‌కి చాలా కష్టం అయింది. చాలా కేసుల్లో ఎదుట వారు ప్రత్యర్థులు అయితే, ఈ కేసులో ముద్దాయే తనకి తాను ప్రత్యర్థి అన్నట్టుగా, లాయరు చెప్పిన ప్రతిదానికీ వ్యతిరేకం చెప్పి కేసుని తికమక చేసింది!

అదృష్టవశాత్తూ స్వప్న తల్లి మరణించటం అనే పాయింట్ సుధీర్‌కి బలీయమైన ఆధారం అయింది. ఆ అమ్మాయి మనస్థిమితం సరిగ్గాలేదని ఆసరా తీసుకున్నాడు.

స్వప్న చూపే విముఖత్వం, కొందరికి వేరే అభిప్రాయం కలుగజేసింది. స్వప్న నిజంగా ఆ హత్య చేసిందని, సుధీర్ తన సామర్థ్యంతో, పలుకుబడితో ఆ అమ్మాయికి పడబోయే శిక్ష తప్పించాడని చెప్పుకోసాగారు.

మంచికిపోతే చెడు ఎదురు అవుతుందంటారు అన్నట్లుగా, స్వప్న కేసు మూలంగా, అతనికి తృణం ఫీజు రాకపోయింది కాకుండా చేతి డబ్బు వదిలి కూడా అతను యీ కేసుని ఏదో గోల్‌మాల్ చేసాడనే అపఖ్యాతి వచ్చింది. ఇది గుర్తు

# చిన్న రైతులకు పెద్ద ఎత్తున సహాయం

ఈనాడు మన సన్నకారు రైతులు అభివృద్ధి చెందుతున్న మన ఆర్థిక వ్యవస్థలో కీలక పాత్ర వహిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ లో యిప్పుడు అమలులో ఉన్న సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ కార్యక్రమాలు, లాభసాటిగాని రైతుల, వ్యవసాయ కూలీల పథకం, పశుపోషణ కార్యక్రమాలు ఇవన్నీ సమాజంలోని బలహీన వర్గాలకు చెందిన రైతులు, సన్నకారు రైతుల సంక్షేమానికి ఉద్దేశించబడినాయి.

1978 జనవరి ఆఖరు నాటికి సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ వారు అన్ని విధాల సహాయం అందజేయడానికి 6.58 లక్షల మంది రైతులను గుర్తించారు. క్షామపీడిత ప్రాంతాల అభివృద్ధి కార్యక్రమం అమలు నిమిత్తం జిల్లాలలో 1974-75 నుంచి 1977-78 మధ్యకాలంలో రూ. 22.54 కోట్ల మొత్తం సహాయక గ్రాంటుగా ఇచ్చారు.

తత్ఫలితంగా చెరువులు, బావులు, అడవుల పెంపకం, పాడిపశువుల పంపిణీ వంటి కార్యక్రమాల అమలులో ప్రోత్సాహకరమైన ఫలితాలను సాధించాం. ఇందువల్ల విస్తరిస్తున్న గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో సన్నకారు రైతులు కీలకపాత్ర వహించగలుగుతున్నారు.

---

సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.

19/78-79

వస్తే, అతనికి కోపమే వస్తోంది! కేవలం లక్ష్మీరంజనం మాష్టారుగారి కోసం యీ కేసు తుదివరకూ చూసి గెలిపించాడు. లేకపోతే స్వప్న తలతిక్కతనానికి అతను మధ్యలోనే వదిలేసేవాడు.

ఇంతలో ఫోన్ మోగింది.

సుధీర్ ఫైల్ చూస్తూనే ఫోన్ తీసాడు. అవతల నుంచి గొంతువినగానే, అతని ముఖం ప్రసన్నం అయింది.

"హలో... విమీ!" అన్నాడు.

"..............."

"అబ్బా! పనుంది...." సాకు చెప్పబోయాడు.

"................. "

"వద్దు వద్దు. నేనే వస్తాను" గాభరాగా అంగీకరించాడు.

"..................."

"థాంక్యూ! మా విమల ఎంత మంచిదో! అలాగే అమ్మకి చెబుతాను" అన్నాడు.

అతను ఫోన్ పెట్టేసాడు. చేతిలో ఫైలు డ్రాయరులో పెట్టి తాళంవేసి లేచి లోపలకి తల్లి వున్న గదిలోకి వచ్చాడు.

"అమ్మా! నీ ముద్దుల మేనకోడలు ఫోన్ చేసింది" అన్నాడు.

అహల్యమ్మగారు వంటమనిషికి సాయంత్రం భోజనంలోకి ఏం చేయాలో పురమాయిస్తోంది.

"ఏమిటి?"

"ఏముంది! పుట్టిన రోజట! భోజనానికి రావాలిట!"

"ఇదేం పిలుపు! ఇంటికి వచ్చి చెప్పాలిగాని, ఫోన్‌లోనా ఆహ్వానం?"

"వస్తానంది. నేనే వద్దన్నాను."

"మామయ్య వూరినుంచి వచ్చాడా?"

"ఏమో తెలియదు. అడగలేదు.

విమల నీమీద ఎప్పుడూ చేసే ఫిర్యాదు అదే! ఏదీ నువ్వు అడగవుట! తను చెబుతుంటే వినవుట."

"అందులో నా తప్పేం లేదమ్మా! చిన్నప్పటినుంచీ వినీ వినీ అలవాటయిపోయి, విమల ఎప్పుడు ఏది మాట్లాడుతుందో నాకు తెలుసు. ఆ నగలు, చీరెలు, ఆ గొడవ నాకు వినాలంటేనే విసుగు పుడుతుంది."

"ఆ మాట దాని దగ్గర అను చూద్దాం!" నవ్వుతూ అంది ఆవిడ.

"అదే గొడవ వచ్చి పడింది. విమలమాట ఏదీ కాదనలేను. అక్కడ తొట్టిలో తల్లి పెంచిన తులసిచెట్టు ఆకులు గిల్లుతూ అస్పష్టంగా అన్నాడతను.

(సశేషం)

# చీకటి నీడలు



రామంకు గంటక్రితం విజయవాడనుంచి టెలిగ్రాం వచ్చింది....వాళ్ళన్నయ్యకు సీరియస్‌గా వున్నదట - అందర్నీ రమ్మనమంటూ...రామం మధ్యాహ్నమే వచ్చాడు ఆఫీసు పనిమీద ఊళ్ళు తిరిగి...బాగా అలసిపోయి వున్నాడు.... అందునా అందరూ బయల్దేరాలంటే డబ్బుగూడ చూచుకోవాలిగదా .... నీవేమీ అనుకోకపోతే కాస్త ఓపిక చేసుకొని వాళ్ళమ్మను తీసుకువెళ్లి విజయవాడలో ధించిరావాలి....రానూ పోనూ చార్జీలు ఇస్తాడు....నేనే వెళ్ళేవాడినిగాని మా అమ్మాయి అలివేలుకి నిండా నెలలు....యే క్షణాన ఆస్పత్రికి తీసుకువెళ్ళవల్సి వస్తుందా అని ఎదురుచూస్తున్నాం....ప్రయాణం చేయాలన్నా నా మనస్సు మనస్సులో వుండదు. .. నీకు శెలవున్నది గదా....రేపు శనివారం. . ఎల్లుండి ఆదివారం... రేపురాత్రికి తిరిగివచ్చేసి ఆదివారం రెస్టుతీసుకోవచ్చు... ఏఁవంటావ్.... ఎలాగో అలాగు కష్టపడాలిరా సత్యం!" నా మిత్రుడు చలపతి నేను సాయంత్రం ఆఫీసు నుండి వచ్చేటప్పటికి నా గదిదగ్గర కాపలా కాస్తున్నాడు.

ఆ మాత్రం తోటిమనిషికి సాయం చేయటంలో తప్పేమున్నది? అందునా అతగాడు చార్జీలు యిస్తున్నాడు. కాదంటే ఒకరోజు క్యాజువల్‌లీవ్ పోతుంది—జానేదో!

"ఓకే!" అన్నాను.

"థాంక్యూ!" అంటూలేచాడు. "నేను బస్ స్టాండుకువెళ్ళి రెండు టిక్కెట్లు రిజర్వుచేసి యింటికి వస్తాను . .నీవు ఓ గంటాగి బయల్దేరి మా యింటికి వచ్చేసేయ్....నీ భోజనం యీ పూటకు మా యింట్లోచేసి వెళ్దువుగాని....మళ్ళీ ఇప్పుడు హోటల్‌కు ఏం వెళతావుగాని!"

"సరే!"

చలపతి వెళ్ళిపోయాడు.

రామం చలపతి ఒక యింట్లో పక్కపక్క భాగాలల్లో వుంటున్నారు అద్దెకు. చలపతి ద్వారానే రామం నాకు తెలుసు........చొరవగా యింట్లోకి వెళ్ళిపోయేటంత పరిచయం లేకపోయినా....చలపతి ఇంట్లోనే కూర్చొని కబుర్లు చెప్పుకునే పరిచయ మున్నది.

రామంతో పరిచయమున్నా లేకపోయినా ఇది చలపతి—నా మిత్రుడు కోరిన కోరిక.... కాదనలేకపోయాను.

స్నానంచేసి గుడ్డలు వేసుకొని—బ్రీఫ్ కేస్‌లో ఓ జత గుడ్డలు ఎందుకైనా పనికొస్తుందని పడేసుకొని—ఆపైన ఓ పాతిక రూపాయలు జేబులో పెట్టుకొని గదికి తాళంవేసి బయల్దేరాను.

నన్ను చూస్తూనే రామం, "చాలా థాంక్సండీ!" అన్నాడు.

"దట్సాల్‌రయిట్. ఫరవాలేదండి!" మొఖమాటంగా నవ్వాను.

చలపతి ఇంట్లో భోజనంచేసి రాత్రి తొమ్మిది గంటలప్పుడు వాళ్ళింటి దగ్గర స్టాపులో సిటీ బస్సు ఎక్కి బస్సు డిపో దగ్గర సరిగ్గా తొమ్మిది మ్ముప్పావుకు దిగాం బస్సు రాత్రి పదిగంటలకు.

రామం తల్లికి అరవై యేళ్ళుంటాయి.... మనిషి కాయపారు మనిషి. దృఢంగా వుంటుంది....రామం చిన్నపుడే భర్తపోగా యిద్దరు కొడుకుల్నీ........యిద్దరి కూతుళ్ళనీ పెద్దచేసి....పెళ్ళిళ్ళుచేసి........వాళ్ళకు వాళ్ళ సంసారాలు ఏర్పరిచి....కొడుకుల దగ్గర.... కొన్నాళ్ళు అక్కడ—కొన్నాళ్ళు ఇక్కడా—తన జీవితాన్ని వెళ్ళబుచ్చేస్తోంది.

బస్సు పదీ పదికి గాని బయల్దేరలేదు.

ఆడవాళ్ళ సీట్లు ఖాళీగా వుండడంతో ఆమెకు ముందు వరసలో దొరికింది—నాకు చివరి సీటు—ఆలశ్యంగా టిక్కెట్లకు వెళితే ఎప్పుడూ అంతే!

బస్సు హైద్రాబాద్ దాటి స్పీడందుకుంటే గాని వెనుక సీట్లోవున్న మజా ఏమిటీ అర్థం కాలేదు .... తెల్లవారుఝామున విజయవాడ జేరేటప్పటికి ఏ పార్టుకు,ఆ పార్టు ఊడిపోయినా ఊడిపోవచ్చు .... నార్కెట్టుపల్లిలో ఎవడైనా ముందు సీటు వాడు దిగితే బాగుండు.

అనీజీగా వెనక కూర్చున్న నాకు అనుకోకుండా విజయవాడలో వున్న మా మేనత్త కూతురు శారద గుర్తుకు వచ్చింది.

మొన్న కరుణ పెళ్ళిలో కనబడి వాళ్ళింటికి ఎప్పుడూ రానందుకు నిష్ఠూరాలుగూడా వేసింది.

అత్తయ్య ఒక్కసారి కాదన్న తరువాత శారద వెంటబడి తిరగటం నాకే మనస్కరించలేదు. . దానికీ నాకు ఆరునెలలే తేడా... .... వాళ్ళకూ మాకూవున్న అంతస్థుల తేడాను—వయస్సుల తేడాతో క్యాష్ చేసుకున్నదామె!

దానికి పెళ్ళయిన మూడేళ్ళకే యిద్దరు పిల్లలు....పెళ్ళిలో నెలల పసివాడిని వళ్ళో వేసుకొని ఆపసోపాలు పడుతుంటే నాకు నవ్వు వచ్చింది — జాలివేసింది .... పాతికేళ్ళు రాకముందే—జీవితాన్ని అనుభవించాల్సింది పోయి—జీవితంలో మెడవరకూ కూరుకుపోయింది అటూ యిటూ కదలలేకుండా....

చిదిమి దీపం పెట్టుకునే అందం శారదది. నా అదృష్టమే బాగున్నట్లయితే అది నా కంటే ఇంకో సంవత్సరం ముందుగా పుట్టి నాకు భార్య అయివుండేది....మా అత్తయ్య ఇంకేం కారణాలు సృష్టించకుండా వున్నట్లయితే!

దాని పెళ్ళి రేపనగా ఒంటరిగా పెరట్లో దొరికింది.



"నా అదృష్టం ఇంతే సత్యం!" అన్నది—కళ్ళల్లో నీరు గిర్రున తిరుగుతుండగా.

"ఏమైంది నీ అదృష్టానికి!" మనస్సులో బాధగానేవున్నా—గుండె నదిమి పెట్టుకొని అన్నాను.

పెదిమ చివరలు కొరుక్కుంటూ నా కళ్ళల్లోకి చూచింది. "నీకు బాధగా లేదా, సత్యం!"

"నువ్వు నాదానివి కాలేవు అని తెలిసిన తరువాత గడిపిన ఈనెల రోజులు—నన్ను ఈ బాధకు అతీతుణ్ణి చేసినయి....... ఇప్పుడు గుండె బండబారి పోయింది!" అన్నాను బరువుగా.

అన్నీ వడ్డించిన విస్తరి ముందు ఆకలి వేడితో కూర్చున్న నన్ను ఎవ్వరో బలవంతాన చేయిపట్టుకు లాక్కువెళ్ళి విసిరేసినట్లనిపిస్తోంది—ఛీ! ఏం జన్మ!....

"....కానీ, నేను ఆడదాన్ని........అంత తొందరగా దేనినీ మర్చిపోలేను!... " అంటూ గబుక్కున లోపలకు వెళ్ళిపోయింది.

కోప మొచ్చిందేమో ననిపించిందిగాని తరువాత తరువాత మామూలుగానే మాట్లాడటంతో నన్ను నేను అనునయించుకున్నాను.

వెన్నెల్లో వేడి....సూర్యునిలో చల్లదనం, శరీరంలో కోరికలు—అన్నీ ఊహలుగానే మిగిలిపోయినయి నా జీవితంలో.

తెల్లవారుతూనే శారదను చూడగానే - ఆమె ఒళ్ళో తలపెట్టుకొని కబుర్లు చెప్పే అవకాశం నా జీవితానికి లేకపోవచ్చుగాని——ఆమెను చూస్తూ కొన్ని గంటలైనా గడిపే అధికారం నాకు ఎవ్వరూ తీసేయలేరు గదా—నాకు అదే తృప్తి!

ఆ బస్సు అంతగా ఎత్తిపడేస్తున్నా ఎప్పుడు కునుకు పట్టిందో తెలియదు——పక్కన కూర్చున్న లావుపాటి ఆయన ఒకటి రెండు సార్లు డొక్కల్లో మోచేత్తో పొడిస్తే—సరిగ్గా కళ్ళు తెరుచుకు కూర్చోక తప్పలేదు.

నార్కేటుపల్లి వచ్చిందిగాని ఎవ్వరూ అక్కడితో దిగేటట్టులేరు.

రామం తల్లి దగ్గరకువెళ్ళి, "ఏమైనా కావాలా అండీ!" అని అడిగాను.

"వద్దు నాయనా.........నువ్వు టెలిగ్రాం చూచావా!"అన్నది ఆదుర్దాగా, "ఎలా వున్నాడో పెద్దాడు!"

"నేను చూడలేదండీ....రామంగారు చెప్పలేదా ఏమని ఇచ్చారో టెలిగ్రాం!"

"ఎక్కువగా వున్నది....అందరినీ బయల్దేరమని వున్నదన్నాడు....ఎక్కువగా వుంటేనే అందర్నీ ఎందుకు బయల్దేరమంటారు నాయనా ... ఏమయ్యాడో ఏమో. ..అసలే అధ్వాన్నపు బ్రతుకు వాడిది!" ఆమెకు కళ్ళ వెంట నీరు

గిర్రున తిరుగుతున్నాయి.

"అనారోగ్యం ఏమిటి?"

"ఏం చెప్పమంటావు—డబ్బు ఖర్చుకాందే రోగాలు తగ్గుతయ్యా నాయినా...మందులు కావాలంటే డబ్బులు కావాలి..డబ్బులులేని వాడికి రోగాలే మిగులుతయి. మొదట్లో తింటే తగ్గుతుంది.. నెత్తిమీది కొచ్చిం తరువాత మందులు తినాలనుకున్నా ఉన్న డబ్బులు ఏ మూలకి—అదీ వాడి స్థితి!"

నాకు జాలేసింది—భారత దేశంలో డబ్బులు లేక రోగాల్ని దాచిపెట్టుక్కునే మనుష్యులు చాలామంది వున్నారు—అందులో అతగాడు ఒకడు!

"ఏం చేస్తుంటారు మీ పెద్దబ్బాయి!"

"కొట్లో గుమాస్తా...అయితే నువ్వు పెల్గ్రాం చూడలేదంటావా!"

"లేదండీ!....మీరు అనవసరంగా ఆదుర్దా పడవద్దు....మరీ అంత ఎక్కువగా వున్నదీ అనుకుంటే రామంగారు రారా!"

ఆమె ఏదో అనబోయిందిగానీ—బస్సులోకి డ్రైవరు ఎక్కి గంట 'టకటక' మంటూ కొట్ట సాగాడు—ఒక్కసారిగా క్రింద నిల్చున్న జనమంతా తోసుకుంటూ ఎక్కడంతో నేను నా సీట్లోకి వెళ్ళక తప్పలేదు!

సీట్లో కూర్చుంటే శారద మళ్ళా కళ్ళ ముందు కదిలింది.

రేపు నేను వెళ్ళేటప్పటికి శారద భర్త ఊళ్లో లేకుండా వుంటే ఎంత బాగుంటుంది?-శారద నా బ్రతుకులో భాగస్వామి కాకపోవటంతో నేను పడుతున్న వేదనంతా ఆమె ముందు వెళ్ళగ్రక్కుకోవచ్చు.

—ఇప్పుడు శారద ఇదివరకటిలా చిన్న పిల్లగాదు...యిద్దరు పిల్లల తల్లి—అంత స్వతంత్రంగా మాట్లాడ గలుగుతుందా?—

గుండెల్లో గీసుకున్న బొమ్మమీద—ఎన్ని కాగితపు బొమ్మలంటించినా అసలు రూపు మాసిపోతుందా?....ఉహూఁ... నేను శారదను ఎలా మరువలేనో శారదా నన్ను అలాగే మరువలేదు!

దాని సంగతి నాకు తెలుసు....పెళ్ళి కొన్ని

గంటల్లో అవ్వబోతాన్నదనగా దాని కళ్ళల్లో తిరిగిన నీరు . .దానిలోని బాధ ...దాని గుండె ల్లోని వేదన నేను మరువలేను....

సగం శారదమీద ఆలోచనలు, సగం నిద్ర, ఇవిగాక నన్ను ఎగరేసి పడేస్తున్న సూపర్ ఎక్స్‌ప్రెస్ బస్సు....జబ్బుతో చావు బ్రతుకుల మధ్య ఊగిసలాడుతున్న అన్నయ్యను చూడ లేని తమ్ముని ఆర్థిక దుస్థితి. కొడుకు బ్రతుకు దిగులుతో కుళ్లిపోతున్న అరవైయేళ్ళ ముసలి తల్లి—ఈ ఆలోచనల నడుమనుండి కోలు కున్నది—నేను తెల్లవారుఝామున నాలుగు గంటల తరువాత—అదైనా కృష్ణ నీటి చల్లని గాలి నన్ను చుట్టివేసి ఉక్కిరి బిక్కిరిచేస్తేనే.

విజయవాడ వచ్చింది.

నేను శారద దగ్గరకు వచ్చేశాను.

ముసలమ్మను తీసుకువెళ్ళి వాళ్ళింటి దగ్గర దిగవిడిచి—ఒక్కసారి ఆ జబ్బు మనిషిని మర్యాదకు పరామర్శించి—రామంగారు త్వర లోనే వస్తారని ధైర్యం చెప్పి—కృష్ణలంకకు వెళ్ళిపోతే....

ఇంత చీకటితో నన్ను చూచిన శారద కళ్ళల్లో వెలుగు చూటటానికి తెల్లవారుతుందో లేదో?

ఎన్నాళ్ళబట్టో నా కలల్లో తిరుగుతున్న శార దను ఈనాడు చూడబోతున్నాను.

'థాంక్యూ! రామం!'

ఇరుకు సందులు దాటి బస్సు స్టాండులోకి వచ్చి ఆగింది బస్సు.

చివరవున్న నాకు దిగేటందుకు పది నిము షాలు పట్టింది.

"మీకు ఇల్లు తెలుసుగదా!" అమెను అడి గాను నేను.

"కృష్ణ లంకలో....!"

'ఇంకేం! కాగల కార్యం గంధర్వులే తీరు స్తారు అన్నట్లు నేను వెళ్ళాలనుకున్న చోటికే ఆమె వెళ్ళాలన్నది—దేవుడికి థాంక్స్ చెప్పు కోవాలి!'

ఒళ్ళంతా నొప్పులుగా—చికాగ్గావున్నా—శారదను చూడబోతున్నాననే ఆనందంలో అవన్నీ అంతగా పట్టించుకోలేదు.

"రిక్షాలు మాట్లాడ మంటారా?

"అలాగే నాయనా మాట్లాడు! ఎలా వున్నాడో ఏమో వాడు. ప్రాణాలతో చూస్తా నంటావా? బ్రతికుంటే చాలు నా ప్రాణాలిచ్చ యినా బ్రతికించుకుంటాను!"

"మీరేం గాభరా పడబోకండి మామ్మ గారూ! నేను చెబుతున్నా గదా. అంతా మంచే జరుగుతుంది. మీ పెద్దబ్బాయి మిమ్మల్నంద రినీ చూడాలనుకున్నాడేమో టెలిగ్రాం యిచ్చారు. లేకపోతే రామంగారు ఆగిపోతారా!''

"టెలిగ్రాం చూడలేదంటివి గదా నాయనా!''

—నా కనిపించింది—ఊరి పొలిమేర్లలో కొచ్చిం తరువాత పెళ్ళాం బిడ్డలు ఎలా వున్నారా అని అమోరించినట్లున్నదని—విజయవాడలో కాలుపెట్టి పది నిముషాల్లో కొడుకును చూడబోతున్న ఆమె—ఇంకా టెలిగ్రాంలో ఏమున్నదోనని భయంతో ఆలో చిస్తున్నదంటే—ఆమె ఎంత చాదస్థురాలో అర్థమవుతోంది!

అడ్డంవస్తున్న మనుష్యులను తప్పుకొని రెండడుగులు వేశానోలేదో—శారద!

నాకళ్ళను నేను నమ్మలేకపోయాను.

ఎదురుగా—చంకలో పిల్లవాడితో శారద నిల్చునివుంటే 'కాదూ' అని ఎలా అనుకునేది.

'ఇంత తెల్లవారుఝామున ప్రయాణంఎక్క డకు పెట్టుకున్నదో!'—నా ఉత్సాహమంతా—ఆమె కనబడిందనే సంతోషంకూడా లేకుండా జావలా కారిపోయింది.

"శారదా!"

కళ్లు పెద్దవిచేసుకుని—మనుష్యుల్ని దాటు కుంటూ వస్తున్న నా వంకచూసి, "నువ్వా సత్యం! ఇప్పుడెక్కడ నుంచిరాక, గుంటూరా" అన్నది.

'లేదు! నీ కోసరమే వస్తున్నా!' నని చెప్పా లనిపించింది నాకు.

"చిన్నపనిమీద వచ్చాను ఇక్కడికి.... ఏఁవిటి పొద్దున్నే బస్సుస్టాండు కొచ్చారు.... ఎక్కడికయినా ప్రయాణమా?" నీరసంగా అడి గాను—

"అవును సత్యం! నాగార్జునసాగర్ పిక్నిక్‌కు వెళుతున్నాం .... ఎన్నాళ్ళబట్టో వెళ్ళాలని.... వీలుబడితేనా ...ఆయన ఒకటేపోరు 'శారూ పోదాం............అని'. .. ఇదిగో వుండు పిలుస్తానుండు .... క్యూలో టిక్కెట్లకోసరం నిల్చున్నట్లున్నారు .... అవునూ నాల్రోజులుం టావా ఈవూళ్ళో. రేపుసాయంత్రానికల్లా వచ్చే స్తాము....వుండగూడదూ .. చాలా రోజులు అయింది నీతో కబుర్లుచెబుతూ కూర్చుని ... ఉంటే ఉండు. ఎంత పొద్దుపోయినా రేపు రాత్రికే వచ్చేస్తాం. ఇంకా పెళ్ళిచేసుకోలేదేం? చేసుకోవాలనుకోవటం లేదా? లేకపోతే యెవ ర్నయినా ప్రేమిస్తున్నావా? పెళ్ళి చేసుకొని పెళ్ళాన్ని తీసుకునివస్తే సరదాగా రెండురోజు లుండి వెళ్ళచ్చు. ఇంతకీ మీవాళ్ళు నీకు సంబంధాలు చూస్తున్నారా లేదా? లేకపోతే నన్నే చూడమంటావా ఏమిటి. మాట మాత్రం మా ఆయన చెవిన వేశానంటే—ఓ నెల్రోజులు సెలవుపెట్టి నీకు పెళ్ళిచేసిగాని వదల్రు. చెప్పు, కట్నం ఎంతుండాలేం....ఉసేయ్ పెద్దరాక్షసీ, మీనాన్నని పిల్చుకురావే....బాబాయి వచ్చాడని చెప్పు. తలకాయ అడ్డంగా తిప్పుతావేమే తిక్క ముండా, నీకుగాదూ చెబుతూంట నాన్నని పిలవ మని. ఇదయ్యా బాబూ వరసా. దానికెంత సేపూ ఫ్రిజ్‌లోపెట్టిన క్రీములు పెడుతూంటే మాట వింటుంది... అంతా అడుగో మహాను భావుడు ఆ నా య న గారి పోలికే. మనం చెప్పేదేమీలేదు. దానికెంతతోస్తే అంత... తెలివీ ఆయన తెలివే అనుకో .... అఖండ మైన బుర్ర....ఆయన ఎదుటవాడు ఆవులిస్తే పేగులు లెక్కపెడతారు. ఈ బొద్దెకాయ ముండ ఆవులించకుండానే లెక్కపెడుతుంది. వేలెడంత లేదు!" మురిపెంగా కూతురి తల నిమురుతూ నవ్వింది. "అసలూ ఆయన వాళ్ళ ఫ్రెండు చిన్న కారు తీసుకొస్తాను వెళదాం అన్నారు. అంతా ప్రయాణమయ్యారూ ఆ డ్రైవరు ముండాకొడుక్కి జ్వరమని మంచ మెక్కాడట. ఇంకేం చేయాలి. ఇదుగో బస్సు ప్రయాణం, టిక్కెట్ల గోల."

కన్నార్పకుండా జాగ్రత్తగా ఆ స్త్రీ ముఖం లోకి పరిశీలనగా చూచాను—నా ఊహాల్లోని నా శరదేనా ఈ శారద అని!

మనిషిలోనే గాదు మార్పు, మాటల్లోగూడా!

"నేను వస్తాను!" ఇంకా ఎక్కువ సేపు ఆవిడగారి మాటలు వినలేనేమోననిపించింది.

"నీ యిష్టం. వుంటే సరే!"

"వుండనులే వెళతాను"—ఉంటే ఉండు అంటే ఎలా వుంటాననాలో నాకు అర్థం కాలేదు.

శారదను చూడటంతోటే కొండెక్కినంత సంబరపడ్డాను. ఆ సంబరం ఒక్క క్షణమే మరు క్షణంలోనే అగాధంలో వున్నాను.

ఈ డబ్బున్న వాళ్ళకున్న రోగమే ఇది. చస్తే ఇంక శారదను గురించి ఆలోచించ గూడదు. ఎవరి గొప్ప వాళ్ళకే. గరుకు కాగితం తీసుకొని ఆమె రూపాన్ని గుండెల మీద నుంచి చెరిపేయాలి అనిపిస్తోంది.

—నన్ను కాదని ఎవరికో ఇచ్చి పెళ్ళి చేస్తుంటే పెరట్లో నన్ను పట్టుకొని ఏడ్చిన శారదేనా ఈ మనిషి అనిపిస్తోంది!

"సరే నీ యిష్టం!" ఆమె మాటలు చల్లని ఈదురు గాలిలో కొట్టుకు పోతున్నట్లనిపించగా సర్వం పోగొట్టుకున్న వాడిలా రోడ్డుమీదకు వచ్చేశాను.

వెనగ్గా రామం తల్లి!

రిక్షాలు మాట్లాడాను కృష్ణ లంకకి.

ఈ క్షణాన నాకు కృష్ణలంక నేనూహించు కున్నట్లుగా స్వర్గధామం కాదు-నరకతుల్యమే!

ఎప్పుడు విజయవాడ వదిలి తిరిగి హైద్రా బాద్ వెళ్ళిపోదామా అని మనస్సు తహతహ లాడుతోంది.

శారద ఎంతగా మారిపోయింది?

రామం తల్లిని - అతగాడి రోగిష్టి అన్న దగ్గర వదిలివేస్తే నేను నెత్తిన పెట్టుకున్న బాధ్యత తీరిపోతుంది.

ఇక తిరుగు ప్రయాణమే తరువాయి.

గుంటలు, మెట్లల్లో ఎత్తెత్తి పడేస్తూ కాలువ మీదగా బ్రిడ్జిదాటి లోయలోకి జారి కంకర




రోడ్లు వెంట పరుగెత్తి చీకటి సందుల్లో దొర్లి ఓ వీధిమలుపు ముందు రిక్షా వెనుకగా నా రిక్షా ఆగింది.

రిక్షా ఎందుకు ఆగిందా అని ముందుకు చూస్తే ముందు రిక్షాలోవున్న ముసలమ్మ ఒక్కసారిగా ఆకాశం విరిగి మీదపడుతున్నట్లుగా 'ఘొల్లు' మన్నది.

నేను ఉలిక్కిపడి రిక్షాలోనుండి క్రిందకు దూకాను.

రిక్షా ఆగిన ఇంటి ముందు వరండాలో ఆ తెల్లవారుఝాము చీకటిలో ఓ మనిషి ఆకారం తెల్లటి గుడ్డలు చుట్టబడి పడుకోబెట్టి వున్నది. తల పక్కగా నూనె దీపం.

సర్వం అర్థమయింది.

ఆ వరండాలోనే శవాల్లా బిగుసకు కూర్చున్న మనుష్యులలో కదలిక .. ఏడ్పులు, ఆ యింట్లో అప్పుడే మరో శవం లేచిందన్నట్లుగా.

దూరాన కృష్ణమీదగా వీస్తున్న ఎండా కాలపు హోరు గాలి....

అంతా అయిపోయింది. రామం పెద్దన్నయ్య చచ్చిపోయాడు. కనీసం రామం తన పెద్దన్నయ్య కడసారి చూపులు గూడా చూచుకోలేకపోయాడు.

రిక్షా దిగి పక్కగా నిల్చున్న నన్ను పలకరించిన మనిషే లేడు. వింతగా ఒకళ్ళిద్దరు కళ్ళు చించుకు చీకటిలో చూచినా ముఖాలు పక్కకు తిప్పుకు వెళ్ళిపోయారు.

అందరూ ఏడుపులు, ఏడుపులు, ఏడుపులు.

నాకు ఏం చేయాలో తెలియని అయోమయం.

రామం రాలేదు. రామం తల్లిని నేను తీసుకువచ్చాను. రామం వచ్చివుంటే చాలా బాగుండేది.

నేను సుడిగాలిలో గిరగిర తిరుగుతున్నట్లనిపించింది.

నా కర్తవ్యం? నేనేం చేయాలి ఇప్పుడు?

—అర్థంగాని అయోమయపు ప్రశ్న!

నాకు ఎవ్వరూ తెలియని ఆ ఇంట్లో నేను వుండి మాత్రం చేయగలిగిందేమున్నది.

నేను ఎవరికి చెప్పాలి? ఏమని చెప్పాలి?

వచ్చిన రిక్షాలోనే వెనుదిరిగాను. గుండెల్ని తెలియని బాధ అనే బరువుతో నింపుకొని

బస్సు స్టాండుకు ఎలావచ్చానో నాకే తెలియదు. చేతిలో బ్రీఫ్ కేసుతో రిక్షా దిగుతుంటే ఓ కుర్రవాడు అడిగాడు "హైద్రాబాద్ కా సార్!" అంటూ.

"అవును."

"టాక్సీ రెడీగా వున్నది సార్. యిరవై రూపాయలు!"

దేఁవుడు నాకోసరం నా యందు కనికరించి రెడీగా ఉంచిన వాహనం అది. దాన్ని కాదనే శక్తి నాకు లేదు!

—అప్పటికే పూర్తిగా మనుష్యులను గుడ్డల మూటల్లా కుక్కి వున్న ఆ టాక్సీలో దిక్కుతోచని వాడిలా ఇరుక్కు కూర్చున్నాను!

* * *

హైద్రాబాద్‌లో నేలమీద నేను కాలుపెట్టే టప్పటికి సరిగ్గా పదకొండు గంటలయింది.

వొళ్ళంతా ఎవరో చితక బొడిచినట్లుంటే ఇక సిటీ బస్సుకోసరం ఎదురుచూస్తూ కూర్చోలేక ఎదురుగ్గావున్న ఆటోలోకి దూకి చలపతి ఇంటి దగ్గరకు వెళ్లి ముందుగా రామం ఇంటి వాకిలి తలుపుమీద భయం భయంగా కొట్టాను.

ఆయనకు ఇంత ఘోరాన్ని ఎలా చెప్పాలి? రామం ఇంట్లో వున్నాడో ఆఫీసుకు వెళ్ళడో?

—నిన్ననే క్యాంపునించి వచ్చాడు కాబట్టి బహుశా రెస్టు తీసుకుంటూ ఇంట్లోనే వుండ వచ్చు! చూద్దాం.

నా అదృష్టం రామమే తలుపు తీశాడు!

అతడిని చూస్తుంటే నాకు ఆయాస మొస్తోంది. గుండెల్లో దడ, గొంతులో తడబాటు. నోరు పెగలటమే లేదు.

నంగి నంగిగా "ఐయామ్‌సారీ. చాలా చెడు వార్త మోసుకొచ్చాను. మీ అన్నయ్యగారు పోయారు" అన్నాను-ఒక్కసారిగా గటుక్కున —ఇంకా ఆగలేనట్లుగా.

రామం ఈ వార్తను భరించలేక కుప్పలా కూలిపోతే పట్టుకోవటానికే నన్నట్లుగా ముందుకు వంగాను.

రామం వెనుదిరిగాడు. "రండి లోపలికి!"

లోపలికి అడుగులు వేశాను.... తడబడే కాళ్ళతో!

"కూర్చోండి!"

వింతగా అతడి వంకే చూస్తూ కూర్చున్నాను.

"నన్ను క్షమించాలి మీకు శ్రమయిచ్చి నందుకు. మా అన్నయ్య పోయాడనే విష యాన్ని నిన్న టెలిగ్రామే చెప్పింది. కానీ ఏం చేయమంటారు చెప్పండి. నేను వెళ్ళలేక పోయాను. అలా వెళ్ళలేకపోయినందుకు దుఃఖంతోనూ, బాధతోనూ, సిగ్గుతోనూ చచ్చి పోతున్నాను. నేను వెళ్ళి ఏం చేయగలను. ఏం చేయాలి. ఏం చేయాలన్నా ముందు డబ్బు కావాలండీ. ఆయన ఇల్లు....ఆయన ఇల్లు.... మీకు ఎలా చెప్పాలో నాకు తెలియటం లేదు. నా స్థితి మీకు తెలుసు.

"నా ఆర్థిక స్థితి ఎంత హీనంగావున్నదో మీ కంటే చలపతికి బాగా తెలుసు. చచ్చిన ఆయన్ను నేను ఎలాగూ బ్రతికించుకోలేను. బ్రతికివున్న నన్నుకూడా ఇప్పుడు వెళ్లి ఆ ఊబిలో కూరుకు పొమ్మంటారా. ఇంట్లో ఎప్పుడూ ఓ పైసాకూడా వుండని ఆ యింటి నుంచి ఆ శవాన్ని బయటకు తీయాలీ అంటే నేనంటూ వెళితే ఇక ఆ బాధ్యతంతా నాదే మాష్టారూ. నేను అందుకోసరమే అక్కడకు వెళ్ళాలి. అక్కడి వాళ్ళు నా రాకకు ఎదురు చూచేది గూడా అందుకే. ఇదీ నా స్థితి. మీకు తెలుసో తెలియదో నాలుగు రూపాయలు కావాల్సి, తాకట్టు పెట్టాలన్నా వీలులేకుండా నా భార్య మెళ్ళో ఒట్టి పసుపు కొమ్ములే వున్నాయి మాష్టారూ. నిజం మాష్టారూ! ఇది పచ్చి నిజం. అందుకే. .అందుకే బ్రతికి వుండీ కళ్ళు మూసుకొని చచ్చిపోయానూ అను కున్నాను. అలా అనుకోవటంవలన అక్కడైనా మీలాంటి నలుగురూ జేరి నాలుగు చేతులూ వేసి...."

—ఇక నేను అక్కడ వుండలేక బయటకు పారిపోయి వచ్చేశాను! □




"నిద్రకు వెలియై....
నే నొంటరినై ....
నా గదిలోపలి చీకటిలో .
చీకటిలోపలి నా గదిలో....
నా గదిలో...
చీకటిలో. ..

శ్రీశ్రీగారు ఈ గేయాన్ని వ్రాసి చాలా కాలమయింది. కాని నా కోసమే వ్రాసారా అనిపిస్తోందిప్పుడు. భరించలేని వంటరితనం నన్ను కబళిస్తోంది. వేయి అమావాస్యల అంధ

---

శ్రీపాద రామసోమయాజులు

కారాన్ని ఒకేసారి నిందించే కరాళ కాళరాత్రి లాటి వంటరితనం....కాన్సర్ లా వంటరితనం. నిలువునా నన్ను దహించివేసే మారణహోమం లాటి వంటరితనం....అన్నీవుండీ ఏదీలేకుండా చేసే వంటరితనం....!

ఎత్తయిన కొండశిఖరం. అక్కడకు ఎలా చేరానో తెలియదు. ఆలోచిస్తూ, అపస్మారకంగా నిలుచున్న నన్ను వెనుకనుండి హఠాత్తుగా ఎవరో నెట్టేసే, గాలిలో గిరికీలుకొడ్తూ, ఊపిరాడక కొట్టుకుంటూ, లోయమట్టాన్ని చేరుకుంటూన్న భావన తినేస్తోంది నన్ను. తెలియని అలజడి, ఏదో ఆందోళనా నాలో రేగుతున్నాయి. వ్యక్తం చేయలేని భయం నన్ను ఆవరిస్తూవుంది. వళ్ళంతా చెమటతో తడిసి తెలివి వస్తుంది. నేను అనుభవిస్తున్న నరకం వర్ణనాతీతం.

పారిపోవాలి .... భయంకరమయిన యీ వంటరితనానికి దూరంగా. . శాంతమయమైన చోటుకు పారిపోవాలి.. వాత్సల్యం పొంగి, అనురాగంతో అందనిచ్చే చోటుకు పారిపోవాలి. ఆప్యాయంగా, నా తల నిమురుతూ, "అలసిపోయావా కన్నా! కళ్ళు మూసుకుని అలాగే వుండు. నిద్రవస్తుంది" అంటూ సుతారంగా అమ్మ నా కణతల నదుముతూవుంటే, అన్నిటినీ మర్చిపోయి, సేదతీరి నిదుర పోవడానికి అమ్మ వడిలాటి వడి దొరికే చోటుకు పారిపోవాలి....

అమ్మ!... నన్ను వదలి, వంటరివాణ్నిచేసి, ఆమె తప్ప ఇంకెవరూలేని నన్ను వదలి. . వెళ్ళిపోయింది. భరించలేని ఈ వంటరితనానికి నన్ను వప్పగించి, వెళ్ళిపోయింది మన శ్శాంతిని దూరంచేసే శూన్యానికి నన్ను దగ్గర చేసి, తాను వెళ్ళిపోయింది. చీకూ చింతా లేకుండా, నిరంతరం తన నీడలో బ్రతికే నన్ను వంతల పాల్జేసి, నిర్దయగా వెళ్ళిపోయింది అమ్మ. . నరాలు పగిలి పిచ్చెక్కిపోతానేమో అన్నంత భయంకరమయిన ఆలోచనలతో వేడెక్కిపోయే నా మస్తిష్కానికి సేదనిచ్చే తన వడిని నాకు దూరంచేసి వెళ్ళిపోయింది .. అమ్మ....

నిజంగావెళ్ళిపోయిందా? ఎలావెళ్ళిపోతుంది? నాలోనేవుంది. నేనే తాను! తానే నేను!.. ఆమె రక్తం నాలో ప్రవహిస్తోంది. నా ఆలనాపాలనా తానే అయి పెద్దవాణ్ణి చేసింది. తన ఆలోచనలను నావిగా తీర్చిదిద్దింది. అమ్మపరంగా ఆలోచించడం నేర్చుకున్న నాకు అమ్మ దూరమయిందా! అమ్మ నాకు దూరం అయింది అనుకోవడం నా భ్రమ. ఆమె అభిప్రాయాలూ, అభిరుచులూ నావి. నా ఇష్టాయిష్టాలు ఆమె దగ్గరనుండి తెచ్చుకున్నవే! ఆమె అనుభూతులూ, అనుభవాలు నావిగా మారుతున్న సమయంలో ఆమె 'నాకు దూరం అయింది' అని అనుకోవడం భ్రమ కాక మరేమటి? ఆమె కోసమే, ఆమే నేనై జీవిస్తున్న నాకు అమ్మ దూరమెలా అవుతుంది.

నాకు మూడేళ్ళ వయసులో తండ్రి పోయాడట. అప్పటినుండీ తానే సర్వస్వమై పెంచింది అమ్మ. నన్నొదిలి ఒక్క క్షణం ఉండేదికాదు. మిగతా అందరిపిల్లలలాగ బయటకువెళ్ళి ఆడుకోవడం నాకు తెలియదు. అమ్మతోనే నా ఆటలు ....అమ్మవే నా పాటలు....స్కూలువదలగానే తిన్నగా ఇల్లు చేరిన నాకు అమ్మ తోడిదే లోకం. అమ్మ నాతోడు... నా నీడ! 'వాడు అమ్మ కొంగు వదలడురా! వఠి గూట్లో పక్షి. మనతో ఆడడానికి రమ్మన్నా రాడు. అమ్మకూచి.' కొందరు వెక్కిరించేవారు. ఎందుకో తెలియదుగాని, నాకు ఏడుపువచ్చేది. అమ్మ వడిలో తలదాచేసుకున్న మరుక్షణం ఎవరేమనుకున్నదీ మరచి పోయేవాణ్ణి.

"మగ పిల్లవాడు . ఎప్పుడూ మీ కొంగట్టుకు కూర్చుంటే వాడికి లోకం ఏమిటో ఏం తెలుస్తుంది? అలా బయటకు తిరిగి రమ్మను." ఎప్పుడయినా మా ఇంటికి వచ్చే పిన్నిగారు అమ్మకు సలహా ఇచ్చేది.

"నా తోడిదే వాడి లోకం. ఏరా కన్నా?" అంటూ తల నిమిరి నన్ను దగ్గరగా తీసుకునేది అమ్మ. విహార యాత్రలని,సినీమాలని స్కూల్లో ప్రోగ్రాంలువేసినా, నేను వెళ్లేవాడిని కాను.. అమ్మరాదు కనుక.




అన్ని విధాలా అమ్మమీదే ఆధారపడుతూ కాలేజీలో చేరినా; నా దైనందిన చర్యలో పెద్ద మార్పురాలేదు. పుస్తకాల పురుగని, ఇంటి గూటి పక్షని, అమ్మ కూచని ఎన్నో నామకరణాలు జరిగాయి నాకు. పనిగట్టుకువచ్చి మరీ ఎద్దేవా చేసేవారు తోటి కుర్రాళ్లు. నేను లక్ష్యపెట్టక పోవడంచూసి, విసుగెత్తి తాత్కాలికంగా వూరుకునేవారు. ప్రతి విషయంలోనూ అమ్మ సలహా తీసుకునేవాడిని. నిజానికి అమ్మ చెప్పిందే చేసేవాడిని. ఆమె అన్నదానికి వ్యతిరేకంగా చేద్దాం అన్న ఆలోచన సహితం వచ్చేది కాదు. నా జీవితం అంతా అమ్మమయమైంది. ఏం జేసినా అమ్మకోసమే! ఆమె ఆనందంగా వుండాలనే! అసలు నేను నేనుగా చేసిందేమీలేదు. అంతా నాలోని అమ్మ చేయించేది.

"ఏ గ్రూపు తీసుకుంటున్నావు?" కాలేజీలో చేరే ముందు నేను తీసుకోబోయే గ్రూపు వివరాలు అడిగారు కొందరు. "ఏమో! మా అమ్మ ఏ గ్రూపు తీసుకోమంటే అదే తీసుకుంటాను."

"పిచ్చివాడు! ప్రతీది అమ్మ చెప్పాలి. మున్ముందు వీడెలా బ్రతుకుతాడో!" వాళ్లు చూపించే సానుభూతికి నాకు నవ్వు వచ్చేది.

"నీకు సైన్సు గ్రూపువద్దురా కన్నా! ప్రాక్టికల్సూ అవీవుంటాయి. నువ్వు తట్టుకోలేవు. ఆర్ట్సయితే కాలేజీ అయిన తర్వాత ఇంటి దగ్గరే చదువుకోవచ్చు." అమ్మకు అన్నీ తెలుసు. ఎంత తెలియకపోతే నాన్నగారు పోయిందగర నుండి పొలం వ్యవహారాలు, ఇంటి వ్యవహారాలు ఒంటిచేత్తో నడిపిస్తూ వచ్చింది! నన్ను దగ్గర కూర్చోబెట్టుకుని చదివించడం, నా సందేహాలను తీరుస్తూ, సలహాలనిస్తూ, స్కూలు ఫైనలులో మంచి మార్కులు వచ్చేట్టుచేసింది అమ్మ. నా గురించి నా కంటే అమ్మకే ఎక్కువ తెలుసు. కాలేజీనుండి తిన్నగా ఇంటికివచ్చి అమ్మతో కాలం గడిపేవాణ్ణి. నేను చదువుకుంటున్నంతసేపూ అమ్మకూడ తోడుగా కూర్చునేది.

నన్నంతా ఎద్దేవాచేసి, ఆటపట్టించినా,— బాగా చదువుకోవడంవలన "కుర్రాడు బుద్ధిమంతుడు. మంచి మార్కులు సంపాదిస్తాడు" అన్న బిరుదులుకూడ ఇచ్చారు. లెక్చెరర్సంతా అభిమానంగా చూసుకునేవారు. కాలేజీకి మంచి పేరు తెస్తానని అనేవారు.

అలాగే........వాళ్ళనుకున్నట్టుగానే, నాకు మంచి మార్కులువచ్చాయి. అమ్మ శ్రమకు ఫలితం నేనందుకున్నాను. అమ్మ ఆదేశం ప్రకారం యూనివర్సిటీలో చేరాను. ఇంగ్లీషు లిటరేచరు బాగా ఆకర్షించింది. షేక్స్పియరు డ్రామాలలో, కామెడీల కంటె ట్రాజడీలు చాల ఇష్టంగా చదివేవాడిని. ఒథెల్లో, హేమ్లెట్, మెక్బెత్....ఇవి ఎన్నిసార్లు చదివినా ఇంకా చదవాలనే వుండేది. ఇంగ్లీషు సాహిత్యంలో ఎంత మంచి పేరు సంపాదించినా బైరన్ అంటే నాకు పడేదికాదు. అతని వ్యక్తిగత జీవితం అందుకు కారణం. తల్లిపట్ల అతను ప్రదర్శించిన నిరసన....తల్లితో అతను ప్రవ రించిన తీరు...కారణాలు. తప్పదు గనుక చదివేవాడిని. 'పేరడైస్ లాస్ట్ చదువుతూంటే ప్రతీ రాత్రి ఒక దేవకన్య సాక్షాత్కరిస్తున్నట్టు వుంటుంది' అనేవాడు ఆచారి. నాకు మట్టుకు అదంతా మిల్టన్ కల్పించిన అభూత కల్పనగా తోచేది.

షేక్స్పియర్ వ్రాసిన ట్రాజడీలంటే అమ్మ చెవి కోసుకునేది. బహుశ అందుకే అవి నాకు కూడ అంత ఇష్టమయాయనుకుంటాను. లేడీ మేక్బెత్ ధైర్యాన్ని, కాషియస్ నేర్పరితనాన్ని, ఒథెల్లోలోని ఆకాంక్షనూ పొగిడే అమ్మకు హేమ్లెట్ 'టు బి ఆర్ నాట్ బి' అన్న వరస నచ్చేదికాదు.

పరీక్షరోజుల్లో మేడమీద నా గదిలో పడుకు నుండే నన్ను అమ్మ లేపేది. టీ తయారు చేసి యిచ్చి. చదువుకోమనేది. నా ప్రక్కనే తనూ ఓపికగా కూర్చునేది. ఒక్కొక్కసారి నాకు తెలివి వచ్చేసరికి క్రింద అమ్మ గదిలో అమ్మ ప్రక్కలో వుండేవాడిని. రాత్రి చదు వుతూ, చదువుతూ ఎప్పుడో అమ్మ దగ్గరకొచ్చి పడుకునుంటాను. విసుగుకోకుండా, నిర్వి రామంగా అమ్మపడ్డ కష్టం, నేను చేసిన కృషి వృధాకాలేదు. ఎమ్.ఎ.లో ఫస్టు క్లాసు వచ్చింది. ఆ ఫస్టు క్లాసు తనదే అన్నంతగా ఆనంద పడింది అమ్మ. నిజానికి ఆఫస్టు క్లాసు ఆమెదే అన్నది నా భావన.

రిసెర్చి చేయమన్నారు శ్రేయోభిలాషులు. రిసెర్చి అయితే ఎక్కువకాలం లైబ్రరీలో గడపాలి. థీసిస్ వ్రాయడానికి చాలకాలం పడు తుంది. అంటే అమ్మ వంటరిగా ఎక్కువ కాలం గడపాలి. ఆ విషయమే అమ్మతో అంటే

"నా కన్నకు నేనంటే ఎంత అభిమానం! అవునుగాని కన్నా! నన్నొదిలి నీ వుండలేవా? నిన్నొదిలి నేనుండలేనా? నిజం చెప్పూ!" అంటూ నవ్వేసింది. నిజమే! అమ్మను వదలి నేనే వుండలేను.

అందుకే వూర్లోనేవున్న కాలేజీలో ఖాళీ వుందని తెలిసి అప్లయిచేసాను. కళ్ల కద్దుకుని తీసుకున్నారు. లెక్చెరర్గా కుదిరాను. విద్యార్థు లకు నేను చెప్పే తీరు నచ్చిందనుకుంటాను, నేను చెప్పే పాఠాలు శ్రద్ధగా వినేవారు. నన్ను గౌరవంగా చూసేవారు. చిక్కంతా తోటి లెక్చె రర్సుతోనే. నా బ్రతుకు నేను బ్రతకడం వాళ్ళకు కష్టంగా వుంటుంది. ఎవరితోనూ మాట్లాడనని ఏ విషయమూ పట్టించుకోనని, క్లాసులో పాఠాలు తప్పించి ఏ ఇతర అభిరుచి లేని వాణ్ణని...నా ఎదురుగానే ఎద్దేవా చేసేవారు. 'కర్మసన్నాసి' అనేవారు. వాళ్ళందరికి నా సమాధానం ఒక చిరునవ్వు.

ఒకరోజు సాయంత్రం "కన్నా! గుర్నాధం గారని బాగా సాంప్రదాయ కుటుంబీకులు.... అమ్మాయి బియ్యే పాసయిందట..అందంగా వుంటుందట. బాగా కలిగిన వారట. అయినా వారికున్నా లేకున్న మన కిబ్బంది లేదనుకో.. అమ్మాయిని చూసుకుందుకు రమ్మని కబు రంపారు....చూస్తావుట్రా!" నేనే మంటానో అన్నట్టు చూసింది అమ్మ. పెళ్ళి........దీన్ని గురించి అంతవరకు నేను ఆలోచించలేదు. నేనూ అమ్మా కాక మూడవ వ్యక్తి ఈ కుటుం బంలోకి! చదువుకున్నదట. ....అందంగా వుంటుందట...

అందం, డబ్బూ....ఇవి కావు సమస్య. వచ్చే వ్యక్తి అమ్మను అర్ధం చేసుకునే దయి వుండాలి. అమ్మకు అనుగుణంగా వుండాలి. అమ్మకు వ్యతిరేకంగా నడిచే వ్యక్తిని నేను

సహించలేను. అమ్మను ఏ విధంగాను కష్టపెట్ట కుండా, అన్నివిధాల ఆమె సంతోషానికి సానుకూలమయిన అమ్మాయి కావాలి.... నాకూ అమ్మకూ నడుమ గోడ అయి కూర్చునే వ్యక్తిని నేను గౌరవించలేను. అటువంటి వ్యక్తిత్వాన్ని హర్షించనూలేను. ఉబలాటపడు తున్న అమ్మను నిరుత్సాహపరచడం ఇష్టంలేక "నీవెలా అంటే అలాగే" అన్నాను.

పెళ్ళిచూపుల రోజు, ఒక్క చూపుతోనే ఒక నిశ్చయానికి వచ్చాను. నేను వివాహమాడే అమ్మాయిలో మా అమ్మను చూడగలగాలి. అపుడుగాని ఆ వ్యక్తి మా ఇంటి కోడలు కాలేదు.

అమ్మాయి చూడడానికి చాల బాగుంది. దృఢత్వాన్ని సూచించే ఆ గడ్డపుతీరూ, ఆత్మ విశ్వాసాన్ని వ్యక్తపరచే ఆ కండ్లూ నాలో సంచలనాన్ని రేపాయి. క్లియోపాత్ర గుర్తుకు వచ్చింది. అమ్మాయికీ, అమ్మకూ సరిపడదు. అమ్మ చెప్పిన ప్రతిమాట ఈ అమ్మాయి వింటుందని కాని, ఆమె చెప్పిన ప్రతి పని చేస్తుందనిగాని నాకు అనిపించలేదు. అటువంటపుడు ఘర్షణతప్పదు. కోరికోరి నరకాన్ని ఇంటికి చేరవేయడం అవివేకం! అమ్మకు ఆనాందాన్నివ్వలేని అమ్మాయి నాకేనాడూ ఆనందాన్నివ్వలేదు.

ఇంటికి తిరిగి వచ్చాక "ఎలా వుందిరా అమ్మాయి?" అమ్మ కంఠంలో ఆతృత, తొంగిచూసే ఆందోళన పసిగట్టాను.

"బాగానే వుంది" అమ్మ ముఖంలోకి చూసాను. వెలవెలబోతూ వుంది.

"కాని ఆ అమ్మాయిని నేను చేసుకోలేనమ్మా." అమ్మ కళ్ళలో ఆనందం.

"హాయిగా బ్రతుకుతున్న మన మధ్యకు ఇంకొక మనిషి ఎందుకమ్మా? ఇప్పట్లో నా పెళ్ళి విషయం తలపెట్టకు" అమ్మ నిట్టూర్పులో కొండంత బరువు దిగింది. అమ్మ ఆనందమే నా ఆనందం. ఆమె అనుభూతులే నా అనుభూతులు. ఆమె ఆశయాలు నావి. నేనే ఆమె. అమ్మే నేను. అటువంటి అమ్మ హటాత్తుగా నన్నొదిలి వెళ్ళిపోయింది....గుండె ఆగిపోయింది....నా గుండెల్లో చితి రగిల్చి వెళ్ళిపోయింది.

కాని ఆమె హృదయస్పందనను నా గుండెల్లో మిగిల్చి పోయింది. లోకం దృష్టిలో నే నేకాకినే కావచ్చు. కాని నాలోని నా అమ్మ బ్రతికేవుంది. "నే నెక్కడికీ పోలేదురా కన్నా! నీలోనే వున్నాను. నీ ఊపిరి నేనే" వెర్రివాణ్ణి నాలోని అమ్మను గుర్తింపలేక ఎంతగా ఏడ్చాను!

* * *

పరామర్శ చేయడానికి ఇరుగు పొరుగువారు కాలేజీనుండి.. .చాలమంది వచ్చారు. ఎవరికి తోచిన అనునయ వాక్యాలు వారుచెప్పి తమ సానుభూతిని వ్యక్తపరుస్తున్నారు. నాలోని అమ్మను నేను చూసుకుంటూంటే నా చూపులకు అర్థాలు కల్పిస్తున్నారు. నా కండ్ల వెంబడి నీరు రాకపోవడం వారికి ఆశ్చర్యం కలిగించింది. "అమితమైన దుఃఖంలో కండ్లనీళ్ళు యెండిపోతాయి" ఒకాయన విశదపరుస్తున్నాడు. పిచ్చివాళ్ళు. వాళ్ళకు తెలియదు. అమ్మ నాలోనే ఉంది. ఇంక నాకు దుఃఖం ఎందుకు?

"ఇలా ఎంతకాలం విచారిస్తూ కూర్చుంటే వెళ్ళిపోయిన మీ అమ్మగారు తిరిగి వస్తారా మాష్టారూ?" నాదస్వరం విన్నపాములా తల ఎత్తాను. ఎదురుగా అరవింద. మా డిపార్టుమెంటులో నా తర్వాత చేరింది.

"చిన్నప్పటినుండీ మిమ్మల్ని సాకుతూ ఇంతటివాణ్ని చేసారు. ప్రయోజకుడిగా తీర్చి దిద్దారు. మీచేతుల మీదుగా వెళ్ళిపోయారు. ఆవిడ జ్ఞాపకాలలో బ్రతకాలిగాని ఇలా నిస్పృహగావుంటే ఆవిడ సంతోషిస్తుందనుకున్నారా?" అనునయంగా ఆమె పలికినతీరు, ఆమె మాటల్లోని భావం నన్ను ఆకట్టుకున్నాయి. ఆ కళ్ళలోని ఆప్యాయత, ఆమె కంఠంలో పెల్లుబికే వాత్సల్యం నన్ను కదిల్చివేసాయి .... అమ్మ అచ్చం యిలాగే మాట్లాడివుండేది అన్నదే భావన.

"వంటరిగా ఇంటి దగ్గరేవుంటే యిలాగే వుంటుంది. లేవండి మాష్టారూ! అలా మా

ఇంటివరకూ వెళ్ళివద్దాం." కాదనలేకపోయాను. మంత్రం వేసినట్టు వెనక నడిపించుకు తీసు కెళ్ళిపోయింది అరవింద.

ఆమె ఇంట్లో అందరూ ఆప్యాయతను అందజేసారు. అరవిందకు ఇద్దరు తమ్ముళ్ళు, ఒక చెల్లెలు. ఆమెతండ్రి సర్కిల్ ఇన్స్పెక్టరు. మనిషి గంభీరంగా కనిపించినా "ఏమిటండీ మరీ చిన్న పిల్లాడిలా అలా కుమిలిపోతే ఎలా? మగవారు, చదువుకున్నవారు, నలుగురికిపాఠాలు చెపుతున్న వారూను. కాస్త నిబ్బరం అలవర్చు కోవాలి. అమ్మాయి చెపుతుంటుంది మీగురించి. అవును గాని మీకు చదరంగం ఆడడంవచ్చా? రెండెత్తులు వేసుకుందాం .." వాతావరణాన్ని తేలికపరచే ప్రయత్నం. "బాగుందండీ మీరూ మీ చదరంగమూనూ. పుట్టెడు దుఃఖంతో వున్న అబ్బాయిని పట్టుకొని చదరంగంవచ్చా, చట్టుబండలువచ్చా అంటారేమిటి. అన్నీ పోలీసు బుద్ధులే. ఆయనగారితో ఏమిటిగాని లే నాయనా! లేచి కాళ్ళుకడుక్కో, కాసిని మెతుకులు కతుకుదువుగాని" అరవింద తల్లి ఆపేక్ష.

అరవింద నా పట్లచూపే శ్రద్ధ అమ్మను గుర్తుకుతెస్తోంది. ఏ అరమరికా లేకుండా నేను వాళ్ళింట్లో మసలడం, నా ఇంటికి అరవింద తరచురావడం మా ఇద్దరిమధ్య సన్నిహితాన్ని చిక్కబరిచింది. దగ్గరుండి ఆమె నా యింటిని సర్దించడం, వంటవాడిచేత నా కిష్టమయినవి వండించడం——అరవింద నా ఇంట్లో మనిషిలా తయారయింది. అమ్మ చనిపోయాకకూడా నాకు మేలుకలిగేట్టు చూస్తోంది అన్నదే నా భావన. అరవింద నాకిచ్చే కంపెనీ, ఆమె నా యందు చూపించే అభిమానం .... నెమ్మదిగా అరవింద నన్ను ఆక్రమించుకొంటోంది. ఆమె నాది అన్న భావం నాలో నిండుకొంటోంది. ఒక్కపూట అరవింద కనిపించకపోతే విలవిల లాడిపోయే స్థితికివచ్చాను. లోకం గుడ్డిదికాదు. చెవిటిది అసలేకాదు....మా ఇద్దరి గురించిన కథలు కాలేజీలో కావ్యాలై వెలిశాయి....గుస గుసలు .... మమ్మల్ని చూడగానే చెవులు ముక్కలు ముక్కలుగా తెగిపడుతున్నాయి.

"ప్రవరాఖ్యులు ప్రపంచంలో పడ్డారే!" నా ఎదురుగానే హాస్యం చేసేవారు. నాకు చాలా ఆనందంగావుంది. "పార్టీ ఎప్పుడు సార్?" చిరునవ్వు సమాధానం.

"ఇలా ఎన్నాళ్ళు? మావాళ్ళు తొందరపడు తున్నారు. ఆ మూడుముళ్ళు పడ్డాక మీఇష్టం. ఎలాగయినా తిరగండి అంటోంది అమ్మ." అరవింద ముద్దుగా గునిసింది.

నాకు ఏనుగెక్కినంత సంతోషం. "నా ఆలస్యం ఏంలేదు అరవిందా! నేనూ ఆ క్షణం కోసమే ఎదురుచూస్తున్నాను. ఆలస్యం అంతా మీ వాళ్ళదే!" ఈ శూన్యమాసం తర్వాత ముహూర్తాలు వున్నాయట.

* * *

అమ్మపోయిన దగ్గరనుండి ఇరుగు పొరుగు వారితో కష్టమయిపోయింది. వాళ్ళ కళ్ళకు నేనొక విచిత్రవ్యక్తిని. వాళ్ళదృష్టిలో పిచ్చి వాణ్ని. "నీ వరస మాకేం నచ్చలేదు. పెళ్ళవ కుండా ఆ అమ్మాయితో బలాదూరుగా ఆ తిరు గుళ్ళు బాగాలేవు. మావీ సంసారుల కొంపలే! మా ఇళ్ళలోనూ వయసుకొచ్చిన అమ్మాయి లున్నారు. ఆ అమ్మాయిల విషయం ఆలో చించి కనీసం, ఆ శుభకార్యం త్వరగా జర గనీ." ఒక ముసలాయన పనిగట్టుకుని వచ్చి మరీ బోధించాడు. అంతా అసూయ. అర విందతో తిరుగుతున్నానన్నది ఆరోపణ. ఇంత ఆస్తికి వారసుడు తమకు దక్కకుండా పోయా డన్న బాధ. అరవింద నా భార్యగా యెంత త్వరగా నా ఇంటికివస్తే అంత మంచిది. అప్ప టికిగాని వీళ్ళనోళ్ళు మూతలు పడవు.

"అమ్మపోయిన విచారం నీకుండటం సహ జమే, కాదనను. కాని రాత్రులు ఆ యేడుపు యేమిటి? అర్ధరాత్రిదాటాక డాబా పిట్టగోడమీద కూర్చుని 'అమ్మా' అని నీవు పెద్దగా రాగాలు పెడుతూంటే, చిన్నపిల్లల సంగతి అటుంచి, ఇళ్ళలో ఆడవాళ్లు సహితం భయపడుతున్నారు" ఇంకొక ఆయన ఫిర్యాదు.

అమ్మను మరచిపోలేక నేను విచారిస్తున్న సంగతి వాస్తవమే. పగలంతా కాలేజీ....అర




విండ....ఆదమరచి వుంటున్నానేమోగాని, రాత్రి ఇంటిదగ్గర వంటరితనంలో అమ్మ జ్ఞాపకాలు నన్ను చుట్టుముడతాయి. అయితే వీళ్ళందరికీ వినిపించేటట్టు పెడబొబ్బలు పెడుతున్నానా? అర్ధరాత్రులు పిట్టగోడమీద కూర్చుని శోకాలు తీస్తున్నానా....అంతా అబద్ధం.

“రాత్రి మీరు బయటకు వెళ్ళాలంటే నన్ను లేపి వుండవలసింది అబ్బాయిగారూ. మీరు బయట గొళ్ళెంపెట్టి వెళ్ళిపోయారు. ఇంట్లో ఎవరు చొరబడినా ముసలి ముండావాణ్ణి, ఏం అడ్డుకుంటాను? నన్ను లేపితే తలుపు వేసుకునేవాణ్ణికదా?” వంటవాడి ఫిర్యాదుతో నాకు మతిపోయింది. నన్ను నేను అదుపులోకి తెచ్చుకునే సరికి వాడు మొదలెట్టాడు మళ్ళీ.

“అయినా అమ్మగారు పోయిందగ్గర్నుంచి మీకు అర్ధరాత్రి షికార్లు ఎక్కువయాయి. ఆ యమ్మ వున్నంతకాలం, సాయంత్రం అయేసరికి మీరు గూడు చేరుకునేవారు. ఉదయం వరకూ గువ్వపిట్టలా పడుకునేవారు. మీకు చెప్పవలసినంత వాడిని కాదుగాని మనంహద్దులు దాటిపోతే నలుగురిలోనూ మాటపడిపోతాం.”

వంటవాడి నసతో నాకు చిరాకెక్కువైంది. నా చిన్నతనం నుండే మా యింటిని అంటిపెట్టుకున్నాడు....కాస్త చనువెక్కువయింది.

అయినా వీడికేం వచ్చిందితెగులు? అర్ధరాత్రులు నేను బయటకు షికార్లకెడుతున్నానంటున్నాడు. వెళితేమటుకు, వాణ్ణి లేపకుండా, తలుపులు వేసుకోమనకుండా నేను బయటకు వెళుతూ వున్నానా? వాడిచ్చిన కాఫీ విషంలా వుంది.

వాడు చెప్పిందంతా మననం చేసుకుంటే దడపుట్టింది. ఎక్కడికెళ్తున్నాను? అర్ధరాత్రులు ఏం చేస్తున్నాను? అమ్మపోయిన తర్వాత వంటవాడు త్రాగుడు మొదలెట్టాడా? వంటిమీద స్మారకముంటోందా వీడికి? పీడ కలలుగాని వస్తున్నాయేమో? లేవగానే వెధవసోదీ వీడూను. కాఫీ చప్పగా చల్లారిపోయింది.

లేచి నిలుచున్నాను. కాళ్ళకు బూట్లున్నాయి. వంటిమీద ట్రౌజరూ, షర్టూను! రాత్రులు లుంగీతో పడుకోవడం అలవాటు నాకు. మరి యిదేమిటి? అమధ్య ఒకసారి ఇలాగే జరిగితే నిద్రమత్తులో బట్టలు మార్చుకోలేదని సరిపుచ్చుకున్నాను. ఇంకొకసారి సగం వ్రాసిన వ్యాసం ఉదయం పూర్తిచెయ్యొచ్చులే అని ఆపేసి నిద్రపోయాను. ఉదయం చూసేసరికి వ్యాసంపూర్తి చేసి వుంది. దస్తూరి నాదే! పొరపాటు పడ్డాననుకున్నా నప్పుడు.

ఈనాడు జరిగిందేమిటి? చుట్టుపక్కలవారి ఆరోపణలకు అర్థం ఏమిటి? వంటవాడి ఫిర్యా

దుకు సమాధానం ఏమిటి? నేనెక్కడకు వెళు తున్నాను? అసలు అలా తిరుగుతున్నానని నాకు వాళ్ళూ వీళ్ళూ చెప్పడం ఏమిటి? అంటే నాకుతెలియకుండానే ఇల్లువిడిచి అర్థరాత్రులు తిరుగుతున్నానా! మస్తిష్కంలో డయినమైటు ప్రేలింది!

ఏదో అవుతోంది. ఏమిటీ మార్పు నాలో! మెదడంతా పొగమంచు క్రమ్ముకుంటోంది. నాకు తెలియని ఇనుపతెర అడ్డుపడుతోంది. ఇదమిద్ధమని తెలియని పరిస్థితి. నావి అను కున్న శాంతి, సుఖం దూరం అవుతున్నాయి. ఈమార్పుకు కారణం తెలుసుకుని, దాని అంతు చూడాలి. ఇలా ఆలోచిస్తూవుంటే సాలెగూడు చిక్కబడిపోతుంది....అందుకే గా మోసు కాలే జీలోకూడా వాతావరణం మార్పు చెందింది ... నేను మొదట్లో గుర్తించలేక పోయాను. కొందరు నా వేపుచూసిన చూపుల్లో తెలియని భావాలు... కొందరు నన్ను వింతమృగాన్ని చూసినట్టు, దగ్గరకు వస్తే మింగేస్తానేమో అన్నంత భయంతో దూరదూరంగా తప్పుకు తిరుగుతున్నారు.

ఒకనాడు స్టాఫ్‌రూంలో సింకు దగ్గర ముఖం కడుక్కుంటున్నా. "అదొక సైకలాజికల్ కేసు గురువుగారూ! అందుకే అతని తల్లి లోకానికి తెలియకుండా జాగ్రత్తపడి, అతన్ని ఇంటి దగ్గరేవుంచి కాపలా కాసేది.'' ఆచారి ఇంకొక మాష్టారికి చెబుతున్నాడు. ఎవరి గురించి అనుకుంటూ వెనక్కు తిరిగేసరికి, హటాత్తుగా నన్నుచూసి వాళ్ళు బిత్తరపోయి అక్కడనుండి జారుకున్నారు. అయితే ఆనాడు వాళ్ళు మాటాడుకున్నది నా గురించేనన్నమాట!

అరవింద నా ఇంటికివచ్చి వారం రోజులు అయింది. ఏవో కుంటిసాకులు చెపుతూనేవుంది. వాళ్ళింట్లో వాతావరణంలో మార్పు కొట్టవచ్చి నట్టు కనిపిస్తోంది. ఏదో సంశయం. ఏదో సందేహం! వాతావరణం నిండా ప్రశ్నార్థకాలే! అయితే అరవిందకుకూడా నా గురించి, నాకు తెలియని సత్యం తెలుసునన్న మాట.

నిజంగా నేను విచిత్ర వ్యక్తినా? ఎవరికీ అర్థం కాని జటిల సమస్యనా! ఏమవుతోంది నాకు? ఈ పొగమంచు ఇక విడదా? ఈ ఇనుప తెర అడ్డం తొలగదా!

ద్రావిడ ప్రాణాయామమయింది జీవితం!

ఆ రోజు సాయంత్రం అరవింద ఇంటివైపు బయలుదేరాను. అరవిందను అడగాలి. నా గురించి ఆమె సహకారంతో నా సమస్యకు పరి ష్కారం లభిస్తుంది. ఇది నా ఆశ.

రోడ్డుమీద ఎదురయింది అరవింద......

ముఖంలో నాకు తెలియని భావాలు కనిపిం చాయి. అది కోపమో, బాధో, ఆందోళనో తెలియలేదు.

"నిన్న రాత్రి ఏ సినీమాకు వెళ్ళారు?" పిడుగు పేల్చింది అరవింద.

"సినీమాకా? నిన్నరాత్రా? లేదే! రాత్రంతా ఇంటి దగ్గరే వున్నాను."

నేను సినీమాకు వెళ్ళలేదని నాకు తెలుసు. గాని నేనిచ్చిన సమాధానంలో పటుత్వం లేదన్న విషయం నాకే తెలిసి పోయింది.

"ఎక్కడికీ వెళ్ళలేదా?" రెట్టించి అడుగు తోంది.

"లేదు అరవిందా. ఎక్కడికీ వెళ్ళలేదు. వెళితే నీ దగ్గిర దాపరికం ఏమిటి?"

సాధ్యమైనంత నిబ్బరంతో సమాధానం ఇచ్చాను. అయినా లోపల అనుమానం పీకు తోంది. నిన్నరాత్రి ఎక్కడకు వెళ్ళాను? ఎందుకు వెళ్లాను!

"అలా అనుకునే ఇన్నాళ్లూ మోసపోయాను." జేవురించిన ముఖంతో అరవింద. ఆమె కళ్ళలో నీటి పొరలు.........ముక్కుపుటాలు ఎగురుడు.

"నిన్నరాత్రి రెండు గంటలకు మీరు బీచ్ రోడ్లో ఏంచేసారు? పెట్రోల్ స్క్వాడ్‌లో వున్న వెంకట్రావుగారికి మీరు తెలుసు. ఇంట్లో అపుడప్పుడు మిమ్మల్ని చూడ్డం మూలాన పది లేసారు.ఆయనే ఇవాళ మానాన్నగారికిచెప్పారు.

"ఇప్పుడుచెప్పండి. అంత రాత్రివేళ బీచ్‌లో మీకేం పని? ఇంకా దబాయిద్దామనే అను కుంటున్నారా! రాత్రి ఇంటి దగ్గరే వున్నానని నన్ను నమ్మిద్దామనే అనుకుంటున్నారా!"ఉక్రో




షంతో కంఠం జీరపోయింది. పూనకం వచ్చిన దానిలా వూగిపోతోంది అరవింద.

నాలో నిస్సత్తువ, నీరసం చోటుచేసు న్నాయి.

ఉదయం జరిగింది గుర్తుకు వచ్చింది. ళ్ళ విప్పుతున్నప్పుడు కాళ్ళకున్న ఇసుక కంటబడింది. మరి నేను బీచికెందుకెళ్ళాను? పరిష్కారం కాని సమస్య.

"అయితే అందరూ అనుకుంటున్నది నిజమే న్నమాట. నేనే నమ్మలేదు. నాన్నగారు కూడ ్నరు. అటువంటివి జరుగుతుంటాయని... ." స్వగతాన్ని బయట పెడుతోంది అరవింద.

"ఏమిటా అంతా అనుకునేది? ఏమిటా నిజం! చెప్పు అరవిందా" అడిగాననే కంటె అరచాననే చెప్పాలి.

అదిరిపోయింది అరవింద. బెదరిపోయింది. ఎవరయినా వింటున్నారేమో అన్నట్టు చుట్టూ చూసింది. ఒకరిద్దరు కుతూహలంగా నిల్చున్నారు.

సిగ్గుతో చితికి పోయింది అరవింద. బెదిరే కళ్ళతో నావైపుచూసి "చూడండీ! ఇహ మీరు మా ఇంటికి రాకండి. నేను మీ ఇంటికి రాను. ఇక మీదట నన్ను కలియడానికిగాని, నాతో మాట్లాడడానికిగాని ప్రయత్నించకండి. ప్లీజ్. శలవ్" కళ్ళనుండి ఉబికే నీటిని ఆపే వృథా ప్రయత్నంచేస్తూ గిరుక్కున వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది అరవింద.

పగిలే తలతో యిల్లు చేరాను. కిటికీలోనుండి బయటకు చూస్తే, ఆకాశంలో సూర్యుణ్ని ఎవరో మర్డర్ చేశారు. ఆ వార్తను దిగాంతాలకు మోస్తోంది గాలి. అరవింద నాకు దూరమయింది. ఆప్యాయత, అభిమానం, అనురాగం అన్నీ దూరమయాయి. కన్న కలలన్నీ కరగిపోయాయి.

"అందరూ అనుకుంటున్నది నిజమే నన్న మాట"

అరవింద పలుకులు ములుకుల్లా వేధిస్తున్నాయి. కణతలు బ్రద్దలవుతున్నాయి. బుర్రలో రైళ్ళు ఢీకొన్న ఆందోళన! నాకు పిచ్చిగాని ఎక్కదు కదా! అమ్మలేని నాకు అన్నివిధాల అమ్మకు సాటి అనుకున్న అరవింద కూడ దూరమవుతుందా! తల బల్లకేసి కొట్టుకున్నాను. తిమ్మిరి రెక్కినట్టయింది.

ఎదురుగా అద్దంలో నా ప్రతిబింబం! నాకే భయం వేస్తోంది.

కళ్ళ చుట్టూ ఆ ముదతలేమిటి? ఆ నల్లని వర్తులాకారపు చారలేమిటి? పీక్కుపోయిన ఆ ముఖం ఎవరిది? గుంటలు కట్టిన ఆ కళ్ళు. గాజు గుళ్ళలాటి ఆ కళ్ళు....కళ్ళలోని ఆ కళ ... ప్రేతకళ....అవును అది ప్రేతకళే!

ఎవరికి చెప్పుకోగలను నాలోని బాధ! ఎవరున్నారు నాకు! చుట్టూవున్న ప్రపంచం వేధించుకు తింటోంది. లోనవున్న మెదడు కాల్చుకు తింటోంది. నాదీ అనుకున్న అరవింద అందకుండా పోయింది. ఇంకెవరున్నారు నాకు? ఎవరూలేరు! వంటరితనంలో నాకీ శిక్షేమిటి?

"నేను లేనట్రా కన్నా!" అమ్మ ఆప్యాయంగా పలికిందన్న భావన. ..ఆ భావన .. . అదొకటే నాకు సాంత్వన.

* * *

టేబిల్‌గ్లాసు టాప్‌మీద ఒక నల్లని కండ చీమ నడుస్తోంది . రాణీలాగ. ..రీవిగా, పొగరుగా నడుస్తోంది ...రాచరికం ఉట్టిపడుతోంది. వయ్యారం ఒలకబోస్తూ నడుస్తోంది. ఎంత పొగరు! సిగరెట్టు వెలిగించి రెండు దమ్ములు గట్టిగా లాగాను . .. సిగరెట్టు చివరకాలి నుసి కట్టింది. నుసి దులిపాను. ఎర్రగా కాల్తోంది సిగరెట్టు. నెమ్మదిగా కండచీమ వెనుకకాళ్ళ కంటించాను .రెడ్‌సిగ్నల్! డేంజర్! అపాయం! పారిపో! ఎవరో తరిమినట్టు, ఒక్కసారి సంచలనంపుట్టి పారిపోతోంది చీమ. .. ఎంతదూరం పోతుంది. .కథల్లో చదివిన రాక్షసుడి చేతిలోని రాజకుమార్తె గుర్తుకువచ్చింది. చిన్నగా నవ్వుకున్నాను. రెండవసారి దమ్ము లాగాను. ఈసారి సిగరెట్టును ముందరికాళ్ళకు అంటించాను .. . రాణిగారు కుంటుపడింది.... సోయగంపోయింది ...రీవి పోయింది....కాస్సేపట్లో సొమ్మసిల్లుతుంది. రెండు కాళ్ళనూ నాకే ప్రయత్నం చేస్తోంది. కొంచెం సేపటికి వెనుకకాళ్ళు కాస్తస్వాధీనానికివచ్చినట్టున్నాయి. నడక ..పరుగు....నడకలాటి పరుగు....ఇంకా ఒక్కదమ్ము లాగాను. నుసి దులిపాను. కణకణలాడుతోంది అగ్గి. మొత్తం శరీరానికి అంటించాను. అంతే! రామంది. మరి చలనం లేదు.

ఇంతలో ఎక్కడనుంచి వచ్చిందో మరొక చీమ వచ్చింది. దాని నడకలో తొందర, వేగం. దాని పనీ పట్టించాను. ఇంక చీమలురాలేదు. ఇంకొక సిగరెట్టుతీసి దమ్ము తృప్తిగాలాగాను.

కాని నాకు తెలుసు. ఈరెండు శవాలను మోసుకు పోయేందుకు ఎర్రచీమల దండు వస్తుంది ..ఉదయం అయేలోపల ఆ రెండు శవాలు మాయమవుతాయి.

* * *

చురుక్కుని ఎండ తగిలేసరికి లేచాను. డాబామీద దుమ్ములో పడుకొని వున్నాను. వంటిమీద బట్టలు మార్చుకోలేదు. కాళ్ళకు షూస్, సాక్సువున్నాయి. రాత్రి క్రింద గదిలో పడుకున్నంతవరకూ నాకు తెలుసు. మరిక్కడకెలా తేలానో!

అయితే అందరూ అనుకుంటున్నది నిజమేనన్నమాట!

క్రింద ఎవరో తలుపులు బాదుతున్నారు. తీయకపోతే విరగ్గొట్టేట్టున్నారు. అయినా ఈ వంటవాడిని మార్చేయాలి. ఒక్కరోజు శలవని వెళ్ళి రెండురోజులయింది. వాడికీ విసుగూ, చీకాకూ ఎక్కువవుతున్నాయి. వీడిని మార్చేయాలి. గబగబ క్రిందకు దిగి తలుపుతీశాను.

"యు ఆర్ అండర్ అరస్ట్" పోలీసు ఇన్స్పెక్టరూ, జవాన్లు.

"ఏం! ఎందుకూ?" టెంకాయ పిచ్చికొండ నయాను.

"అరవిందను హత్యచేసిన నేరానికి....యీ మనీపర్సూ .... డైరీ మీవేనా? నిన్నరాత్రి ఎక్కడున్నారు?'' ఏవేవో ప్రశ్నలు.

ఆ పర్సు నాదే! ఆడైరీ....అవును అదీ నాదే! మరి అరవింద? అరవిందకూడా నాదే, మరినేను? నేను....నేను అమ్మ సొత్తు.... ఇనుపతెఱ మంచుపొర అలాగేవున్నాయి. □

# నస శ్రీ

మన జనతా ప్రభుత అధికారంలోకి రాగానే [illegible] [ పద్మశ్రీలాంటి బిరుదాలకు గుడ్ బై చెప్పింది. కాని దానికి బదులుగా నసవాఙ్మయాన్ని ప్రోత్స హించి, అందులోనే నసశ్రీ, నసభూషణ్ లాంటి నిండైన బిరుదు లెందుకు .మెండుగా యివ్వదో నస సాహితీ పరిశోధకులకు నేటికీ అర్థం కాని విషయం. నసశ్రేష్ఠు లందరూ యేకమై, ప్రపంచ నస సోదరుల్లారా! ఏకం కండు! అని నినాదాలి స్తేగాని పనికాదేమో!

అసలీ నస సాహిత్యం వున్నది చూశారూ! ఇది మన వేదాల్లాగే ఆద్యంతాలులేనిది. అందులోవున్న పసందైన వనస నసకు పూర్వ రూపమని ఒక నస డాక్టరు నిర్వచనం. పిల్ల లకు పోసే వసయొక్క హెచ్చు తగ్గులే వారి భవిష్యజ్జీవితంలో నస పరిమాణాలకు కారణం అయి, ఎదుటివాళ్ళ సమయ హరణాలకు, మాన సిక హింసలకు హేతువులవుతాయి. సంగీత సాహిత్యేతిహాసాల్లో నస మార్గం ద్వారా పరమార్థం పొందిన నస స్రామ్రాట్టు లెందరో వున్నారు. వారందరినీ తలచుకొని, నస మార్గంలో సాగిపోవటమే మన ధ్యేయంగా ప్రస్తుతం మనకున్నది. ఆనాటి రామదాసు సంగీతపు నసతోనే రాములవార్ని హోరె క్కించి, నాణేలందుకొన్నాడు. అలనాటి సత్యభామాదేవి నస విదుషీమణియై, కృష్ణుడి చెవి క్రింద జోరీగలాగచేరి, బోరెక్కించి పారి జాతాన్ని పెరటి తోటలో నాటించుకున్నది. సుగ్రీవుడు అదే పనిగా రాముణ్ణి నస పెట్టి దొంగ దారిలో అన్నను అంతం చేశాడు. భక్తి రక్తి, ముక్తులకు మూలమైన పైదృష్టాంతాల నస ప్రస్తుతానికి ఆపి, మరో కోణంలోంచి నసావలోకనం చేద్దాం.

అతివాగుడు, అసందర్భం, చెప్పిందే చెప్పటం ముచ్చటగా ముడివడితే నసాలాపనకు మూల రూపం అవుతుంది. సమాజంలోని ప్రతివ్యక్తి లోనూ యిది కొద్దో గొప్పో గూడుకట్టుకొని వుంటుంది. శ్రోత్రియుల్లో మాత్రం ఛాందస మనే ముద్దు పేరుతో చెలామణీ అవుతుందను కోండి. ఉపన్యాసకుడు, ప్రారంభించబొయ్యే ముందు బంగాళాఖాతమంత వుపోద్ఘాతంతో మొదలెట్టి, అరగంట తర్వాత శ్రోతలపై దయ వుంటే అసలు సంగతికి వస్తాడు. లేకపోతే అంతే సంగతులు. పంతులుగారు, పాఠం ప్రారంభించబొయ్యే ముందుగూడ యథాశక్తి నస దేవతోపాసన మొదలెడతాడు. పిల్లలు బోరెక్కిపోయి పెద్ద పంతులుగారికి నసాప్లికే షను పెట్టుకుంటే, ఆయనగూడ డొంక తిరు గుడు నసాలాపన చేస్తాడు. మన రచయి తలు గూడ చాలవరకు నసశ్రీలే. వ్రాతల్లో కూడ అతి నసే. ఇన్సూరెన్సు ఏజంట్ల నస మరీ దుర్భరం. నస ముదిరితే జిడ్డు అవుతుంది. ఈ జిడ్డుశ్రీలు ఎదురుపడగానే పక్క సందు లోకి పారిపోవాలనిపిస్తుందందరికీ.

మరి కొందరు నస చక్రవర్తులుంటారు. "నువ్వెళ్ళిన పని యేమయిందోయ్" అని అడ గొద్దాంమంటే చచ్చామన్నమాటే. "నేను వెళ్ళి క్యూలో నిలబడి టిక్కెట్టుకొన్నాను.బండిగంట లేటు..."ఇలాప్రారంభిస్తే యెప్పటికిపూర్తవును ఆ భారతం? సత్యభామ వారసురాళ్ళయిన మన సోదరీమణులే నసాయనాన్ని భర్తలవద్ద ప్రథమ సాధనంగా వుపయోగించి, చీరలు, గట్రా సంపాయిస్తారు. ఇద్దరు నస భూషణులు తార సిల్లినపుడు వారి ద్వంద్వ యుద్ధం బలే మజాగా వుండి, వుచిత వినోద ప్రదర్శన అవుతుంది. ఎదుటి వాడి వాక్యం యెప్పుడు పూర్తవుతుందా అని ఆకలిగొన్న సింహంలా ఇవతలాయన ఆవురావురు మంటుంటాడు. ఇది కనిపెట్టిన మొదటాయన మాట్లాడేది కామాలు, ఫుల్ స్టాప్‌లులేని మహావాక్యాలే. రెండో ఆయన ఆగలేక ఆరంభిస్తే యిద్దరూ మాట్లాడుతూనే వుంటారు వినేవాళ్ళెవరూ అనుకోకండా. మధ్యలో ఒకాయన విసిగి జారుకున్నా, రెండో ఆయన గాలిలో మాట్లాడుతూనే వుంటాడు.

మన ఆంధ్రులందరం యీ నస సారస్వ తాన్ని యథాశక్తి ఆచరిస్తుండటంవల్ల, క్రియ శూన్యమై మనం మాటలాడుతుండగానే మిగి లిన వాళ్లు మన క్కావలసినవి తన్నుకు పోతున్నారు. కాబట్టి నస స్మాత్ జాగ్రత్త.

—'సుచంద్ర'

# మనసు గీసిన బొమ్మ

"జీవితాన్ని చాలా వ్యర్థం చేసుకున్నాను" అనుకున్నాడు నరసింహారావు.

నిన్న సాయంత్రం నుంచి అతని గుండెల్లో పొంగుతున్న చింతాధారకి హద్దూ — అపూ వుండడంలేదు. సరిగ్గా నిన్న సాయంత్రమే యెన్నేళ్ళుగానో అతని మనసులో మణిగి— అణిగిన తూణీరం చిట్లి వొకో అమ్ము సూటిగా గుండెలకి గుచ్చుకుపోతూంది. బాధ. అంతరాంతరాల్లో అంతుతెలియని అనంతమైన బాధ. ఈబాధ యీ జన్మకి పోతుందన్న నమ్మకం అతనికిలేదు. పరిస్థితులుచెయ్యిదాటి పోయాయ్. చాలాయేళ్ళు గడిచిపోయాయి.

నరసింహారావుకి పెళ్ళికాలేదు. వయసు ఏభయికి ఆపైన. నరసింహారావుకి బయాగ్రఫి లాంటిదేవీ లేదు. వొకవేళ రాయడాని కెవరయినా పూనుకుంటే రెండు పేజీలకంటే యెక్కువరాదు. ఎందుకంటే అతనిది పేచీల్లేని జీవితం. ప్రేమలూ — సెక్స్‌ఘట్టాలూ లేని జీవితం. పెళ్ళాంపోరూ—వుంపుడుగత్తె సెక్స్ వంపుల హోరూ లేని జీవితం.

వయసులో వున్నప్పుడు పెళ్ళిచేసుకో అని పెద్దాళ్ళుపోరితే మొండికేశాడు. స్నేహితులు బలవంతంచేస్తే విసుగ్గా ముఖం పెట్టాడు. ఆఖరికెప్పుడో వో ఆడపిల్ల ఆఫర్ యిస్తే తల తిక్కగా సమాధానాలు యిచ్చాడు. ఆడది లేకుండా బ్రతకలేనా? అన్నాడు. ఆ పిల్ల పల్చని కాయితంలా చెదిరిపోయింది.

ఇన్నాళ్ళకి తెల్వొచ్చింది.

"జీవితాన్ని చాలా వ్యర్థం చేసుకున్నాను" అనుకున్నాడు మళ్ళీ...మళ్ళీ.

అతనిక్కలిగిన జ్ఞానోదయం వెనుక ఒక సంఘటన జరిగింది.

## 2

నిన్నటి మునిపెచ్చటి సాయంత్రం—

గుడికి వెళ్ళాడు. ఆ గుడి చాలా ఖరీదయింది. పాలరాతితో కట్టారట. ఆ గుడికి వేలకొద్దీ జనం వస్తుంటారు. పొడుగాటి క్యూ. క్యూలో నిలబడ్డాడు. తనకిముందు కొత్తగా పెళ్ళయిన ఓజంట నలుగుతుంది క్యూ రాపిడికి. తనకిముందు ఆ అబ్బాయి. ఆ అబ్బాయికి ముందర ఆమె.

ఆ అబ్బాయి అందంగానే వున్నాడు. ఆ అమ్మాయికూడా బావుంది. వాళ్ళ ప్రవర్తన చూస్తుంటే యిద్దరూ జీవితంలో వెన్నూ-ఇంకు లాగా, యింగువా-పులిహోర లాగా బాగా కల్సిపోయి గడుపుతున్నారు అన్పిస్తున్నారు. ఏ ఒక్కరూ క్షణం దూరమయినా బ్రతుకలేరని స్ఫురిస్తుంది.

ఆ అమ్మాయి మెడకి సన్నని గొలుసుంది. అదికాస్త మెలితిరిగితే ఆ వెనుకనున్న అతడు సర్దాడు. ఆమె చివ్వున వెనక్కుతిరిగిచూసింది.

"నేనే" అన్నాడు నవ్వుతూ.

"దొంగనుకున్నాను" అంది నవ్వకుండా.

"నేనే దొంగనయితే?" అన్నాడు.

"పోలీసుల్ని పిలుదును" అంది.

"మరి నన్ను పోలీసాళ్లు లాక్కుపోతే నువ్వు వొంటరిగా యింటికి వెళ్ళగలవా?" అన్నాడు యింకా నవ్వి.

ఆమె క్షణం ఆలోచించి "వుహుఁ . . వెళ్ళలేను" అని తల అటుతిప్పేసుకుందామె.

అంతా చూస్తున్న నరసింహారావు "అబ్బా యెంత మత్తుగా గడుస్తుంది వీళ్ళ స్వంతకాలం" అనుకున్నాడు.

క్యూ కదిలింది.

పూజారి శఠగోపం ఆమె తలమీద పెట్టినప్పుడు ఆమె పట్టుజుట్టు రేగితే అతను అందంగా సవరించాడు. ఇద్దరూ దేవుడికి మొక్కి జనంనుంచి బయటకు కక్కబడ్డారు.

వాళ్ళిద్దరూ నరసింహారావుని బాగా ఆకర్షించారు. తనకి తెలీకుండానే వాళ్ళని ఫాలో అవుతూ పోతున్నాడు.

వాళ్ళిద్దరూ వో హోటల్లో కెళ్ళారు. ఒకటే టీ ఆర్డరిచ్చారు. ఆమె కొంచెం సిప్‌చేశాక ఆ కప్పు అతనందుకొని యింకొంచెం తాగి మళ్ళీ ఆమెకిచ్చాడు.

చూస్తున్న నరసింహారావుకి తల తిరిగింది.

వాళ్ళిద్దరూ రోడ్డుమీద నడుస్తున్నారు. ఆమె పువ్వులకొట్టు వేపు చూసింది. అతనికి ఆమె భాష తెల్సునుకుంటాను. వెంటనే కొట్టులో కెళ్ళి మూరెడు మల్లెపూలు తెచ్చి ఆమె జడ పాయల మధ్య యిమిడ్చి వాసన చూశాడు.

అతని పనికి ఆమె అందమైన విసుగుతో చూసింది. మరి ముందుకు సాగదాం అన్నాయ్ ఇద్దరి కళ్ళూ.

నడుస్తుండగా వున్నట్టుండి ఆమె ఆగిపోయింది. బాధగా ముఖం పెట్టింది.

"ఏం ఏమయింది?" అన్నాడు కంగారుగా.

"కాలు బెణికింది."

"ఏదీచూణ్నీ" అనికిందికి వొంగుతున్నాడు.

"అబ్బ! వూరుకుందురూ నడిరోడ్డు మీద" మెత్తగా మందలించి మత్తుగా నవ్వింది.

"బాధపోయిందా?" అన్నాడు.

ఆమె తలూపింది. ముందుకు....ముందుకు సాగారు.

వాళ్ళనేచూస్తూ వెనక నడుస్తున్న నరసింహారావుకి గుండెల్లో నైరాశ్యం ఆవహించింది. మనసు విషాదంతో హోరుపెట్టింది. ఈజీవితం నిర్విశేషం అనిపించింది. ఈ జీవితం చీకటితో కప్పబడ్డ చీకటి అన్పించింది. అలా ప్రశ్నిస్తూ ముందుకి కదిలాడు.

పూర్వంనించీ అతని దేహంలో కాపురం వున్న బ్లడ్‌ప్రెషర్ ఆ రాత్రి అధికమయింది.



మాత్రలు అల్మైరాలో వున్నాయ్. లేచి తెచ్చిచ్చే దిక్కులేదు. అప్పుడు నిజంగా అనుకున్నాడు నరసింహారావు, అయ్యో! జీవితాని కెంత అన్యాయం చేశాను అని.

## 3

"జీవితాన్ని చాలా వ్యర్థం చేసుకున్నాను." అని నిన్నటినుంచీ అనుకుంటూ శ్రాంతపాంధుడిలా అలమటిస్తున్న నరసింహారావుకి వున్నట్టుండి వూహించలేనంత వుత్సాహం పుట్టుకొచ్చింది. మనసు తరళితమైంది. తనలో యెక్కడో కోటి హరిణాలు ఆనందంతో గంతులేస్తున్నాయి. వెన్నెల్లో సెలయేళ్ళు పారుతున్నాయ్. కళ్ళలో జ్యోతులు ద్యోతిస్తున్నాయ్.

నరసింహారావు పెళ్ళిచేసుకుందామనే నిర్ణయానికొచ్చాడు. అదేనా ఆనందం? కాదు.

మరి? మరి??

ఎవరో ఒకామెతో నిన్నటి దంపతుల్లా ఒక సాయంత్రపు పూట గడిపి, ఆ ఆనందాన్ని జీర్ణం చేసుకుని, యిక మళ్ళీ మళ్ళీ సాయంత్రాలు చూడకుండా చనిపోవాలి. ఔను. చనిపోవాలి.

ఆలోచనలతో ఇలా కాలాన్ని పాతిపెట్టడం వృథా. వెంటనే తనకో ఆడది కావాలి. తనకి దొరికే ఆ ఆడది భార్యలా నటించకూడదు. కనీసం సాత్వికాభినయంకూడా చెయ్యకూడదు. తనలో మైనంలా కరిగినట్టు, జీర్ణం అయినట్టు ప్రవర్తించాలి. దొరుకుతుందా అని.

ఆలోచిస్తుంటే మనసులో యెవరిదో మెరుపు పదఘట్టాల నిర్ఘోషాలు. యెవరు?

భానుమతి.

భానుమతెవరు? వో ఆడది. ముప్పయ్ అయిదేళ్ళ వయసు. మగాళ్ళని విపరీతంగా అసహ్యించుకునే మనసుగల ఆడది.

తెల్లగా, పెద్దగావుండని పొడుగ్గావుంటుంది. ఎంతయినా వయసు పెరగటంవల్ల నడుం మూడు మడతలు పడింది. కళ్ళ రెప్పలకింద చారలు తేలాయ్. నవ్వేటప్పుడు చలాగ్గానూ నవ్వగలదు—చిరాగ్గానూ నవ్వగలదు. ఆమెలో శాంతీవుంది—అశాంతీవుంది. ఇదీ భానుమతి ఫిగర్ తాలూకు రిఫరెన్స్.

రేపు భానుమతిని మీట్ అవ్వాలనుకున్నాడు నరసింహారావు.

## 4

నిన్న అనుకున్న రేపు ఆరోజే—

ఆఫీసులో మధ్యాహ్నంవేళ లీజర్ టైమ్ భానుమతిని కల్సాడు నరసింహారావు.

ఆమెతోఅర్ధగంట మాట్లాడాడు. ఆ మాటల వెనక కోటి ప్రార్థన్లున్నాయి. విషాదపు తుఫానుంది.

అంతా వింది భానుమతి. పాపం ఇక రేపులు చూడని జీవుడి జీవితంలో ఆఖరి కోరిక తీర్చాలి అనుకుంది.

సుస్మిత వదనంతో "వూఁ సరే రేపుకి శలవు రాస్తాను ఆఫీసుకి" అంది.

ఆ మాటకి నరసింహారావు యెగిరి గంతేసేవాడే కానీ నలభయ్యేళ్ళ దేహం యెగరడం అసాధ్యం అంది.

## 5

మళ్ళీ రేపు నేడు అయిపోయింది.

మూడుగంటలనుంచే భానుమతికోసం ఎదురు చూస్తోంటే సరిగ్గా నాలుగుకొట్టడంతో భానుమతి రావడం జరిగింది అతని రూంకి.

ఇద్దరూ బయల్దేరారు.

గుడిలో ఆ క్యూలో నిలబడ్డారు. నరసింహారావు ముందు భానుమతి నిలబడింది. క్యూ నెమ్మదిగా కదుల్తోంది.

భానుమతి మెడకేసిచూశాడు నరసింహారావు. మెడలో సన్నటి చెయిన్‌లాటిదేదీ వేసుకోలేదు. కానీ జుట్టుకి పెట్టుకున్న చెంపపిన్ను వూడేతరుణంలోవుంది. తన చేత్తో దాన్ని మెత్తగా జుట్టులోనికి గుచ్చాడు. చివ్వున వెనక్కితిరిగి చూసింది భానుమతి.

"నేను" అన్నాడు నవ్వుతూ.

"దొంగనుకున్నాను" అంది నవ్వేముఖంతో.

"నేనే దొంగనయితే?" అన్నాను.

"పోన్లెద్దూ అనుకుంటాను" అంది యింకా నవ్వుతూ.

ఆమె మాటలకి నరసింహారావులో మనీషి పొంగిపోయాడు.

క్యూ కదిలింది.

దేవుడిముందు నిలబడ్డారు. పూజారి శఠ గోపం పెట్టినపుడు భానుమతి జుట్టురేగక పోయినా ఆమె మెత్తని జుట్టుని సున్నితంగా సర్దాడు. భానుమతి సిగ్గుగా తలొంచుకుంది. ఇద్దరూ అక్కణ్నించి కదిలారు.

భానుమతీ-నరసింహారావూ హోటలుకెళ్లారు. సప్లయర్‌కి ఒక "టీ" మాత్రవేఁ ఆర్డరిచ్చింది భానుమతి.

నిరసంహారావు మనసులో పిచ్చి ఆనందం వేసింది.

ఆమెకేసి చూశాడు.

"రెండు టీ యెందుకూ దండగ!" అంది భానుమతి.

టీ వొచ్చింది. నరసింహారావు ఆత్రంగా కప్పుని అందుకుని కొంచెం తాగి టేబిల్‌మీద పెట్టాడు.

అతని ప్రవర్తనకి అసహ్యించుకోలేదు భాను మతి. సప్లయర్‌కి యింకో టీ కోసం ఆర్డరివ్వ లేదు భానుమతి. వెంటనే ఆ కప్పు అందుకుని సగం తాగింది. అందులో ఆఖరి సిప్ నరసింహా రావు కాజేశాడు.

స్త్రీలు, పురుషుల్నికంటే ముందు పువ్వుల్ని ప్రేమించడం మొదలెత్తారట. ఆ కారణంగా రోడ్డుమీద నరసింహారావు పక్కనే నడుస్తున్న భానుమతి పువ్వుల దుకాణాలు కన్పిస్తే వాటికేసి చూసింది యథాలాపంగా. అది గమనించిన వెంటనే కొట్టువేపెళ్ళి మూరెడు మల్లెపూలు కొనితెచ్చి భానుమతి జడపాయల మధ్య యిమిడ్చి వాసన చూశాడు నరసింహారావు.

అతని ప్రవృత్తికి నవ్వుతూ చూసింది భాను మతి.

ఇద్దరూ నడుస్తున్నారు.

కావాలని ఆమె కుడికాలి పాదాన్ని తనకాల్తో తొక్కాడు.

"అబ్బా!" అని బాధగా అంది భానుమతి.

"ఏం యేవఁయింది?" అన్నాడు కంగారుగా.

"కాలు" అంది బాధగా.

"ఏదీ చూణ్నీ" అని కిందికి వొంగుతుంటే "అబ్బ! వూరుకోండి నల్గురూ చూడగల్రు" అంది.

ఇద్దరూ ముందుకు సాగారు.

అలా రాత్రి యెనిమిదింటి వరకూ వాళ్ళు ఇద్దరూ నిజమైన భార్యాభర్తల్లా ప్రవర్తించారు. భానుమతి తనని తాను మర్చిపోయింది.

సరిగ్గా ఎనిమిదింటికి—

వాళ్లు విడిపోయే సమయం ఆసన్నం కాబో తుంది. వో సెంటర్‌లోకొచ్చాక విడిపోబోతూ నరసింహారావు అన్నాడు—

"చాలా కృతజ్ఞుడిని భానుమతిగారూ! నిజంగా వృధాచేసుకున్న యీ జన్మలో ఆనంద మంతా యీనాడు పొందాను. మరి విడిపోదాం."

అతని మాటలు భానుమతికి శరాఘాతాల్లా తగిలినయ్.

భానుమతి అతనికి బాగా దగ్గరగావచ్చింది.

అతని చేతులు తన చేతుల్లోకి తీసుకుని అనంతరం తనముఖం ఆ చేతుల్లో దాచుకొని ఏడుస్తుంది. తెగేడుస్తుంది.

నరసింహారావు ఆమెకేసి వింతగాచూశాడు. ఏమనాలో తెలియక "వూరుకో భానూ!" అన్నాడు.

ఆ మాటకి భానుమతి నరసింహారావు గుండెలమీదపడి తెగ రోదిస్తూంది. రోదిస్తూ అస్పష్టంగా యీ మాటలు అంది—

"నాకూ నిజం తెల్సింది. నేను విడి పోను." □

# తీరుబడి

**వసుంధర**

"నన్ను మీరు క్షమించేయాలండీ—ఏమిటో ఈమధ్య బొత్తిగా తీరుబడి ఉండడం లేదు" అనేశాడు శంకరం.

నవ్వాలో ఏడవాలో తెలియలేదు నాకు.

తీరుబడికి మారుపేరు మా కాలనీ. సమాన హక్కులకోసం ప్రపంచంలోని ఆడవాళ్ళందరూ వుమెన్స్‌లిబ్ జరుపుతున్న ఈ రోజుల్లో భార్యకు వంటపనుల్లో అన్నివిధాలా సాయం చేశాకగానీ—లేదా వంటచేయడం తామే పూర్తి చేసిగానీ ఆఫీసుకు వెడతారు మా కాలనీలో వున్న భర్తలందరూ. అలాగని ఆ భర్తలందరూ ఏదో కష్టపడిపోతున్నారని అనుకోనవసరం లేదు. ఉదయం తొమ్మిదికల్లా టిఫిన్ తినేసి ఆఫీసుకివెళ్ళి పన్నెండున్నరవరకూ చేతిగోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటారు. ఆ తర్వాత ఇంటికివచ్చి భోజనంచేసి ఒంటిగంటన్నరకల్లా మళ్ళీ ఆఫీసుచేరి నాలు ఘన్నరవరకూ కాలిగోళ్లు గిల్లడం చేస్తారు. ఎక్కువగా కట్‌చేస్తే జుట్టు చాలా త్వరగా ఎదుగుతుందంటారు. వాళ్ళ గోళ్ళు కూడా రోజుకొకసారి ఎదిగిపోయి బాగా కాలక్షేపాన్ని ప్రదర్శించడానికవకాశమిస్తూంటాయి. రోజురోజుకీ గోళ్ళెదిగిపోవడంవల్ల ఎప్పుడైనా సెలవురోజు గోళ్ళుగిల్లుకునేందుకు వీలుపడకపోతే చాలా ఇబ్బంది పడుతూంటారు వాళ్ళు.

వాళ్ళకి బొత్తిగా వ్యాయామంలేకుండా పోయిందని ఇంట్లో ఆడవాళ్ళు—కనీసం ఇంట్లోవున్నప్పుడేనా పనిచేయండని వంటపనులు అంటగడుతుంటారు. ఎందుకంటే రెండునిముషాలు నడకదూరంలోవున్న ఆఫీసుకు వెళ్ళడానికి వాళ్ళు సైకిళ్ళు, స్కూటర్లు, కార్లు వగయిరా వాహనాలు వాడతారు. వాహనాలు లేనివాళ్ళు, వాహనాలున్న వాళ్ళిచ్చే లిఫ్టుకోసం ఆఫీసుకు కాస్త ఆలస్యమయినా ఇబ్బంది లేదనుకుంటారు.

వాళ్ళ సంగతలాగుంటే ఆడవాళ్ళ సంగతి మరీఘోరం. భర్త వీధిగుమ్మం దాటగానే వీరు వీధిగుమ్మంలోకి వస్తారు. ప్రతి ఒక్కరు వారివారి ఇళ్ళలో పొజిషన్సు చూసుకుని కాస్త హెచ్చు స్వరంతో ఉపన్యాసాలవంటి కబుర్లు మొదలెడతారు. ఎవరు మొదలుపెడితే వాళ్ళు ఆగరు. ఆగితే రెండవ వాళ్లు మొదలు పెట్టేస్తారనీ—మళ్ళీ తమకు చాన్సురాదనీ భయం. అయినా ఎప్పుడో అప్పుడు ఊపిరిపీల్చుకోవడానికయినా ఆగక తప్పదు కదా! అప్పుడు మ్యూజికల్ చెయిర్స్‌లోలాగా ఎవరు అప్రమత్తతగావుంటే వారికి మాట్లాడే అవకాశం వస్తుంది. వీళ్ళలో ఎవరూకూడా ఒకరు చెప్పేదింకొకరు వినరు. మాట్లాడే మనిషి ఎప్పుడాగుతుందా అప్పుడు తాము మాట్లాడుతామా అని ఎదురు చూస్తూంటారు. అలా వారు అనర్గళంగా గంటలకొద్దీ మాటాడేసుకుంటూంటారు—ఎవరయినా అడ్డుపడేవరకూ.

మాటల వ్యాయామం తప్పితే చేతలవ్యాయామం ఆడవారికి చాలా తక్కువే! వంట విష

యంలో భర్తసాయం చేస్తాడు. గిన్నెలు పని మనిషి తోముతుంది. పనిమనిషి లేనివారు గిన్నెలు భర్త ఉన్న సమయంలోనే తోము కుంటారు. భార్యాభర్తల్లో ఎవరు గిన్నెలుతోము తారన్నది బహిరంగ రహస్యం.

ఈ కారణాలవల్ల మా కాలనీలో ఆడా,మగా అందరూ ఎంతో పుష్టిగావుంటారు. పిల్లలు మాత్రం అంత పుష్టిగావుండరు. ఎందుకంటే తలిదండ్రులకు వీరిని పట్టించుకునేటందుకు తీరు బడి కావాలికదా!

ఇంతకీ ఇపుడు శంకరంగారి తీరుబడి ప్రసక్తితో ఈ వివరాలన్నీ చెప్పాల్సివచ్చింది.

ఎవరికీ సరయిన పనిలేకపోవడం వల్లనేమో మా కాలనీలో అందరికీ ఒక విధమైన బద్ధకం ఏర్పడిపోయింది. కొంతమందికి ఇల్లు కదిలి పొరుగింటికి వెళ్ళాలంటేనే బద్ధకం. సినిమాకి వెళ్ళాలంటే దాన్నో పెద్ద ప్రయాణంగా భావించి వదిలేసేవారు మా కాలనీలో చాలామందున్నారు. అందులో కొంత నిజం కూడా లేక పోలేదు లెండి.

ఈ పరిస్థితిలో తెలుగువారికి తెలుగు మరచి పోకుండా అభ్యాసంగా వుంటుం దని ఇంకో రకం పనిలేని వాళ్ళం కొందరం కలసి ఓ లిఖిత తెలుగు పత్రిక పెట్టేము. ఆ పత్రి కకు రచనలు కావాలి కదా!



పత్రిక కాలనీ జీవితానికి ప్రతిబింబంగా వుండాలని మా ఆశయం. అందుకని మా కాల నీలో తెలుగు తెలిసిన ప్రతి ఒక్కరినీ రచన లడగడం ప్రారంభించాము. అప్పుడే మాకు తెలిసింది—కాలనీలో చాలామంది తెలుగువారికి తీరుబడి ఏ మాత్రమూ లేదని. ఎలాగో నానా అవస్థలూపడి రెండు పత్రికలు వెలుగులోనికి తీసుకువచ్చాం. వాటిని చదివి ఒక్కొక్కరినే అభిప్రాయాలీయవలసిందిగా కోరాము. ఆ అభి ప్రాయాలతో కొన్ని పేజీలు నింపవచ్చునని మా ఆశ.

అయితే పత్రిక చదవడానికే తీరుబడి దొరక లేదని శంకరం అనడంతో నాకు నవ్వాలో ఏడ వాలో తెలియలేదు.

"ఆశ్చర్యంగా ఉందే" అన్నాను ఒక్షమంటకు ఆశ్చర్యం అన్న పేరుపెట్టి.

"అవునండీ — నేను తీరుబడిలేక పేపరు చదవడం మానేశాను. రేడియో వినడం మానే శాను—"

"ఏమిటి కారణం?"

"మా అబ్బాయండీ. ఒక్క క్షణంకూడా వాణ్ని చంక దించడానికి వీలులేదు."

"పోనీలెండి. ఆఫీసుకయినా రానిస్తున్నాడు. అదయినా నయం...." అన్నాను వ్యంగ్యాన్ని కడుపులో దాచుకునేందుకు ప్రయత్నిస్తూ.

"అబ్బె—వాడిగురించి ఇంతవరకూ మూడు క్యాజువల్ లీవులు వృధా అయిపోయాయి. ఆ

మధ్య ఓ నాలుగురోజులు ఎర్న్డ్ లీవు కూడా పెట్టేను."

"ఇంక వ్వడి లీవొక్కటే తతవాయి" అను కున్నాను మనసులో.

శంకరం నావంకచూసి "నేను చాలా బాధ పడుతున్నానండీ. వెధవది పుస్తకం చదవటం ఎంతసేసండి—పావుగంట. ఆ మాత్రం తీరు బడి యెలా చేజిక్కించుకోవాలో ఏదయినా ఉపాయం చెబుదురూ...." అన్నాడు.

"నిజంగా మీకు ఉపాయం కావాలా?"

"నిజమండీ—తెలిస్తే చెప్పండి...."

"చెబుతాను కానీ మీరేమీ అనుకోకూడదు"

"బాగుందండీ — ఉపాయం చెబాతూంటే ఏమైనా అనుకోవడమెందుకు?"

క్షణం మాత్రమే తటపటాయించాను. "ఆ మధ్య ఓ వారంరోజులు మీ పాలవాడు పాలు పొయ్యకపోతే ఏం చేశారు మీరు?"

శంకరానికి నాప్రశ్న వెనుక ఉన్న భావం అర్థమైనట్లులేదు. సూటిగానే జవాబుచెప్పాడు. "సైకిల్‌మీద టౌన్‌వెళ్ళి మిల్క్‌బూత్‌నుంచి తీసుకువచ్చాను."

"అందుకెంత టైమ్ పట్టేది?"

"సుమారు ముప్పావుగంట . ."

"అంతసేపూ మీ బాబుని మీ శ్రీమతిగారే భరించారుకదా. .."

"అయితే?"

"మరోరోజు మీ పాలవాడు పాలుపోసినా పోయలేదనుకోండి. అలా అనుకోవడంద్వారా రోజుకు ముప్పావుగంట చొప్పున మీకు తీరు బడి దొరుకుతుంది" అన్నాను.

ట్రాప్‌లో పడిపోయాననుకున్న శంకరానికి చిన్న డిఫెన్స్ దొరికింది. "మావాడు నేనుంటే మా శ్రీమతి దగ్గరుండడండీ—నాన్న, నాన్న అంటూ మీద పడిపోతాడు. ఇంట్లో లేనపుడు అది వేరే సంగతి!"

"దానికీ వుపాయముంది" అన్నాను నేను.

"ఏమిటది?" అన్నాడు శంకరం ఈసారి ఇబ్బందిగా.

"ఏమీలేదు. ఆ మధ్య ఓ శనివారంనాడు మీ ఇంట్లో పేకాటకేర్పాటు జరిగింది. ఆఆట నాలుగయిదు గంటలు కొనసాగిందేమో!"

"అవును.. "

"అంటే మీరింట్లోవున్నా మీ బాబు మీ శ్రీమతి దగ్గరుండే అవకాశాలున్నాయి.ఎటొచ్చీ మీరు పేకాడుతున్నానని అనుకోవాలి. అలా వారాని కొక్కసారి చేసినా చాలు నాలుగు గంటలు తీరుబడి దొరుకుతుంది మీకు."

శంకరం నవ్వేసి—"నన్ను మన్నించాలి. రేపే మీకు పుస్తకాలూ, వాటితోపాటు నా అభిప్రాయాలు పంపించేస్తాను" అన్నాడు.

"ఏమీ అనుకోలేదుగదా మీరు. .." అను మానంగా అడిగాను.

"బాగుందండీ—మీ ఉద్దేశ్యం నన్ను నొప్పించడం కాదుగా—ఒప్పించడమే" అంటూ మన స్ఫూర్తిగా నవ్వాడు శంకరం.

ఇది మా కాలనీలోని ప్రత్యేక విశేషం. ఎవరికీ యెవరిమీదా అనుమానాలూ, ద్వేషాలూ లేవు. వాదనలో ఓడిపోయినపుడు ముఖం ఎర్రగా చేసుకోడానికి బదులు—నవ్వేసి— "నన్నొదిలేయాలండీ"అనడం ఇక్కడి రివాజు.

ఆ తర్వాత నేనక్కణ్ణించి సుజాత గారింటికి వెళ్ళాను. ఆ సమయానికి వాళ్ళింట్లో గెస్టులున్నారు. వాళ్ళతో పాటే నేనూ కూర్చున్నాను. సుమారు గంట అనంతరం గెస్టులు వెళ్ళారు.

"చూశారుగా — యిదీ వరుస...." అంది సుజాత.

"అయితే యింకా రాయలేదా?" అన్నాను నీరసంగా.

"ఏం రాయనండీ—గెస్టులమీద గెస్టులు" అంది సుజాత.

"అవునండీ—తీరుబడి దొరకడంలేదు—"




అని సుజాత భర్త కూడా భార్యకు వంత పాడాడు.

మా మూడవ సంచికకు సుజాతగారి రచన అడిగాము. ఆవిడ అనర్గళంగా, ధారాళంగా వగయిరా, వగయిరాగా మాటాడగలగటమే కాక—తన మాటలతో శ్రోతలకేమాత్రమూ విసుగును కలగనివ్వక పోవడం నన్నాకర్షించిన విశేషం. అంతబాగా ఆగకుండా మాటాడ గలిగిన మనిషికి మంచి కల్పనాశక్తి వుండితీరుతుందనే అభిప్రాయంతో నేను ఆవిడను ఒక రచనచేసి ఇవ్వమని కోరాను. "అనుభవం లేదండీ" అందావిడ.

"మీ ఎదురుగా ఎవరయినా ఉన్నారనుకొని వారితో మాటాడుతున్నాననుకోండి. ఏం తోస్తే అది రాసేయండి'' అన్నాన్నేను. అతికష్టం మీద ఆవిడ అంగీకరించింది. అంగీరింపచేయడం ఒకఎత్తు—రచన సంపాదించడం ఇంకో ఎత్తు అనిపిస్తోందిపుడు పరిస్థితి చూస్తూ వుంటే.

సుజాతతో వాదించడం కష్టం. ఆవిడకు ముందుగానే అభిప్రాయాలు కొన్ని యేర్పడి వుంటాయి. వాటినికాదని మనం వాదన మొదలు పెట్టేమా ఆవిడ బుర్రలోకి ఇంకేమీ ఎక్కవు. మనం చెప్పేదేమీ ఆవిడ వినదు. మనంపూర్తి చేసేదాకా మాత్రం ఆగి తను అనుకున్నదే విధంగా సరియైనదో వివరించడానికి ప్రయత్నిస్తుంది. అందుచేతనే మనపని జరగాలంటే వాదన విధానం మార్చాలి.

అయినా మొదటి ప్రయత్నంగా "తొమ్మిది గంటలనుండి పన్నెండున్నర వరకూ మళ్ళీ ఒంటిగంటన్నర నుండి నాలుగువరకూ మీరు ఇంట్లో తలుపులు వేసుకొని కూర్చోండి. కేవలం ఒక్కరోజే. ..'' అన్నాను.

"అబ్బే—అదేం కుదరదండీ—ఇరుగావిడో పొరుగావిడో వచ్చి తలుపు తట్టేస్తారు....'' అనేసిందావిడ.

ఆ మాటల్లో అబద్ధంలేదు కానీ అదంత పెద్ద సమస్యకాదు. తను ముఖ్యమైన పనిలో ఉన్నానని చెపితే వాళ్ళు వెళ్ళిపోతారు. అలా చెప్పి పంపడం ఆవిడ కిష్టముండదు. వచ్చిన ప్రతి వారితోనూ పావు గంటయినా కబుర్లు చెబితే కాని ఆవిడకు తోచదు. అంతేకాదు—ఆవిడ నిజంగానే ముఖ్యమైన పనిలో ఉన్నా ఇరుగమ్మో పొరుగమ్మో వచ్చి తలుపు తట్టాలని

ఆవిడ కుంటుంది. అలా జరక్కపోతే తనకీ తన ఇంటికీ చిన్నతనంగా ఆవిడ భావిస్తుంది.

ఇవి సుమారు ముప్పై ఏళ్ళుగా ఒక మనిషిలో పేరుకుపోయినా భావాలు. వాటిలోని మంచి చెడ్డలను నిర్ణయించే అర్హత నాకులేదు. తప్పొప్పుల నెన్నడం నాకు తగని పని—నాకు తగిన పని కార్యసాధన.

"ఇంకే ఉపాయమూలేదా?" అన్నాడు సుజాత భర్త నన్నే చెప్పమన్నట్లు.

"ఉంది. అందుకు మీ సహకారం కావాలి .. " అన్నాను.

"చెప్పండి. ఆయన సహకారం తప్పక ఉంటుంది...." అంది సుజాత భర్త తరఫున హామీ ఇస్తూ.

"ఏమీలేదు, ఆఫీసుకు సెలవులేని రోజున ఏదైనా పూజవస్తే ఏంచేస్తారు మీరు?"అన్నాను.

"ఏముంది—కాస్త పెందరాళే లేస్తాను. ఆయన పిల్లల్ని, పై పనులూ చూసుకుంటారు. నేను వంట, పూజ చూసుకుంటాను. సులభంగా తెమిలిపోగలం...." అందావిడ.

"పూజకే మాత్రం సమయం కావాలి—?"

"ఓ గంటకు పైగా—."

"సరే—అయితే ఓ నాలుగు రోజులపాటు పూజ ఉందనుకోండి. నాలుగు గంటల తీరుబడి వస్తుంది. . " అన్నానేను.

ఆవిడ రచన ఇస్తానని వాగ్దానం చేసేక నేను ప్రతాప్ దగ్గరకు బయల్దేరాను.

ప్రతాప్ అదొక రకం మనిషి. అతనికి చాలా చాలా చేయాలని ఉంటుంది. కానీ అతనిలో కొంత ఇనర్షియా ఉంది. ఆ పైన ఎదుటి వాళ్ళ ప్రభావానికి లొంగిపోయే మనస్తత్వం ఉంది. ఎప్పుడైనా అతను ఇనర్షియాను అధిగమిస్తే—ఎదుటి వాళ్ళొచ్చి లొంగదీసేసుకుని అతని దారిని మళ్ళించడం జరుగుతూంటుంది.

అలా నా ప్రభావానికి లొంగిపోయి అతను నాకో మాటిచ్చాడు. మా కాలనీకి దగ్గర్లో ఒక పముఖ రచయిత్రి వుంది. ఆవిడ తెలుగుది కావడం వల్లకానీ-లేకపోతే మా కాలనీ తెలుగు వారందరూ ఈ పాటికి పిలిచి సన్మానించ వలసినంత పేరున్న దావిడకు. ప్రతాప్‌కి ఆవిడతో కొంత పరిచయముంది. అతను ఆవిడ నడిగి మా పత్రికకు కొన్ని రచనలు (కనీసం ఒకటైనా) సంపాదిస్తానన్నాడు పనిలో పనిగా మా పత్రికలను సమీక్షించ వలసిందని కూడా ఆవిడను కోరమని ప్రతాప్‌కి చెప్పాను. అప్పటికి సుమారు నెల రోజులుగా ప్రతాప్ ఈ విషయాన్ని వాయిదా వేస్తూ వస్తున్నాడు. ఏమిటంటే ఎవరో పేకాటకు ఆపేశారన్నాడు. మరో రోజు ఎవరో సినిమాకు తీసుకుపోయే రన్నాడు. ఇంకో రోజు మర్చిపోయనన్నాడు. ప్రతిసారీ ఏదో కారణం కొత్తదో పాతదో వస్తోంది తప్పితే పని జరగడంలేదు. గట్టిగా అడగడానికి ఇదేమీ అతని స్వంత బాధ్యతకాదు కదా! అప్పటికి ఒకరోజున అతన్ని మా ఇంటికి భోజనానికి పిలిచాను. మా ఇంటినుంచి తీసుకువెళ్ళి ఆ రచయిత్రి ఇంటి దగ్గర దిగబెట్టవచ్చునన్న ఉద్దేశ్యంతో. అయితే అతనారోజు మా ఇంటికి రాలేదు. మర్నాడు చెప్పాడు. వద్దామనే బయల్దేరాడట—ఎవరో అతన్ని ఈలోగా టౌన్ తీసుకెళ్ళి పోయారట. ఇంతకంటె ఎక్కువగా అతని గురించి ఏమీ చెప్పనవసరం లేదనుకుంటాను.

నిన్నటి రోజున తప్పక వెడతానని మాటిచ్చేడు. ఎందుకంటే ఆఫీసుకు వరుసగా మూడు రోజులు సెలవు లొచ్చాయి. అందుకే నేనీ రోజు అతని గదికి బయల్దేరాను.

నేను వెళ్ళేసరికి గదిలో జోరుగా పేకాట సాగిపోతోంది. నన్నుచూచి ప్రతాప్ నవ్వి— "సారీ గురూజీ—నే నింకా వెళ్ళలేదు. నిన్నటి నుంచి ఆగకుండా పేకాట కొనసాగిపోతోంది. మధ్యలో రెండుసార్లు టిఫెనూ-ఒకసారి భోజ

మళ్ళీ తప్పులు
టైప్ చేసినట్టున్నావే సుశీ!



నమూ-అయిదుసార్లు కాఫీలూ—నాలుగ్గంటలు నిద్రా మాత్రం అయ్యాయి—" అన్నాడు.

"అనుకున్నాన్లెండి కానీ—ఇంక లేవండి." అన్నాను నెమ్మదిగా. ఎందుకంటే ఇంకలాభం లేదు—నేను స్వయంగా అతన్ని కదిలిస్తే తప్ప పని జరగదు.

ప్రతాప్ లేవగానే అతని స్థానంలో అంత వరకూ ఛాన్స్‌కోసం ఎదురుచూస్తున్న ప్రసాద్ కూర్చున్నాడు. ప్రసాద్ కూర్చోగానే - ప్రతాప్ బట్టలు మార్చుకుంటూ—"మంచి రైజ్‌లో ఉన్నపుడొచ్చారు గురూజీ—చోటు మంచిది. లక్కీ ఛాన్స్‌కొట్టావ్..." అన్నాడు.

దారిలో—"ఏం చేయను గురూజీ—తీరుబడి ఎలా సంపాదించాలో తెలియడంలేదు—" అన్నాడు ప్రతాప్.

ప్రతాప్ దగ్గర నా క్కాస్త చనువుంది—"చూడండి ప్రతాప్—తీరుబడి అనేది బజార్లో దొరికే వస్తువు కాదు. భగవంతుడిలా అది కనిపించకుండా మన దగ్గరే ఉంటుంది. గుళ్లోని రాతి విగ్రహం ఉలకదు, పలకదు. కానీ దాన్ని చూసి మనం భయపడుతున్నాం. దాన్ని మనం కోరికలు కోరుతున్నాం. దానికి మనం దేవుడని పేరు పెట్టాం. అది దేవుడు కాదని మనకందరికీ తెలుసు. మనకు తెలిసిన ప్రతి కథా రాతి విగ్రహంలోనే దేవుడు లేడనీ—దేవుడు సర్వాంతర్యామి అనీ చెబుతుంది. అలాగే తీరుబడి విషయం కూడా. మనకే ప్రయోజనమూ లేదనుకున్న పనిని వదుల్చుకునేందుకూ, మనకిష్టంలేని పనిచేయకుండా ఉండడానికీ మనం చెప్పే కారణం పేరును "తీరుబడిలేదు. " అంటారు తప్పితే తీరుబడి సర్వత్రా వ్యాపించి ఉంది. రోజుకు పద్దెనిమిది గంటలు పనిచేసే జవహర్లాల్ నెహ్రూ—పదవీ కాలంలోనే ఎన్నో గ్రంథాలు రచించాడు—" అన్నాను.

మరి నా తీరుబడి సంగతేమిటని అందరూ అడగవచ్చు. మేము పెట్టిన ఈ లిఖిత పత్రిక ఆగిపోయే దాకా నాకు తీరుబడి ఉన్నట్లే లెక్క మరి। □

# పాఠకురాలి సలహా

"ఆ.. ఆ తరవాత కథ ఏమయింది." అది ఇంగ్లీష్ లెక్చరర్ సరళ స్వరం.

"అబ్బ త్వరగా చెప్పండి. సస్పెన్స్ భరించలేక చస్తున్నాను" అది హిస్టరీ లెక్చరర్ ఉష స్వరం.

"అబ్బ ఉండండి బాబూ. నన్ను కాస్త ఊపిరి పీల్చుకోనిస్తారా లేదా" అంటుంది ఎకనామిక్స్ లెక్చరర్ జయ.

రవుండ్స్‌కెళ్ళి అటుగా తిరిగి తన గదికెళుతున్న వుమెన్స్ కాలేజి ప్రిన్స్‌పాల్ రేఖారాణిని ఆ సంభాషణ టక్కున ఆపేసింది. వాళ్ళముగ్గురికీ లీజర్ కాబట్టి స్టాఫ్‌రూంలో కూర్చొనికథలు చెప్పుకుంటున్నారు. బయట ఆగిపోయిన ప్రిన్సిపాల్‌ని గురించి వాళ్ళకు తెలియదుకాబట్టి వాళ్ళ ధోరణిలో కథ జోరుగా ముందుకు సాగుతుంది.

'సరిగ్గా ఇలాగే ఒకనాడు తనూ, ఆసక్తిగా వినే తన మిత్రురాండ్రకి కథ చెప్పింది' అనుకుందామె. పాత జ్ఞాపకాలతో లోతుగామారిన కంటిచూపులో ఎన్నో ఆలోచనల నీడలు కదలుతుండగా ఆమె అన్యమనస్కంగా ముందు కడుగులేస్తూ వెళ్ళి తనగదిలో ప్రిన్సిపాల్ టేబుల్ వెనక కుర్చీలో కూర్చుని, కళ్ళద్దాలు తీసి తుడుస్తూ మళ్ళీ అనుకుంది.

'అవును ఆనాడు తనిలాగే కథ చెప్పింది. అసలాకథ చెప్పటంలో తన ఉద్దేశం వేరు. కాని విచిత్రంగా అది తన నిర్ణయాన్ని మార్చేసింది. తనా నాడు ఆకథ చెప్పటమే మంచిదయింది. లేకుంటే....' ఆమె ఆ తరువాత ఆలోచించలేక పోయింది. మాలిని, శ్రీవిద్య జ్ఞప్తికొచ్చారు.

రేఖారాణి, మాలిని, శ్రీవిద్య ముగ్గురూ చిన్నతనాన స్కూల్లో చదువుకున్నారు. ఆనక చదువులు వేరయి, పెళ్ళిళ్ళయి బ్రతుకులు వేరయి మాలిని, శ్రీవిద్య చెరో వూరెళ్ళిపోయారు. పురిటికని మాలిని, చెల్లెలి పెళ్ళికని శ్రీవిద్య అనుకోకుండా ఒకేసారి తిరిగి తమ ఊరు రావటంతో ముగ్గురు మిత్రురాండ్రు మళ్ళీ రేఖ వాళ్ళింటిలో కలుసుకో గలిగారా నాడు. మాలిని, శ్రీవిద్యల కబుర్ల కంతులేదు. రేఖ చాలామటుకు మౌనంగా వింటుంది.

"నీకేం రేఖా! కోరి మెడలో పూలమాల వేసాడు ఇంజనీరు మొగుడు. యిల్లూ, కారూ దేనికీ కొదవలేని అదృష్టవంతురాలివి. మాకా, పాతిక వేలు లంచం మిస్తేగాని మెడలో మూడు ముడులేయలేదు మా మొగుళ్ళు. దేనికైనా పెట్టి పుట్టాలి." నిట్టూర్చింది మాలిని.

మిత్రురాలి మాటలకి రేఖ చిన్నగా నవ్వింది. అందమైన పలువరసవున్న కారణంగా రేఖ నవ్వుకూడా అందంగా వుంటుంది.

"ఏదెలావున్నా మా ఆయన నన్నూ పిల్లల్ని ఎంతో గౌరవంగా చూస్తారు." మళ్ళీ మాలినియే అని నవ్వింది.

"నీ అంత అదృష్టవంతురాల్ని కాకపోయినా మా సంసారం కూడా చల్లగనే సాగుతుంది రేఖా. మా ఆయన అర్థం చేసుకొని ఎంతో ప్రేమగా, గౌరవంగా చూస్తారు." అంది శ్రీవిద్య.

"అంతకన్నా ఆడదానికింకేకావాలి." అంది రేఖ.

"ఆఁ దానికేంగాని మాకులాగా నీకు ఉద్యో

ఎస్. కవిత

గాల బెడద లేదు గదా. రోజంతా ఏమి చేస్తుంటావ్" మాలిని అడిగింది.

"ఏవుందీ....ఏవీ లేదు."

"ఈ మధ్య పనిలేని ఆడవాళ్ళంతా రచయిత్రు లయిపోతున్నారు గదా, నీవు కూడా కథలు రాయ కూడదా." కథల పిచ్చివున్న శ్రీవిద్య అంది.

"కథలు రాయటమంత తేలికైతే నేనీ పాటికో మహారచయిత్రినయి పోయే దాన్ని. ఎందుకో తెలుసా? నేను చదివి నన్ని కథలు ఈ ప్రపంచంలో ఇంకెవరూ చదివుండరు." హాస్యంగా అంది మాలిని.

"అవును కథలు రాయ టం కష్టమే. అసలు నాకు కథలు రాయాలన్న ఆలో చన లేదు. అయినా ఈ మధ్య నేనొక కథ రాసాను తెలుసా" అంది రేఖ.

"నిజంగా" మాలిని కళ్ళు విస్మయంతో విచ్చు కున్నాయ్.

"ఆ. కథెలాగో మొద లెట్టి రాయగలిగాను గాని, నా కథకి సరియైన ముగింపు తోచక, అసంపూర్తిగా వది లేసాను."





"ముగింపే కదా, కథ చెప్పావంటే ముగింపు మేము చెప్పేస్తాం" మాలిని ఉత్సాహంగా అంది.

"నేనెన్నో కథలు చదువుతాను. ఆలో చిస్తాను. కాని కాయితం కలం చేత బట్టుకుంటే పట్టున పది పంక్తులుకూడా రాయలేను. కాని నీ కథ వింటే ముటుకు ముగింపు చెప్పగలను" ప్రోత్సాహంగా అంది శ్రీవిద్య.

"అవునోయ్ నీ కథ ముగింపు పూచీ మాకు వది లేసి, త్వరగా ఆ కథేదో చెప్పేసెయ్" మాలిని కూడా ప్రోత్సహించింది.

"మీ మాటలువింటుంటే నాకు చాలా తేలికగా వుంది. సరే టూకీగా కథ చెబుతాను వినండి. కాని ముగింపుమటుకు మీకే వది లేస్తున్నా. మీరేది చెబితే అదే నా కథ ముగింపు."

"ఓకే" మిగిలిన ఇద్దరూ సర్దుకొని కూర్చుంటూ సర దాగా అన్నారు.

* * *

సుచిత బి.ఏ. పరీక్షలు రాయగానే పెళ్ళి ఖాయ మయింది. రవి చూడ చక్కనివాడు. బేంక్ మేనే జరు. ఆ పైన ఆస్తిపరుడు. సుచిత తండ్రి కొద్దో గొప్పో కట్న మిచ్చేందుకు సిద్ధం గానే వున్నాడుగాని, వాళ్ళు కట్నం మడగలేదు. పెళ్ళి చాలా వైభవంగా జరిగింది. సుచిత అదృష్టాన్ని అంతా వేనోళ్ళ పొగిడారు. పెళ్ళ యిన వెంటనే ఉత్తరాదంతా హనీమూన్ తిరిగొచ్చారు.

కాపరానికెళ్ళిన కొత్తలో సుచితకు భర్త వ్యవహారం కొత్తగా అనిపించినా కాలం గడిచే కొద్దీ ఆమెకు క్రమంగా భర్త వ్యవహారం అర్థం కాసాగింది. రవికి స్త్రీ అంటే గౌరవం

గాని సదభిప్రాయంగానీలేదు. స్త్రీకి స్వంత ఆలో చనలు, ఆశలు, ఆశయాలు, అభిప్రాయాలు వుంటయ్యనే భావనే లేదతనికి. అంతా తనిష్ట ప్రకారం కానిచ్చుకుంటూ పోవటం, దానికే చిన్న అంతరాయం కలిగినా భార్యమీద విరుచుకు పడటం, శృతిమించితే కొట్టటం కూడా చేస్తుంటాడు.

ఆఫీసయాక అతనెక్కడెక్కడ తిరిగి వచ్చినా, ఎంత తాగివచ్చినా, ఏవేళప్పుడు వచ్చినా ఆమె నోరెత్తకూడదు. అందంగా, హైక్లాసుగా వుండే అతనంత బండబూతులు తిడతాడని, భార్యమీద అసహ్యంగా చెయ్యి చేసుకుంటాడని ఎవరూ అనుకోరు.

చదువూ, సంస్కారం, గౌరవ మర్యాదలు గల కుటుంబంలో పుట్టి పెరిగిన సుచితకి భర్త చవకబారు వ్యవహారం చాలా జుగుప్సాకరంగా వుండేది. అయినా తప్పనిసరిగా అన్నీ భరించ సాగింది.

ఆమె ఇరవై నాలుగు గంటలూ యింట్లోనే వుండాలి. ఎక్కడికీ తీసుకెళ్ళడు. ఆమె వెళ్ళ కూడదు. పొరపాటున కూడా వాకిట్లో నిలబడ కూడదు. కూరనచ్చకుంటే కంచం మొఖాన గిరాటేస్తాడు. భార్య మనసు, అనారోగ్యాలతో నిమిత్తం లేకుండామీదపడి తన వాంఛలు తీర్చుకుంటాడు. ఒకసారి పెళ్ళంటూ అయాక ఏది ఏవయినా భరించక తప్పదనుకునే సుచిత భర్తలోని ఎన్ని దుష్కార్యాలైనా భరించింది గాని, పిల్లలు వద్దంటూ రోజూ తనచేత బలవంతాన మందులు మింగించే భర్తని మటుకు ఆమె భరించ లేకుండావుంది.

సుచితకి పిల్లలంటే ఎంతో మక్కువ. పిల్లలుంటేనన్నా తనకి కొంత వ్యాపకంగా, సంతోషంగా వుంటుందని ఆమె ఆశ. కాని అతనికి పిల్లలంటేనేపడదు. పిల్లలు వద్దేవద్దంటాడు. పొరపాటున ఆమె అర్నెల్ల క్రితం గర్భవతైతే దానికి పెద్ద రాద్ధాంతం చేసి వెంటనే బలవంతాన అబార్షన్ చేయించాడు. దానితో ఆమెకి భర్తంటే అసహ్యం కలిగింది. ఈ భావనెప్పుడయితే వచ్చిందో అప్పుడే ఆమెకు తన బ్రతుకంటే విరక్తికూడా కలిగింది. తన నొక మనిషిగా కాక, యంత్రంగా ఆటవస్తువుగా చూస్తున్న భర్తన్నా, తన దరిద్రపు బ్రతుకన్నా ఆమెకు రోత పుట్టేసింది.

మరికొన్నాళ్ళు గడిచేసరికి, మరే మాత్రం భర్తతో కలసి వుండలేననే స్థితి కొచ్చింది సుచిత. కాని ఏమిచెయ్యాలో ఎక్కడికెళ్లాలో అర్థం కాలేదు. సంసారం చెడి పుట్టింటి కెళ్ళి వాళ్ళ కపకీర్తి తెచ్చి, వాళ్ళ గుండెలమీద కుంపటిగా మారటం ఆమె కేమాత్రం ఇష్టం లేదు. పెళ్ళి కావాసిన చెల్లెళ్ల గుర్తుకొస్తే, చెడిన బ్రతుకుతో తనా గడప తొక్కలేనను కుంది. వయసులోవున్న అందమైన స్త్రీ ఆమె. ఎక్కడికి కెళ్ళగలదు? ఏమి చెయ్యగలదు? ఎటుచూసినా ఆమె కొక్కటే మార్గం కనబడ సాగింది. అదే ఆత్మహత్య. అంతేకాదు ఆత్మహత్య చేసుకునే మార్గాలుకూడా చాలా చాలా కనబడుతున్నయ్. పెళ్లి పేరిట తన మెడలో తగిలించిన పసుపు తాడెటూ, ఉరితాడై రోజురోజుకీ ఉచ్చు బిగిసి ఊపిరాడకుంగా గొంతు బిగుసుకుపోతుంది. అలాంటిదే మరో ఉరితాడు మెడకి తగిలించుకోవటమంత కష్టతరమేమీకాదు. కాదంటే ఎందులోనన్నా దభీలున దూకేస్తే సరిపోతుంది. కొన్ని నిమిషాలు మనవి కాదనుకొని కళ్ళుమూసుకుంటే ఆత్మహత్య అంత కష్టమైన పనేమీకాదు. మొద్దూ, హృదయంలేని రవి వంటి స్వార్థపరుడూ, పశుప్రాయుడైన మగవాడితో రోతపుట్టించే ఈ బ్రతుకు బ్రతికేకన్నా చావటమెంతో మేలని పించేది. అందుచే చివరికి సుచిత తన ఐదేళ్ళ వైవాహిక జీవితానికి, పాతికేళ్ళ జీవితానికి స్వస్తి చెప్పటానికి నిశ్చయించుకుంది.

*　　*　　*

"ఇదర్రా నేను రాసిన కథ. కాని సుచితచేత ఆమె బ్రతుకుకి స్వస్తి పలికించట మెలాగో నాకు సరిగ్గా తోచక కథ ఇంకా అసంపూర్తి గానే వుంచేసాను. సరియైన ముగింపుచెప్పి కాస్త పుణ్యం కట్టుకోండి." అంది రేఖ.

"అబ్బ ఇట్లాంటి బాదుగోలు సంసారమైతే




నే నొక్కనాటికీ చెయ్యను. సుచిత ఓర్పుకి ప్రైజ్ ఇవ్వాలనిపిస్తుంది. నేనైతేనా రవి కప్పుడే గుడ్‌బై చెప్పేసేదాన్ని" మాలిని అంది.

"చెప్పేసాక?" కుతూహలంగా చూసింది రేఖ.

"చెప్పేసాక ఏవిటనేది, చెప్పాకే ఆలోచించే దాన్ని" లెక్కలేకుండా అంది మాలిని.

"ఆడదాని బ్రతుకంత తేలికకాదు మాలినీ. అరిటాకు ముల్లు సంగతి నీకు తెలిసిందే గదా. అందులో పెళ్ళయిన ఆడది తన సంసారం వదులుకోవాలంటే ఎన్ని ఆలోచించాలి. మగవాడే వెర్రి వేషాలేసినా చెల్లిపోతాడు, మొగుడెన్ని అగచాట్లు పెట్టినా, నీచుడైనా, చండాలుడైనా వాడి పంచన పడివున్న స్త్రీకి సమాజంలో గౌరవం. సీతమ్మ వారిలా ఎంత ఓర్పు, ఎంత పతిభక్తి అంటూ మెచ్చుకుంటారు. గౌరవిస్తారు. పరాయి మగవాడెవడూ అటు కన్నెత్తి చూడడు. కాని ఆకు చాటు తప్పిన దోరకాయ కనబడితే ప్రతివాడికీ నోరూరుతుంది. కాయ నేలరాలేదాకా తుంటరి వాళ్ళు రాళ్ళు రువ్వుతారు. కాయకెన్ని దెబ్బలు తగులతయ్యో, అందమైన ఆ కాయ ఎంత వికారమవుతుందో ఊహాకందనిది కాదు. ఎన్ని దెబ్బలు తప్పించుకున్నా, చివరికేదో దెబ్బ కది వట్టు తప్పి నేల రాలక తప్పదు. ఆ పడటం ఏ బురద గుంటలోనైనా పడితే ఇకదాని గతేమిటి?"

రేఖ వాగ్ధాటికి మాలిని గంభీరమయింది. "అవును రేఖా నేనివన్నీ ఆలోచించకుండా అనేసాను. నీవు చెప్పిన కధ, నీ ఈ ఆఖరి మాటలు విన్నాక, ఆకుచాటు తప్పిన దోరకాయగా మిగలటం కంటే హీనం లేదనిపిస్తుంది." లోతైన స్వరంతో అంది.

"ఈ లోకంలో మనిషికి అన్నిటికన్నా తన ప్రాణం అత్యంత ప్రీతికరమైనది. అటువంటిది ఒక వ్యక్తి తన ప్రాణాన్ని తానే స్వయంగా తీసుకోదలచితే ఆ మనిషి తన పరిస్థితులతో ఎంత ఘోరంగా విసిగిపోయిందో మనకు విదితమవుతుంది" శ్రీవిద్య తన ధోరణిలో చెప్ప సాగింది. "అయినా ఒక నిర్ణయం తీసుకొనే ముందు నాలుగు విధాలా ఆలోచించటం మంచిదిగదా."

"సుచిత తన భర్తతో కలసి బ్రతకలేకుండా వుంది. అతన్ని వదిలేసి పుట్టింటి కెళితే ఆమె తల్లిదండ్రులు కాదనకపోయినా అదివాళ్ళకెంతో అపకీర్తి, దుఃఖ కారణం. చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు ఆగిపోయే ప్రమాదం కూడావుంది. విధవగా

పుట్టింటి కెళ్ళిన ఆడదానికైనా ఆదరణ, గౌరవం లభిస్తయ్యేమోగాని, సంసారం చెడి వెళ్ళిన స్త్రీకి రెండూ లభించవు. ఇరుగూ పొరుగూ, బంధుమిత్రులు, వదినలు, మరదళ్లు ఇలా ఎంత మందినుంచో ఎన్నో పడాల్సి వస్తుంది. ఆమె ఎటువంటి పరిస్థితులు భరించ లేక వచ్చేసిందనేది సమాజాని కక్కరలేదు. ఆలోచించటం కంటే, అనటం ఎంతో తేలిక గదా మరి. ఫలితంగా సుచితవంటి వాళ్ళ బ్రతుకు మరింత నికృష్టమౌతుంది. అయినా స్త్రీ జీవితం భర్త,పిల్లలనే వాటితోనే కదా పరిపూర్ణమయేది. వాటికి నోచుకోక, బ్రతుకంటే విసుగు చెందిన సుచిత, పుట్టింటికెళ్ళి తన బ్రతుకు మరింత హీనం చేసుకొని, మరింత బాధపడి అందరికీ ఒక క్వొశ్చెన్ మార్క్ అయేకన్నా మరో జన్మలోనైనా మంచి బ్రతుకిమ్మని భగవంతుడ్ని మనస్ఫూర్తిగా కోరుకొని, ఆ బ్రతుకక్కడ ఫుల్‌స్టాప్ పెట్టేయటమే సర్వోత్తమ మని పిస్తుంది."

"సరిగ్గా నా ఆలోచనా అదే విద్యా." తను అనుకున్న ముగింపునే మిత్రురాలు ఎంతో విపులీకరించి చెప్పటంతో సంతోషంగా మళ్ళీ అంది. "మీరిద్దరూ నా తొలి రచన విని, ఆలో చించి, ఇంత విపులీకరించి మరీ మంచి ముగింపు సూచించినందుకు థాంక్స్. సుచిత ఆత్మహత్య చేసుకున్నట్లు ఈ రాత్రికి రాసే స్తాను. కాని ఒక సందేహం....సుచిత మెడకి ఉరితాడు తగిలించనా? లేక...."

"వద్దుబాబూ...." మధ్యలోనే అందుకుంది మాలిని. "ఉరితీసుకుంటే కళ్ళుబయటికొచ్చి నాలుక బయటకొచ్చి చాలా వికారంగా తయా రవుతారు. ఎంత కథయినా అందమైన సుచిత అంత వికారంగా అవటం నేను భరించలేను." అంది మాలిని.

"నిజమే రేఖా ఉరితీసుకోటం భయంకరం గానే వుంటుంది. ఎందులోనయినా దూకాలన్నా సుచిత పాపం, ఏ అర్థరాత్రిపూటో వంటరిగా, ఏ నుయ్యో గొయ్యో వెతుక్కుంటూ పోవాలి. ఆ అన్వేషణలో ఏ దుష్టుడో దురాత్ముడో ఎదురయి ఏదయినా అవాంఛితం జరిగితే ఆమె బ్రతుకు మరింత ఘోరం. కనుక పాపం సుచిత కోసం నువ్వే ఎక్కడయినా కాసిని నిద్రమాత్రలు సంపాదించావంటే, అవి మింగి గమ్మున పడు కుంటుంది. అప్పుడామె అందం చెడదు, అవ మానంపాలు కాదు. ఆత్మమటుకు మరోజన్మ మీద ఆశతో అనంతాలలో కలిసిపోతుంది. ఎలావుంది మన సలహా?"

"వండర్‌ఫుల్" రేఖకన్నాముందు మాలిని అంది.

"బాగుంది నీ సలహా అంట్ ఆల్‌సో నీ విపులీకరణ" రేఖ నవ్వింది.

"అయితే ఈ రాత్రికి సుచిత నిద్రమాత్రలు మింగి ఆత్మహత్య చేసుకుంటుందన్నమాట. పూర్ థింగ్" మాలిని పెదవి విరిచి గమ్మత్తుగా కళ్ళు తేలవేయటం చూసి మిగిలిన యిద్దరూ నవ్వారు.

"మొత్తంమీద కథ చాలాబాగా తయారు అయిందిగాని, ఏదయినా పోటీకి పంపించేయ్. అనక మా ఇద్దరికీ అంకితమిచ్చేసేయ్" సర దాగా అంటూ శ్రీవిద్య వెళ్ళటానికి లేచింది.

"తప్పకుండా" తనూ లేచింది రేఖ.

వీడ్కోలు తీసుకొని వాళ్ళిద్దరూ వెళ్ళి పోయాక రేఖ లోతుగా ఆలోచిస్తూ చాలాసేపు అక్కడే కూర్చుండిపోయింది. ఆలోచనల మధ్య కారుచీకట్లు తరుముకొచ్చి ఆమెను కమ్మేశాయి.

ఐదుగంటలనంతరం చివరికొక స్థిరనిశ్చ యానికొచ్చి లేచి పడకగదిలోకెళ్ళి, టేబుల్ లైటేసి, పదిదాటి పరిగెడుతున్న టైమ్‌పీస్ నొకసారి పరికించి, బెడ్‌మీద కూర్చుంటూ కాగితం కలం చేతిలోకి తీసుకుంది రేఖ. తన ఆత్మహత్యకు ఎవరూ కారకులు కాదని, ఒక చీటీరాసి బల్లమీద పెట్టింది. బల్ల సొరుగు అడుగున భద్రంగా దాచుకున్న నిద్రమాత్రల సీసా అందుకుని, మాత్రలన్నీ చేతిలోకి వంపు కుంది. టక్‌టక్ మంటున్న టైమ్‌పీస్ తప్పించి మరో చప్పుడులేదు. రేఖ కుడిచేతిలో గ్లాసుడు నీళ్ళు, ఎడంచేతిలో గుప్పెడుమాత్రలు. నిజమే, కొన్ని నిమిషాలు తనవికాదనుకుంటే ఈ దశ

ద్రపు బ్రతుకుకూడా తనది కాదనుకుంటూ ఆమె గట్టిగా కళ్ళుమూసుకుని నోరు పెద్దగా తెరిచి గుప్పెడు మాత్రలూ ఒకేసారి నోట్లో పోసుకో బోయే సరికి హఠాత్తుగా ఫోన్ ట్రింగ్ ట్రింగ్ అని మోగటం మొదలయింది. ఆగి కళ్ళు తెరచి నుదురు చిట్లించింది. ఫోన్ మోగటం ఆగిపోతుందేమోనని. ఆమె అలాగే ఫూర్చుని చాలా సేపు దాన్ని అసహనంగా చూసిందిగాని అది ఆగలేదు. పైగా రాక్షసిలా ఇంకా గట్టిగా మోగుతున్నట్లనిపించి, ఇక విసుగేసి చేతిలో గ్లాసు బల్ల మీదపెట్టి పరమ చిరాగ్గా లేచివెళ్ళి రిసీవర్ అందుకుంది.

"హలో ... రేఖా" ఆమె హలో అనక ముందే అవతలనుంచి శ్రీవిద్య స్వరం ఆదు ర్దాగా వినిపించింది. "రేఖా నువ్వేకదూ.. "

"అవును"

"నేను విద్యను మాటాడుతున్నాను. నీవు నిద్రపోలేదుగదా."

"లేదు."

"అయితే పరవాలేదు. నిద్రాభంగం కలి గించానేమోనని భయపడ్డాను. ఇంతకీ సంగ తేవిటంటే, సాయంత్రం మీ యింటినుంచి వచ్చాక నేనెందుకో నీవు చెప్పినకథ మరచి పోలేక పోయాను. ఎంత వద్దనుకున్నా అది నా మనసునుండి తొలగిపోక మేధకెంతోపదును పెట్టింది. వింటున్నావా...."

"ఆ."

"ఒక నిర్ణయం తీసుకునేముందు నాలుగు విధాలా ఆలోచించాలని చెప్పానేగాని, నాలుగు విధాలా ఆలోచించకుండానే కథకి ముగింపు చెప్పేశాను. ఈమాత్రంది రేపు చెప్పకూడదా, అర్ధరాత్రి నన్ను డిస్టర్బ్ చెయ్యాలా అని నువ్వన వచ్చు. కాని రేఖా ఎందుకో సాయంత్రం నువ్వు రాసిన కథ విన్నాక నేనెందుకో అది మర్చిపో లేకుండా వున్నాను. నేను నీ అంత అదృష్ట వంతురాలిని కాకపోయినా, నాదెంతో సుఖ సంతోషాలున్న సంసారం, నాభర్త దైవ స్వరూపులంటే అసత్యంకాదు. మా యిద్దరి పిల్లలతో మేమెంతో హాయిగావున్నాం.అందుకే అందరూ నాలాగే హాయిగా వుండాలని, వున్నా మని చెప్పాలని నా కోరిక. అందుకే సుచిత కథ నా మనసునెంతో కదిలించివేసింది. తన సంసారంతో విసిగిపోయి ఆమె ఆత్మహత్య చేసుకోవాలనుకోవటం నాకు చాలా కష్టం కలి గించింది. ఇంటికొచ్చాకకూడా యింతసేపూ అదే ఆలోచించాను. దానితో నా అభిప్రాయం పూర్తిగా మారిపోయింది. నా పూర్వపు అభి ప్రాయమెంత మూర్ఖంగావుందో అవగాహన యింది. నా మూర్ఖపు అభిప్రాయాన్ని పట్టు కొని నీవు కథముగించేయటం నా కిష్టంలేదు రేఖా. అందుకే నీవా కథ ముగింపు రాయక ముందే నీకు నా సరియైన అభిప్రాయం చెప్ప దలచి అర్ధరాత్రయినా ఆగలేక ఫోన్ చేశాను. నీకే విధంగానూ కష్టం కలిగించలేదు కదా?"

అవతలిప్రక్క శ్రీవిద్య స్వరం ప్రశాం తంగా వినబడుతుంది. కాని యివతల ప్రక్క రేఖకి ముందుభృకుటి ముడివడింది. అనంతరం ఆమెలో సన్నని వణుకు ప్రారంభమయింది. అనంతరం వళ్ళంతా చెమటలుపోయ నారంభిం చాయి. తల తిరిగిపోతున్నట్లు, మైకం కమ్ము కొచ్చి, కాళ్లు తేలిపోయి ఏదేదో అయిపోతూ ఉన్నట్లనిపించ సాగింది. ఇదేమీ తెలియని శ్రీవిద్య తన ధోరణిలో చెప్పసాగింది.

"రేఖా ఆ కథలోని సుచిత ఇక ఏమాత్రం తన భర్తతో కలసి వుండలేదు. అలాని కాపరం చెడి పుట్టింటికెళ్ళటం ఆమెకిష్టంలేదు. వంట రిగా బ్రతకటం కష్టతరం, వ్యర్ధమని తలంచి చావటమే మంచిదని తీర్మానించాము. కాని మనం కథ మూడువిధాలే ఆలోచించాము. నాలుగో విధంగాకూడా ఆలోచిస్తే ఆమె సమ స్యకి మంచి పరిష్కారం లభిస్తుంది రేఖా. ఎలాగో చెప్పనా?" ఆగి మళ్ళీ తనే అంది.

"సుచిత పల్లెటూరి బైతుకాదు. బి.ఎ. పాస యింది. అటువంటి స్త్రీ తన సంసారం చెడి నంత మాత్రాన పుట్టింటికే వెళ్ళ నవసరంలేదు. వంటరిగా ఈ కలుషిత సమాజంలో దిక్కు తోచక నిలబడ నవసరంలేదు. కాలమెంతో

మారిందని మనం మర్చిపోయాము రేఖా. వంటరి స్త్రీలు బ్రతికేందు కెన్నో మార్గాలున్నయ్! ఆ విషయం ఎలావున్నా సంసారం చెడిన స్త్రీలంతా సుచితలాగా భీరువులై ఆత్మహత్య చేసుకుంటే నాటి స్త్రీకి, నేటి స్త్రీకి మధ్య ప్రగతి ఎక్కడ? భీరువు పరిస్థితులకు లొంగిపోయి ఆత్మహత్య చేసుకుంటాడు. ధీరువు పరిస్థితుల నెదుర్కొని ఏదో విధంగా వాటిని జయించ ప్రయత్నిస్తాడు. సుచిత ధీరువు కావాలి. పరిస్థితుల నెదుర్కో వాలి. ఏ వర్కింగ్ విమెన్స్ హాస్టల్లోనో చేరాలి. కాకున్నా నూటికి కోటికి ఒక మంచి మనసైనా వుంటుంది. తన పరిస్థితుల సర్థం చేసుకోగల అటువంటి ఒకరి ఆశ్రయమన్నా కోరి ఆమె ఉద్యోగం చేసుకోవచ్చు, ఇంకా పైకి చదవొచ్చు. తన పరిస్థితులు చక్కబడ్డాక ఆమె మళ్ళీ పెళ్ళి చేసుకోవచ్చు. ఇల్లూ పిల్లలనే అందమైన అనుబంధాలలో తన బ్రతుకు నందన వనం చేసుకొని పరిపూర్ణత పొందొచ్చు. కాదంటావా?"

రేఖారాణి మాట్లాడ లేకపోయింది. ఆపాద మస్తకం వణికి పోసాగింది. ఆమె చేతిలోని నిద్ర మాత్రలు ఆమెకు తెలియకుండానే పట్టు తప్పి జారిపోయాయి.

"ఏమిటి రేఖా మాట్లాడవే?" అధికార యుక్తంగా అడిగింది. "ఈ పారకురాలి సలహా ఎలావుంది?" సంతోషం నిండిన స్వరంతో ప్రశ్నించింది.

అయినా రేఖ మాట్లాడలేకపోయింది. అవతలనుంచి శ్రీవిద్య రెండు నిమిషాలపాటు పదే పదే అదే ప్రశ్న వేసేసరికి, చివరికెలాగయితే నేం పూడుకుపోయిన స్వరం పెగుల్చుకొని చిన్నగా అంది.

"నీ సలహా బాగుందిగాని సుచితవంటి స్త్రీ వచ్చి నిన్ను ఆశ్రయ మడిగితే ఆదుకోగలవా" అడిగింది.

"తప్పకుండా. మా యింట్లో నా కెదురులేదు. ప్రాణం తియ్యటం సులభం కాని పొయ్యటం కష్టం. నా కొద్దిపాటి సహాయంతో ఒకప్రాణం నిలబడుతుందంటే నా కెంతో సంతోషం. సుచిత నిజంగా మనిషై నన్నాశ్రయిస్తే తప్ప కుండా నాకు చేతనయినంత ఆదుకుంటాను రేఖా. తమాషాకి కాదు నేను నిజంగానే అంటు న్నాను తెలుసా."

నమ్మకంగా, స్థిరంగావున్న మిత్రురాలి మాటలు వింటే రేఖా రాణికి ధైర్యం వచ్చింది. ఆ ధైర్యం విచిత్రంగా క్షణంలో ఆమె పాత నిర్ణయాన్ని పారద్రోలింది. బ్రతుకంటే ఆశ కల్పించింది. వెంటనే ఆమె పట్టుదల సాహసం నిండిన స్వరంతో అంది.

"అయితే కాచుకో విద్యా, సుచిత మనిషిగా మారి మరో అరగంటలో నీ గుమ్మంలో కొచ్చి నీ ఆశ్రయాన్ని కోరబోతోంది. ఆమెని వెంటనే నీ యింటికి తీసుకెళ్ళి ఆమె బ్రతుక్కో దారి చూపిస్తా వనుకుంటాను." అంటూ గబాలున ఫోన్ పెట్టేసి, త్వరగా వెళ్ళి బీరువా మీదున్న ఖాళీ సూట్‌కేస్ అందుకొని, తన బట్టలు సర్దుకుంది.

* * *

ఫోన్ ట్రింగ్ ట్రింగ్‌మని మ్రోగేసరికి రేఖారాణి తన ఆలోచనలనుంచి ఉలికిపడి ఫోన్ అందుకొని "హలో" అంది.

"డేడీ ఈ వాళ కోర్టునుంచి త్వరగా యింటి కొస్తారంటమమ్మీ. నిన్ను కూడా త్వరగా యింటికి రమ్మన్నారు........" అవతలనుంచి కూతురి స్వరం ఉషారుగా వినిపించింది.

"అలాగే" సంతోషంగా అని రిసీవర్ పెట్టేస్తూ, భగవంతుని దయవలన తనకీనాడే కొదవాలేదు. తను అదృష్టవంతురాల ననుకుంది రేఖారాణి.



# ద్వారం

**— కె.కె. మీనన్**

'ప్రజాస్వామ్య' పరిరక్షకుడు 'రాజ్యాంగం' ద్వారం ముందు ఠీవిగా కూర్చొని, అలవోకగా నవ్వు కొంటున్నాడు. అతను అందంగా, ఆరోగ్యంగా, నానాదేశాల ప్రశస్త బలవర్ధక ఔషధాలన్నీ సేవించి తెగబలిసి వున్నాడు.

అతనిముందు ఓ ఆగంతకుడు నిల్చున్నాడు. అతడు అమాయికంగా, అనాగరికంగా, అనారోగ్యంగా వున్నాడు. అతని ముఖంలో దేనికోసమో అంగలారుస్తోన్న దైన్యం ద్యోతకమౌతోంది.

"ఎవరు నువ్వు?" అడిగేడు రాజ్యాంగం.

"మీ కందరూ తెలుసంటారే! నన్నెరగరా?"

"ఊఁ.... తెలుసనుకో, వూరికే అడుగుతున్నాను."

"నన్ను సామాన్యు డంటారు...." చెప్పేడు ఆగంతకుడు.

"అయితే ఇక్కడి కెందుకొచ్చేవు?"

"ఇదేదో భూతల స్వర్గంలా కన్పిస్తోంది. లోపలి కెళ్లవచ్చా?"

"ఓ....!!"

తలుపు నెట్టేడు సామాన్యుడు. కదల్లేదు. బరువుగా దిట్టంగా వుంది.

పకపకా నవ్వేడు రాజ్యాంగం.

"ఎందుకలా నవ్వుతున్నావు?"

"అలా అందరూ తలుపులు నెట్టుకుని వెళ్ళిపోగలిగితే, ఇక్కడ నే నెందుకు?"

"వెళ్లవచ్చు నన్నావుగా!" అమాయికంగా అడిగేడు సామాన్యుడు.

"అందరూ వెళ్ళవచ్చునేది రూలు. అయితే వెళ్ళనివ్వటం, వెళ్ళనివ్వక

పోవటం—అది నా యిష్టం."

"అయితే వెళ్లనివ్వు"

"వెళ్లనిస్తాను...."

"ఎప్పుడు?"

"అదడక్కూడదు .."

పుష్పక విమానంలాంటి పచ్చటి కారొచ్చి ద్వారం ముందు ఆగింది.

హడావుడిగా లేచి వెళ్లి ద్వారం తెరిచేడు రాజ్యాంగం.

జర్రిపోతులా లోపలికి జారిపోయింది కారు.

సామాన్యుడు లోపలికి తొంగి చూసి:

"అక్కడంతా బలంగా, ఆరోగ్యంగా అవుపిస్తున్నారు" అన్నాడు.

"అవును...." అన్నాడు రాజ్యాంగం ద్వారం మూస్తో.

"అంతా నవ్వుతో కళకళలాడుతున్నారు."

"............"

"అంతా తెల్లటి బట్టల్లో మెరిసిపోతున్నారు."

"అవును...."

"మేమంతా ఇలా వున్నాం, మరి వాళ్లలా వున్నారే!"

"ఎలా వున్నారు? అందరూ ఒకలానే వుంటారే! వుండాలే!!"

"నేనూ - వాళ్ళూ ఒకలానే కన్పిస్తున్నామా?"

"నాకు అంతా ఓలానే కన్పిస్తున్నారు."

"ఇంతకీ ఎవరు వాళ్ళు?"

"ప్రజాసేవకులు...."

"ఆ వెళ్ళిందెవరు?...."

"వైద్యులు...."

"ఎందుకు?"

"మందివ్వటానికి. వాళ్ళందరికీ అజీర్తి రోగాలుగా! తిన్నది అరగదు."

పకపకా నవ్వేడు సామాన్యుడు. నవ్వే వోపికలేక అతడు మెలి తిరిగిపోతున్నాడు.

"ఎందుకలా పిచ్చినవ్వు నవ్వుతావు?"

"లేకపోతే, అజీర్తట! తిన్నది అరగదట!!"

"ఏం....అంత విడ్డూరంగా వుందా? నీ కెప్పుడూ అజీర్తి చెయ్యదా?"

"ఉహూ....ఆకలి మంటలేగాని అజీర్తి మాట నేనెరగను."

"అదేవిటి? .." ఆశ్చర్యంగా అడిగేడు రాజ్యాంగం.

"ఏమో! నీకే తెలియాలి."

ఆలోచన్లో పడ్డాడు రాజ్యాంగం.

"అక్కడ వాళ్లంతా వుండగా లేంది నేనూ ఎందుకెళ్ళకూడదు?"

"వాళ్ళందర్నీ నువ్వే పంపించేవు. అది నువ్వు పంపించిన వాళ్లకోసం గాని నీ కోసం కాదు."

"నేను పంపించేనా! నే నసలు వాళ్లని ఎరగనే యెరగను!!"

"నీకు తెలీదులే ...నువ్వే పంపించేవు."

ఇప్పుడు సామాన్యుడు ఆలోచన్లో పడ్డాడు.

"నువ్వేం ఆలోచిస్తున్నావో నాకు తెల్సు" అన్నాడు రాజ్యాంగం.

"....... . ..."

"వీడి చేతిలో కాస్త బరువుపెట్టి వెళ్ళిపోవచ్చునేమో అనుకుంటున్నావు కదూ!"

"అవును. నీ కెలా తెల్సింది?"

"నువ్వు ఏం చేస్తున్నావో, ఏం ఆలోచిస్తున్నావో నాకంతా తెలుస్తుంది" మహా దర్పంగా అన్నాడు రాజ్యాంగం.

"ఇచ్చేదా మరి?"

"ఊఁ..............." చెయి చాపాడు రాజ్యాంగం.

"ఎన్నో రోజులుగా కష్టపడి, ఏమైనా తిందామని దాచిపెట్టుకున్నది" అంటూ చేతిలో పెట్టేడు సామాన్యుడు.

మ హా రా జు లా తలపంకించేడు రాజ్యాంగం.

"వెళ్లనియ్యి మరి ..."



"ఊహూ ...వెళ్లనివ్వను...."

"మరెందుకు పుచ్చుకున్నావు?"

"నువ్వుఇస్తానన్నావు.పుచ్చుకున్నాను. ఒకవేళ పుచ్చుకోలేదనుకో. వీడు పుచ్చుకుంటే పంపించి వుండే వాడేమోనని నీకు అనుమానం పీకుతోవుంటుంది"

"ఇంతకీ, నాకు తెలీకడుగుతాను; నీకు పంపించే అధికారం వుందా?"

వికటాట్టహాసం చేసేడు రాజ్యాంగం.

"నాకు అన్ని అధికారాలూవున్నాయి" అన్నాడు గొంతు సవరించుకుంటో.

"మరెందుకు పంపవు?"

"పంపిస్తాను. కాని ...ఒకవేళ నీ రాక లోపలివాళ్లకి ఇష్టం లేదనుకో. మళ్లీ నా అధికారాలన్నీ తిరగదోడుతారు."

—నీకు అన్ని అధికారాలూ వున్నాయని నీ భ్రమ. కాని ఏమీలేవు. వాళ్లు.. తల్చుకుంటే, నీ ఒంటిమీది గుడ్డలన్నీ ఒలిచేసి....చెత్తకుండీలోకి తోసేగల్రు ...

అదిరిపడ్డాడు రాజ్యాంగం. చుట్టూతిరిగి చూసేడు. ఎవరూ లేరు.

ఏళ్ళూ పూళ్ళూ నిరీక్షించేడు సామాన్యుడు. లోపలి వాళ్ల గురించే విస్మరించేడు. అతని ముందున్న ఆటంకం—

ఆ ద్వారమే........ ఆ ముందున్న ద్వారమే!

ఈ నిరీక్షణ కాలంలో ఎందరో లోపలి వాళ్ళు బైటకీ, బయటివాళ్ళు లోపలికీ, బయటికి వచ్చిన వాళ్లే కొందరు మళ్లీ లోపలికీ వెళ్ళటం చూసేడు సామాన్యుడు.

రాజ్యాంగం బాధ్యతల్లో ఏవేవో మార్పులూ చేర్పులూ వస్తోనే వున్నాయి. కాని, అవి ప్రతిసారీ సామాన్యుణ్ణి మరింత దూరంగా నెట్టేసేటందుకే వస్తున్నట్టనిపిస్తోంది.

సామాన్యుడికి వయసు మళ్లిపోతోంది. చూపుకూడా సన్నగిలుతోంది. అయినా స్వర్గధామాన్ని తల్చుకుని అలాగే, ఆ ద్వారం ముందు పడిగాపులు కాస్తున్నాడు.

ఆకస్మికంగా ఓనాడు గుంపొకటి వచ్చి పడింది. ఏవో కేకలు-నినాదాలు.

"ఎందుకలా అరుస్తున్నారు?" అడిగేడు సామాన్యుడు.

"దాన్నే స్వేచ్ఛ అంటారు."

"అంటే ...?"

"నీ కిష్టమైంది అనచ్చు. ఇష్టమైంది చేయచ్చు" అంటూనే చిన్న గేటులోంచి లోపలికెళ్ళేడు రాజ్యాంగం.

అక్కడి అలజడి అంతా కర్ణపేయంగా వినబడుతోంది సామాన్యుడికి.

వాళ్ల ముందుకెళ్లి అడిగేడు.

"ఎవరు బాబూ మీరు?"

"గుర్తుపట్టలేదా? మేం నీ సంతానం. యువతరం...." ఏక కంఠంతో జవాబిచ్చేరు.

"ఎందుకలా ఎగబడుతున్నారు?"

"లోపలి కెళ్లటానికి. అక్కడ సుఖాలన్నీ కొందరే అనుభవిస్తున్నారు. వాటిని అందరికీ పంచటానికి."

"వెర్రివాళ్లలా వున్నారు .."ఇన్నాళ్ల తన నిరీక్షణని తల్చుకుని కుంటుకుంటో ద్వారంవైపు నడిచేడు.

ఓ పటాలాన్ని వెంటపెట్టుకుని బయటికొస్తున్నాడు రాజ్యాంగం. వాళ్ల చేతుల్లో తుపాకులున్నాయి.

వాళ్ళు ముందుకెళ్లిపోయేరు.

"ఎవరు వాళ్లు?" అడిగేడు సామాన్యుడు.

"రక్షకులు...."

రక్షకులు జనం మీదికి తుపాకులు కాలుస్తున్నారు.

"ఎందుకలా చంపుతున్నారు?"

"వాళ్లు లోపలి వాళ్లని విమర్శిస్తున్నారు."

"ఏమైనా అనవచ్చు నన్నావుగా...."

"అవును. కాని, లోపలి వాళ్లని కాదు."

యువతరానికీ, రక్షకులకీ కొన్నాళ్ల పాటు సంకుల సమరం సాగింది. చివరికి యువతరమే గెల్చింది. వాళ్లంతా రాజ్యాంగం మీద పడి పెడరెక్కలు విరిచి కట్టేరు.

"ఎందుకు నన్నిలా బంధిస్తున్నారు?" వాపోయేడు రాజ్యాంగం.

"అన్నిటికీ నువ్వే కారణం. నువ్వు అధికార పక్షపాతివి" గర్జించింది యువతరం.

"మీకు తెలీదనుకుంటాను. లోపలింకా చాలా ఆటంకాలున్నాయి...."

"నువ్వు పడిపోతే లోపలివన్నీ వాటికవే పడిపోతాయి."

ద్వారం తోసుకుని వెల్లువలా లోపలికి విజృంభించింది యువతరం.

ఈ కథకి పేరు సూచించిన మిత్రుడు
శ్రీ శీలా వీర్రాజుకు
అంకితం

సీరియల్



# పడమట సంధ్యారాగం

## మల్లాది వెంకటకృష్ణమూర్తి

### జరిగిన కథ

సత్యమూర్తి జీవితంలో క్షణక్షణం ఎదురుదెబ్బలు తింటున్నాడు. మొదటి భార్య విచిత్రమైన పరిస్థితుల్లో మాయమైంది. తర్వాత చేపట్టిన రెండో భార్య ప్రియంవద శీలం మంచిది కాదన్న అనుమానంతో కృంగిపోతున్నాడు. బస్సులో పరిచయమయిన ప్రవీణ ఆటో యాక్సిడెంట్‌లో మరణించడంతో మనిషిలో వైరాగ్యపు భావాలు అధికమయాయి సత్యమూర్తిలో. మాణిక్యశాస్త్రిలు ఈ పరిస్థితుల్లో వెలుగు చూపించాడు. ప్రియంవదకి నిజంగా మరొకరితో సంబంధం ఉన్నదా అన్నది రూఢి పరచుకొనేందుకు ప్రయత్నించాడు సత్యమూర్తి. తన అనుమానం నిజమేనని నిర్ధారించుకొన్న సత్యమూర్తి ఆవేశంతో పిచ్చివాడే అయాడు. కొడుకుని తీసుకొని రైల్వేస్టేషన్ కెళ్ళి ట్రెయిన్‌లో సీటుక్రింద పడుకోబెట్టి వచ్చేశాడు. బాబేడండీ అని గోలచేస్తున్న భార్యను విదిలించుకొని బాగ్‌లో బట్టలు సర్దుకొని బయలుదేరాడు.

"ఎవరుకావాలి?" అడిగింది ఓ నలభై ఏళ్ళావిడ.

"సత్యమూర్తిగారు."

వెంటనే ఆవిడ మొహంలో బాధ గోచరించింది.

"లేడు. మీరెవరు?"

లైబ్రేరియన్ జరిగింది చెప్పాడు.

"చేతి గడియారం, వుంగరం తాకట్టు పెట్టి ఆడబ్బుతో నా బంగారుతల్లికి అంత్యక్రియలు ఘనంగా చేసాడుట." చెప్పింది

ఆవిడ కళ్ళలోంచి నీరు కారుతూంటే.

గోడ వార దిగాలుగా కూర్చున్న ప్రియంవద విన్నదా సంగతులన్నీ. ఓ గుటక వేసింది. వెంటనే ఏడవసాగింది నిశ్శబ్దంగా.

"వాడు ఇంటికి రావడం లేదు. లైబ్రరీకి వెళ్ళడంలేదు. ఎక్కడున్నాడో? ఏం చేస్తున్నాడో?"

"రాజీనామా ఇచ్చారు వుద్యోగానికి. సంగతి కనుక్కుందామని నేనే వద్దామనుకున్నాను." చెప్పాడు లైబ్రేరియన్.

"రాజీనామా ఇచ్చాడా?" అన్నదావిడ భృకుటి ముడివేసి.

"మీరు....?" సంశయంగా అడిగాడు.

"వాడి అక్కయ్యని. నా తమ్ముడు వాడు." అని అన్నది పెద్దగా నిట్టూర్చి.

"కూర్చోండి."

"మేం వెళతాం. తర్వాత వస్తాం" అన్నది ప్రవీణ తల్లి.

ప్రియంవద మోకాళ్ళలో తల వంచుకుని ఏడవసాగింది నిశ్శబ్దంగా.

సత్యమూర్తి అక్కయ్యకి ప్రియంవద మీద ఎంతమాత్రం సానుభూతి, దయ, జాలిలేవు. పీకలమీదదాకా కోపంవుంది. సత్యమూర్తి అకస్మాత్తుగా మాయం అవడానికి ప్రియంవదే కారణం అని ఆవిడకి రూఢిగా తెలుసు.

పొరుగువాళ్ళు చెప్పారు ప్రియంవద సత్యమూర్తిమీద పడి బాదుతూ అరిచిన అరుపులు.

"బాబు నీకే పుట్టాడు. బాబు నీకే పుట్టాడు. నువు దుర్మార్గుడివి....హంతకుడివి."

"ఎందుకలా అరిచావ్? అసలేం జరిగిందో చెప్పు."

ప్రియంవద ఇప్పించిన టెలిగ్రాం చూసుకుని వచ్చిన సత్యమూర్తి అక్కయ్య అనేకసార్లు గుచ్చిగుచ్చి అడిగింది ప్రియంవదని.

బుజ్జగిస్తూ అడిగింది. ప్రాధేయపడుతూ అడిగింది. కోపంగా అడిగింది. చివరకి జుట్టు పట్టుకుని రౌద్రంగా అడిగింది.

పెదవి విప్పలేదు ప్రియంవద. ఏడుపుని అణచుకునే ప్రయత్నం చేసింది. బాబు ఏమయ్యాడో చెప్పలేదు.

చాలా భాగం సత్యమూర్తి అక్కయ్యకి అర్థమయింది. ప్రియంవద మౌనం వెనకగల అంతరార్థం గ్రహించగలిగింది. సత్యమూర్తి మనసు తెలుసు కాబట్టి వాడు ఎలాంటి అఘాయిత్యం చేస్తాడో, ఏ వేళ ఏ కబురు వినాల్సి వస్తుందో అని హడలిపోతోంది ఆవిడ.

ప్రియంవద గోడవార కూర్చుని ఏడుస్తోంది. కనీసం బాబు తనదగ్గరే వున్నా బావుండేది అని బాధపడుతోంది. తన భర్త ఇక తిరిగిరాడని నిశ్చయంగా తెలుసు ప్రియంవదకి.

"బాబునేం చేసారు?" అని అడిగినప్పుడు ఎంత నిర్వికారంగా, నిశ్చలంగా చూశారో గుర్తుంది. ఆ చూపు ప్రియంవద గుండెల్లో బలంగా నాటుకుంది.

"ఇక రారు. ఆయన విరాగి అయిపోయారు" అనుకుంది మనసులో కొన్ని వందలసార్లు తిరిగివస్తారనే ఆశ ఏ కోశానాలేదు ప్రియంవదకి.

## 18

రైల్లోకూడా నిద్రపట్టలేదు సత్య

మూర్తికి. వేగంగా వెళ్తున్న ఎక్స్‌ప్రెస్ లోంచి బయటకి చూస్తూండిపోయాడు.

ఓ పంజాబు దంపతులు. ఇద్దరు మార్వాడీ ముసలివాళ్ళు, కాషాయబట్టలు ధరించిన ఓ ముసలాయన, ఇద్దరు విదేశస్థులు, ఆఫీసు కాగితాలు చూసుకుంటున్న ఓ మధ్య వయస్కుడు వున్నారు సత్యమూర్తి పక్కన, ముందు.

భర్త ఒళ్ళో తల పెట్టుకుని నిద్రపోతోంది ఆ అమ్మాయి. సత్యమూర్తికి గుర్తువచ్చింది శ్రీవల్లి, తమ పెళ్ళయిన కొత్తల్లో రైల్లో ప్రయాణంచేసిన సంఘటన. అలాగే శ్రీవల్లి తన ఒళ్ళో తల పెట్టుకుని పడుకుంది చాలాసేపు.

"అవిగో మేకలు" చూపించాడు తను లేపి. అంతా తనవంక చూస్తూంటే సిగ్గుపడి లేపాడు శ్రీవల్లిని.

శ్రీవల్లి కాసేపు కిటికీలోంచి బయటకి చూసి తన తలమీద చిన్నగా మొట్టికాయ వేసి చెప్పింది.

"మొద్దు. అవేమిటో సరిగా చూడు."

"ఏమిటి?" అడిగాడు తను అర్థం కాక.

"మేకలు కావు. గొర్రెలవి. గొర్రెల మంద."

చాలాసేపు నవ్వుతూండిపోయింది.

"భగవాన్! శ్రీవల్లి తాలూకు ఆలోచనలనుంచి నాకు విముక్తి లేదా?" అనుకొన్నాడు సత్యమూర్తి మనసులో బాధగా.

తెల్లగా వున్న ఆ విదేశస్తుడు సాధువుతో ఏదో మాట్లాడుతున్నాడు వుత్సాహంగా.

సత్యమూర్తి బయట ఎత్తయిన కొండలని, వాటిమీద పెరిగిన చెట్లని, పొలాలని, చూస్తూండిపోయాడు.

మార్వాడీ ముసలాయన సత్యమూర్తి భుజంమీద తట్టి కాగితంలో వుంచిన గోధుమరొట్టెని అతని చేతిలోపెట్టాడు తినమన్నట్లుగా.

ఆ విదేశస్థుడు అప్పటికే ఆ రొట్టెని తింటూ అందులో నంచుకోడానికి వేసిన మామిడిమురబ్బా గురించి అడుగుతున్నాడు.

సత్యమూర్తి వద్దన్నట్లుగా తలాడించి ఆ కాగితాన్ని తిరిగి ఇచ్చేసాడు ముసలాయనకి.

ఆ మార్వాడీ ముసలాయనకి అర్థం అయింది సత్యమూర్తి చాలా నిర్లిప్తంగా వున్నాడని. అంతా మాట్లాడుకుంటున్నా ఎవరినీ పలకరించటంలేదు. ఏ విషయంలో వుత్సాహం చూపించటంలేదు.

"కొందరి తీరు అంతే" అనుకున్నాడు.

రైలు భువనగిరి, కాజీపేట, రామగుండం మొదలయిన స్టేషన్లు దాటింది. అకస్మాత్తుగా ఓ పెద్ద బ్రిడ్జి వచ్చింది.

"ఇదేం నది....?" అడిగాడు విదేశస్తుడు.

"గోదావరి ...దక్షిణగంగ" చెప్పాడు పంజాబీ వ్యక్తి.

చీకట్లో నది నీరు స్పష్టంగా కనబడలేదు. సత్యమూర్తి రెండుచేతులు ఎత్తి గోదావరి తల్లికి నమస్కరించాడు.

నాగపూర్ స్టేషన్‌లో సత్యమూర్తి రెండు కమలాఫలాలు కొనుక్కుని తిని మంచినీళ్ళు తాగాడు మర్నాడు వుదయం




ఎనిమిదిన్నరకి. నాగపూర్ దాటాక పెద్ద పెద్ద పర్వతాలని చొచ్చుకొని సొరంగాల లోంచి, పర్వతాలమీదనుంచి పోసాగింది రైలు. సత్యమూర్తి సీటుకి ఆనుకుని నిద్రపోయాడు రైలు వింధ్య పర్వతాల లోంచి ప్రయాణం చేస్తూంటే. మధ్యాహ్నం మూడున్నర గంటలకి రైలు ఇటార్సీలో ఆగింది. సత్యమూర్తి తన బ్రీఫ్‌కేస్, చేతి సంచీతో కిందకి దిగాడు. నాంపల్లి స్టేషన్ ప్రాంతంలో కొన్నాడా చేతి సంచీని ప్రవీణ అస్తికలున్న ముంత కోసం.

స్టేషన్‌లోవున్న పంపునీళ్ళమొహంతో కడుక్కుని వేడిపాలు మాత్రం తాగాడు. ఆకలివేయలేదు. రైల్వే ఎంక్వయిరీలో ఇటార్సీమీదుగా కాశీ వెళ్ళే ఎక్స్‌ప్రెస్ బండి ఎప్పుడు వస్తుందో అడిగాడు.

రాత్రి ఎనిది నలభై కి వస్తుంది.

ప్లాట్‌ఫారంమీద వున్న ఓ సిమెంట్ బెంచిమీద కూర్చుని బ్రీఫ్‌కేస్ తెరిచాడు. దాంట్లోంచి ఓ పుస్తకంతీసి అది చదవ డంలో లీనమయిపోయాడు.

రైలుబండి వచ్చేదాకా కదల్లేదు. మధ్యలో ఓసారి టికెట్ ఇన్‌స్పెక్టర్‌వచ్చి సత్యమూర్తి దగ్గర టికెట్ తణిఖీచేసి వెళ్ళాడు.

బాంబేనుంచి వారణాశికి వెళ్ళే ఎక్స్‌ప్రెస్ బండి వచ్చింది రాత్రి తొమ్మిదింపావుకి. ఓ సెకండ్ క్లాస్ కంపార్ట్‌మెంట్‌లో ఎక్కాడు సత్యమూర్తి. కూర్చునేందుకు చోటు దొరకలేదు. గుమ్మందగ్గరే నిలబడ్డాడు. అర్ధరాత్రి ఓ స్టేషన్‌లో సీట్ దొరికింది.

జబల్‌పూర్, కట్నీ, సత్నా, మణిపూర్, నైని,—ఒకో స్టేషన్ దాటుతోంది రైలు.

ఓ స్టేషన్‌లో ఆగింది వుదయం ఎనిమిదిముప్పావుకి.

'అలాహాబాద్' అన్న బోర్డ్ కనిపించింది సత్యమూర్తికి.

త్రివేణీ సంగమంలో స్నానం చేయా

లంటే అక్కడే దిగాలని తెలుసు సత్యమూర్తికి. కాని కాశీ చూడాలన్న మనోవాంఛ చాలా బలంగా మనసులో వుండటం వల్ల అలహాబాద్‌లో దిగాలనే కోరికని వాయిదావేసుకున్నాడు సత్యమూర్తి. చాలా పెద్ద స్టేషన్ అది. దిగి కాసేపు విశాలమయిన ఆ ప్లాట్‌ఫారంలో నడిచాడు. తిరిగి తన కంపార్ట్‌మెంట్‌లోకి వెళ్ళేసరికి ఎవరో కూర్చుని వున్నారు సత్యమూర్తి సీట్‌లో.

అతను సత్యమూర్తిని చూసి లేవబోయాడు కాని సత్యమూర్తి చిరునవ్వుతో వారించాడు ఫర్వాలేదన్నట్లుగా చేత్తో సౌంజ్ఞ చేసి.

రైలు అలహాబాద్ దాటుతుండగా చూసాడు. దూరంగా నదిపాయ ఒకటి కనిపించింది వుదయం తొమ్మిది ముప్ఫయి అయిదుకి.

రెండుచేతులూ ఎత్తి దణ్ణంపెట్టి కళ్ళు మూసుకుని మనసులో శ్లోకం చదువుకున్నాడు.

తర్వాత రైలు గంగానదిని దాటడానికి కట్టిన బ్రిడ్జిమీదనుంచి వెళ్ళింది.

సత్యమూర్తి పారుతున్న ఆ నీళ్ళవంక చూసాడు రైలు దూరమయి ఇక కనబడనంతవరకూ.

ఎందుకీ నది అంటే హిందువులకు ఇంత భక్తి, ప్రీతి? శివుని నెత్తిమీద నుంచి పారుతుంది కాబట్టా? అది నిజమని ఈ కాలంలో నమ్మేవాళ్ళెందరు? ఎందుకిలా గంగానది కొన్ని లక్షలమందిని ఆకర్షిస్తోంది?

సత్యమూర్తి ఆధ్యాత్మకమయిన ఆలోచనలలో పడిపోయాడు రైలు విశాలమయిన, సారవంతమయిన గంగామైదానం దాటి బెనారస్ స్టేషన్ చేరుకునేదాకా.

మధ్యాహ్నం ఒకటిన్నర అయింది.

రైలుపెట్టెలోంచి కిందకి దిగకుండా పూర్తిగా ఖాళీ అయిన ఆ రైల్లోనే కూర్చున్నాడు. చాలాసేపటికి ప్లాట్‌ఫాం మీదకి దిగాడు. ప్లాట్‌ఫాంలోంచి బయటికి వచ్చాడు. కాశీలో రెండు రైల్వే స్టేషన్ లున్నాయి. బెనారస్ సిటీస్టేషన్‌లో దిగాడు సత్యమూర్తి.

పవిత్ర గంగానదికి ఎడమ తీరాన వున్న కాశీనగరంలోకి, కొన్ని వందల సంవత్సరాలుగా హిందూ మతానికి ఆయువుపట్టుగా, ఎంతో పవిత్రమయిన ప్రదేశంగా విలసిస్తున్న కాశీనగరంలోకి అడుగు పెట్టాడు జీవితంలోని ఒడిదుడుకులకి అలసిపోయిన సత్యమూర్తి.

తనలాగే ఇదివరలో కూడా కొన్ని వేలమంది విసిగి వేసారి జీవితానికి అర్థం పరమార్థం తెలుసుకోడానికి అక్కడికి సన్యాసులు, యోగులు, భక్తులు, బైరాగులు, స్వాములు, సాధువులు ప్రవక్తలు అనేకమంది వచ్చివుంటారనిపించింది సత్యమూర్తికి.

కాశీనగరానికి తను కొత్త. కాని కాశీనగరానికి తనలాంటివాడు ఎంతమాత్రం కొత్తకాదు. తాపీగా నడవసాగాడు సత్యమూర్తి. మధ్య మధ్యలో ఆగి గంగానదికి దారి అడగసాగాడు. వారు చూపిన దారి వెంట నడవసాగాడు.

కాశీనగరం గురించి సత్యమూర్తి అనేక పుస్తకాల్లో చదివాడు. కేవలం హిందూమతానికే అది కూడలి కాదు. కొన్ని శతాబ్దాల క్రితం బౌద్ధమతం కూడా

అక్కడ విలసిల్లింది. బుద్ధుడు కాశీకి ఎనిమిది కిలోమీటర్ల దూరంలో వున్న ఓ ప్రదేశంలో చాలా కాలం నివసించి బౌద్ధ మత ప్రచారానికి సేవ చేసాడు. బుద్ధుడు మొదటిసారి తన మత సూక్తులని బోధించిన పవిత్రప్రదేశం సారనాథ్. అనేకమంది ముస్లిములున్న పట్టణం కాశీ!

కాశీవిశ్వేశ్వరుడి గుడి కాక దాదాపు పదిహేనువందల గుళ్ళు, ఆలయాలు వున్నాయి కాశీలో. బుద్ధుడే కాదు, దక్షిణ భారత దేశం నుంచి శంకరాచార్యులు వచ్చారు. గురునానక్ వచ్చారు. తులసీ దాస్, కబీర్‌దాస్ వచ్చారు. రామకృష్ణ పరమహంస, వివేకానంద స్వామి వచ్చారు. వేదాధ్యయనం చేసే కొన్ని వేలమంది బ్రాహ్మణులు వచ్చారు. వీళ్ళే కాదు పాపాలుచేసి వాటిని గంగాజలంలో ప్రక్షాళనం చేసుకోవాలని వృద్ధాప్యంలో అనేకమంది వచ్చారు. అనేకమంది తమ భౌతిక కాయం అక్కడే వదిలితే ముక్తి లభిస్తుందనే విశ్వాసంతో మృత్యువు కోసం ఎదురు చూస్తూ తిరిగివెళ్ళలేదు. అక్కడే మరణించారు.

మతం.

అదో నమ్మకం. అదో మత్తుమందు. అదో మానసికానందం వాళ్ళకి.

ఘజనీ మహమ్మద్ వచ్చాడు. గెలుచుకున్నాడు. దేవాలయాలని, హిందూమత పాలకులని నాశనం చేసాడు. తర్వాత కుతుబుద్దీన్ తేరుకున్న కాశీని మరోసారి కబళించాడు. తర్వాత ఔరంగజేబు దండయాత్ర చేసి కాశీని సొంతం చేసుకున్నాడు. కొద్ది సంవత్సరాలు మినహాయిస్తే ఆ తర్వాత కాశీ మొగలుల ఆధీనంలోనే వుంది కొన్ని తరాలపాటు.

దాదాపు అయిదారు కిలోమీటర్లు నడిచాడు సత్యమూర్తి. పెరిగిన గడ్డం, సంస్కారం లేని జుట్టు, నీలం రంగు కాటన్ పేంటు, పేంటులోపలికి వేసుకున్న మాసిన తెల్లటి పొడుగు చేతుల షర్టు, కాళ్ళకి అరిగిపోయిన చెప్పులు, సాధారణంగా కొత్తగా కాశీకి వచ్చేవారు ఆసక్తిగా వుత్సాహంగా చూసే చూపులు కాక, ఎటో చూస్తున్న కళ్ళు, మొహంలో తృప్తి, అసంతృప్తిల మధ్య వుండే బలహీనమయిన గీత తాలూకు ఛాయలు.

సత్యమూర్తి ఎవరి వంకా చూడక పోయినా అతనివంక అనేకమంది చూస్తున్నారు. కొందరు వెనక్కి తిరిగి మరోసారి చూసి మరీ వెళ్తున్నారు.

గంగానది ఒడ్డుకి చేర్చే సందులోకి ప్రవేశించాడు సత్యమూర్తి. ఇద్దరు ముగ్గురు పండాలు (ఆలయ పూజారులు) సత్యమూర్తి పక్కనే నడుస్తూ పదే పదే హిందీలో చెప్పసాగారు తమ వెంట రమ్మని, గంగానదిలో స్నానం చేయించి కాశీవిశ్వనాథ్ ఆలయానికి తీసుకు వెళ్తామని.

సత్యమూర్తి వద్దన్నట్లుగా తల అడ్డంగా వూపాడు. సత్యమూర్తి అవతారం చూసి అతని దగ్గర దక్షిణ అట్టే దొరకదనే వుద్దేశ్యంతో ఇద్దరు పండాలు తప్పుకుని, రిక్షా దిగుతున్న ఇద్దరు కొత్త వాళ్ళ దగ్గరకు వెళ్ళారు. మరోపండా కొద్దిసేపు సత్యమూర్తిని అనుసరించి, సత్యమూర్తి మౌనానికి విసుగెత్తి, కోపంగా తిట్టి ఆగిపోయాడు.

సత్యమూర్తి కళ్ళు ఆ రోడ్డుప్రక్కన

వున్న ఆలయంమీదకాని, దాని ముందున్న చెట్టుమీదగాని, జన సముదాయంమీదకాని, ప్రక్కనే వున్న చెట్లమీదకాని లేవు.

ఎదురుగా కనబడుతున్న గంగానది మీద వుంది దృష్టి. వేగం పెంచాడు. చెప్పులు నేలమీద విడిచి, ఒడ్డున, పై గట్టుమీద నిలబడి పరికించి చూసాడు రెప్ప వాల్చకుండా ఆ నది నీళ్ళవంక.

తెల్లగా,స్వచ్ఛంగా, ఎంతో పవిత్రంగా వున్నాయి నీళ్ళు వెండిలా మెరుస్తూ. అనేక నదులు చూసాడు సత్యమూర్తి. కాని ఏ నదిలోని నీరు కూడా వెంటనే అంత పవిత్ర భావాన్ని కలిగించలేదు సత్యమూర్తికి. అప్రయత్నంగా రెండు చేతులూ ఎత్తి దణ్ణంపెట్టాడు. చాలాసేపు నదివంకే చూస్తూండిపోయాడు.

అవతలి వడ్డు కనబడుతున్నా. విశాలంగా వుంది నది. నీరు పారుతోంది. కుడివైపు కొన్నిమైళ్ళ దూరంలో గంగానది మలుపు తిరుగుతోంది కొడవలి ఆకారంలో. కొన్ని వందల మైళ్ళ దూరం నుంచి ప్రవహిస్తున్న ఆ నది కుడివైపుకి మలుపు తిరిగి కాశీపట్టణం ప్రక్కనుంచి సాగిపోతోంది తన గమ్యమయిన బంగాళా ఖాతానికి. నది అలా మలుపు తిరగటంలోనే ఎంతో అందం కనిపించింది సత్యమూర్తికి. ఆ నది ఎంతో ఆహ్లాదంగా గోచరించింది. నదిమీద కొద్ది దూరంలో కనిపించింది ఎర్రటి రైలుబ్రిడ్జి. ఎడంవైపు చప్పుడుచేస్తూ ఆ బ్రిడ్జిమీద వస్తోంది ఓ రైలు.

సత్యంమూర్తి దాదాపు ఇరవై నిముషాలు ఆ పరిసరాలనీ, నదినీ చూస్తూండిపోయాడు. ఈ నదిఒడ్డునే పూర్వం సంస్కృత పాఠాలు, వేదాలు, ఉపనిషత్తులు మొదలయినవి వల్లె వేసేవారు పండితులు. శిష్యులు వారికి శుశ్రూష చేసి వాటిని నేర్చుకునేవారు. అలా కొన్ని శతాబ్దాలపాటు గంగమ్మ తల్లి హిందూమత గ్రంథాలు వింటూనే వుంది.

ఈ నదిలోనే ఆత్మలు విసర్జించిన కొన్ని లక్షల భౌతిక కాయాలని కలిపారు. ఈ నది ఒడ్డునే కొన్ని వేలమంది హిందువులని నిర్జించారు మహమ్మదీయులు తమ సామ్రాజ్య స్థాపన జరిగాక. ఈ నదిలో స్నానంచేసి అర్ఘ్యం వదలడానికి కొన్ని వేలమైళ్ళ దూరంనుంచి వస్తున్నారు యాత్రికులు, భక్తులు. ఈ నదీజలాన్ని తమ వెంట తీసుకు వెళ్తున్నారు. భారతదేశంలోని అనేక ప్రదేశాలలోని ఇళ్ళలోని దేవుడి గదులలో భద్రంగా, పవిత్రంగా వుంచబడుతోంది గంగాజలం

ఎన్నో శతాబ్దాల నుంచి తన చుట్టూ ఎంత కోలాహలంవున్నా గంగానది మాత్రం నిశ్చలంగా, నిర్మలంగా, ఎవరితో తనకేం సంబంధం లేనట్లుగా సాగిపోతోంది గంభీరంగా.

సత్యమూర్తికి లౌడ్‌స్పీకర్‌లో వినబడుతున్నాయి ఘాట్‌కి ఓ ప్రక్కవున్న, కేదారేశ్వర్ గుడిలో మైక్‌ముందు జరిగే భజనలు.

జయరాం. జయరాం. జయజయరాం.

జయరాం. జయరాం. జయజయరాం.

గంగానది ఒడ్డునవున్న చివరి మెట్లమీద పాతిపెట్టబడ్డ నాలుగు గుంజలమీద కట్టిన మంచెలమీద కూర్చునివున్నారు పూజారులు. స్నానం చేయడానికి వచ్చిన



భక్తుల నుంచి దక్షిణ తీసుకుని మంత్రాలు పఠిస్తున్నారు. వాళ్ళ బట్టలకి రక్షణ యివ్వడమే కాకుండా, అద్దం, దువ్వెన లాంటి వస్తువులు కూడా ఇస్తున్నారు ఆశీర్వచనాలతో పాటుగా.

ఆడ, మగ, పిల్లలు, పెద్దలు, అన్ని వయసుల వాళ్ళు, అన్ని జాతులవాళ్ళు, ప్రాంతాలవారు, 'శంభోశంకర', 'జై కాశీ విశ్వనాథా', 'నమో కాశీ విశ్వేశ్వరా నమోనమో' 'జై గంగాభవానీ' లాటి పదాలు వుచ్ఛరిస్తూ గంగలో మునిగిలేస్తున్నారు.

ఆడవాళ్ళు ఒడ్డుకి వచ్చి తడిబట్టల లోంచి పొడిబట్టలలోకి మారుతూంటే కొందరు మొగాళ్ళు దొంగతనంగా, మరి కొందరు నిర్భయంగా చూస్తున్నారు వాళ్ళ వంటిని, ఒంట్లోని అనేక భాగాలని.

'ఈ నదిలో పవిత్రత వుంటే అసలు ఇలాంటి ఆలోచనలే మనుషులకి ఈ నది ఒడ్డునే ఎలా వస్తాయి?' అనుకుంటు న్నారు కొందరు.

నది చాలా లోతుగా వుండడంవల్ల మెట్లు అంతమయిన చోటునుంచి నాలు గయిదు గజాల దూరంలో మెట్లువున్నంత మేరకు మనుషులు అది దాటి అవతలకి పోవడానికి వీలులేకుండా అడ్డుకట్టారు. అనేక కిలోమీటర్లమేర, నది ఒడ్డున అక్కడక్కడా అలాంటి మెట్లు, కట్టిన అడ్లు కనబడుతున్నాయి. నదికి ఆనుకుని సన్నటి రోడ్డు. అ రోడ్డుకి అవతలివైపు గోపురాలు, పాతకట్టడాలు, ఇళ్ళు. కొన్ని వందల కిటికీలు కనబడుతున్నాయి. కొన్ని వేలమంది వున్నారు నదిఒడ్డున. ఆ రోడ్డు మీద రద్దీగావుంది.

కొంతమంది పడవల వాళ్ళు, ఇవతలి వైపుకన్నా నీరు అవతలివైపు పరిశుద్ధంగా వుంటుందని, యాత్రికులని పడవలలో దూరంగా కనబడుతున్న అవతలి ఒడ్డుకి వచ్చి స్నానం చేయవలసిందిగా కోరు తున్నారు. వాళ్ళ వ్యాపారం బాగా సాగి పోతోంది.

అంతా కోలాహలంగా వుంది. రాతి మెట్లమీద మనుషులు. మంత్రాలు చదువుతున్న మనుషులు. ప్రార్థనలు

చేస్తున్న మనుషులు. అడుక్కునే మనుషులు. క్షవరం చేయించుకునే మనుషులు. క్షవరం చేయించుకోమని ప్రతిమాలే మనుషులు. బట్టలు మార్చుకునే మనుషులు. ఒళ్ళు తుడుచుకునే మనుషులు. భక్తి పాటలని పారవశ్యంతో పాడే మనుషులు. వాటిని వినే మనుషులు. మరణించిన మనుషులు, వారి శరీరాలని కాల్చే మనుషులు. డబ్బులిచ్చే మనుషులు, వాటికోసం ఆత్రంగా ఎదురు చూసే మనుషులు. రోడ్డుకి అవతలి వైపు వున్న ఇళ్ళ కిటికీలలోంచి నది ఒడ్డున వున్న మనుషులని చూసే మనుషులు.

ఆరు కిలోమీటర్ల పొడవునా అంతా కోలాహలంగా వుంది గంగానదికి ఎడమ వైపు ఒడ్డున వున్న కాశీపట్టణంలోని ఆ ప్రాంతంలో.

సత్యమూర్తి గంగానదినీ, పరిసరాలని దాదాపు నలభై నిముషాలసేపు అలాగే చూస్తూండిపోయాడు ఒక్కడుగు కూడా కదలకుండా. చాలామంది సత్యమూర్తి ఉనికిని గుర్తించి పదే పదే అతని వంక చూడసాగారు. అతని విగ్రహం ఆకర్షిస్తోంది చాలామందిని.

సత్యమూర్తి మెట్లవైపు కదిలాడు. వంగి మొదటి మెట్టుమీద చేతులుంచి ఆ చేతులని కళ్ళకి అద్దుకున్నాడు. తర్వాత మూడో మెట్టుమీదకి దిగి చేతిలోని బ్రీఫ్ కేస్‌ని, చంకలోని సంచీ మెట్టుమీద పెట్టాడు. చొక్కా, బనీను, పేంట్ విప్పి బ్రీఫ్‌కేస్‌మీద పడేసాడు.

ముందుకి వంగి గంగానదిలో కుడి చేతినుంచి నీళ్లు నెత్తిమీద చల్లుకున్నాడు. తర్వాత నెమ్మదిగా గంగానదిలోకి దిగాడు.

"వెళ్ళి గంగలో దూకండి."

ప్రియంవద ప్రక్కనే వుండి చెప్పినంత స్పష్టంగా సత్యమూర్తి చెవుల్లో గింగురుమన్నాయి అనేకసార్లు కోపంతో ప్రియంవద అన్న మాటలు.

నడుం దాకా నీళ్ళు వచ్చేలా దిగి సత్యమూర్తి గంగానదికి నమస్కరిస్తూ చదివాడు బిగ్గరగా:

'సముద్ర పత్నీ జలసన్నిపాతే
పూతాత్మ నామత్ర జలాభిషేకాత్
తత్త్వావబోధేన వినాపిభూయః
తనంత్యజాం నాస్తి శరీరబంధః'

ఎంతో శ్రమపడి ఆత్మ తత్వాన్ని తెలుసుకున్నవారికే కాదు మోక్షం లభించేది. గంగానదిలో స్నానం చేసిన సాధారణ మానవుడికి కూడా మోక్షం లభిస్తుంది

సత్యమూర్తి మళ్ళీ నీరు నెత్తిన చల్లుకుని ముక్కు మూసుకుని నదిలో మునిగాడు.

పాపాలన్నిటినీ ప్రక్షాళనం చేస్తుంది ఈ నదిలో స్నానం.

తను పాపియా?

అవును.

శ్రీవల్లి తన నుంచి దూరం అపడానికి కారణం తన అశ్రద్ధ, పొరపాటు. ఎన్ని కష్టాలకి గురి అయిందో? అసలు ప్రాణాలే పోయాయేమో? అది తను చేసిన పాపం తెలియక చేసినా.

పైకిలేచి గాలి పీల్చుకున్నాడు సత్యమూర్తి. మళ్ళీ ముక్కు మూసుకుని మునిగాడు నీళ్ళలో రెండోసారి.

వివాహం అయిన కొత్తల్లో తన

ప్రవర్తనవల్ల ప్రియంవదకి ఎంతో ఇబ్బంది, విసుగు, కోపం కలిగేవి. బహుశ ఆ ప్రభావంవల్లే ప్రియంవద తన ప్రియుడిని వెదుక్కొని వుంటుంది. తన రెండో భార్యతో అంటీ అంటనట్లుగా కాకుండా, అందరు మొగాళ్ళలా తనూ మామూలుగానే వుంటే అసలు ప్రియంవద ఆ పాపం చేసేదికాదేమో? ప్రియంవదకి అలాంటి ఆస్కారం ఇచ్చి తనే పాపం మూటకట్టుకున్నాడా?

మళ్ళీలేచి వూపిరి పీల్చుకుని మూడో సారి మునిగాడు. సత్యమూర్తి మనో నేత్రం ముందు డుంబుగాడు కదిలాడు. తను వాడి విషయంలో రాక్షసుడిలా ప్రవర్తించాడు. వాడికే చిన్న ఆపద వాటిల్లినా ఆ పాపం తను అనుభవించాలి. ప్రియంవదకి మనసులో డుంబుగాడు దూరం అవటంవల్ల కలిగే బెంగ, బాధలకి సరిసమానమయిన పాపం అనుభవించాలి తను.

మళ్ళీ లేచాడు.

తర్వాత ఓపికున్నంతసేపు సత్య మూర్తి గంగానదిలో మునుగుతూనే వున్నాడు. దాదాపు అరగంట తర్వాత బయటికి వచ్చాడు. చిన్నచిన్న చేపలు నీళ్ళనిండా. తువ్వాలతో ఒళ్ళు తుడుచు కున్నాడు. బ్రీఫ్‌కేస్‌లోంచి వేరే పేంట్, షర్ట్ తీసుకుని తొడుక్కున్నాడు. చేత్తో తడి జుట్టుని వెనక్కి తోసుకుని మెట్లెక్కాడు.

"దీని పేరు దశాశ్వమేధ్‌ఘాట్. ఇలాంటి ఘాట్‌లు ఇరవైపైనే వున్నాయి ఇక్కడ. అస్సీఘాట్ అన్నిటికన్నా పవిత్రమైంది. పంచతీర్థాలలో అది మొద టిది. అస్సీ అనే నది గంగానదిలో కలుస్తుంది. అక్కడికి కొద్ది దూరంలోని హిందూ యూనివర్శిటీ ప్రాంతంలో యింకా తులసీఘాట్, హనుమాన్‌ఘాట్, సిదార్‌ఘాట్ అహల్యాబాయ్‌ఘాట్, సింధియాఘాట్, లాల్‌ఘాట్, రాజ్ ఘాట్, హరిశ్చంద్రఘాట్ ఇలా అనేక ఘాట్‌లున్నాయి. హరిశ్చంద్రఘాట్ వేద కాలంకన్నా పురాతనమయింది. అది స్మశానవాటిక. అయోధ్యని పాలించిన హరిశ్చంద్రుడు తన భార్యని, కొడుకుని, ఆఖరికి తననే అమ్ముకున్న తర్వాత ఓ చండాలుడి దగ్గర పని చేసిన ప్రదేశాన్నే హరిశ్చంద్రఘాట్ అంటారు. అక్కడే కర్మకాండలు అవీ చేస్తారు. ."

ఓ గైడ్ హిందీలో చెప్తున్నాడు పెద్దగా ఓ ఇరవై మంది యువకులకి.

సత్యమూర్తి ఆ గైడ్‌ని అడిగాడు, హరిశ్చంద్రఘాట్‌కి దారి ఎటో. తర్వాత అటువైపు నడిచాడు సంచీ, బ్రీఫ్ కేస్‌లతో.

హరిశ్చంద్రఘాట్‌లో ఓ అరవై ఏళ్ళ ముసలాయన పలకరించాడు సత్య మూర్తిని హిందీలో. ఆయన కర్మలు చేసే బ్రాహ్మడని తెలిసిపోతోంది. పట్టు పంచె, ఉత్తరీయం, భుజాన ఆరు పోగుల జంధ్యం. పెరిగిన గడ్డం, ముడికట్టిన పిలక, నుదుట సింధూరం మీద ఎర్రటి బొట్టు.

దూరంగా సగం కాలిన శవం మీద పడింది సత్యమూర్తి దృష్టి. ప్రవాహంలో కొట్టుకుపోతోంది అది.

సత్యమూర్తి సంచీ తీసి ఆయనకి ఇచ్చాడు. ఆయన సంచీలోంచి నల్లటి ముంత బయటికి తీసాడు. ముంతమీద

చాక్‌పీస్‌తో రాసి వుంది ఓ నంబరు. దానికి కట్టివున్న తాడు విప్పి, గోనెపట్టా ముక్కని తీసి గంగలోకి విసిరేసాడు. లోపల నుంచి కాలి, నల్లటి మసి అంటిన ఓ అస్థికని తీసి లోపలకి చూసి మళ్ళీ దాన్ని లోపల వుంచాడు.

తర్వాత గట్టిగా సంస్కృతంలో మంత్రాలు చదువసాగాడు మధ్యలో పేరు, గోత్రంలాంటివి అడుగుతూ. పేరు తప్ప మరేం చెప్పలేకపోయాడు సత్యమూర్తి.

పది నిముషాలలో-సత్యమూర్తికి ఏం కాని, ఈ లోకంలోనే లేని ప్రవీణ అస్థికలు, మంత్రాల మధ్య పవిత్ర గంగానదీ ప్రవాహంలో కలిసిపోయాయి.

చెయ్యి చాపాడు ఆ బ్రాహ్మడు.

సత్యమూర్తి హిందీలో చెప్పాడు.

"ఇంకొకరికి తర్పణం వదలాలి. నా భార్య. పేరు శ్రీవల్లి హరితస గోత్రం."

మరో పది నిముషాలు పట్టింది.

సత్యమూర్తి గొణిగాడు నెమ్మదిగా.

"వల్లీ, క్షమించు. ఇంతకంటె నేనేం చేయలేను నీకు."

తర్వాత రెండు అయిదు రూపాయల నోట్లు తీసి ఆ బ్రాహ్మడు చాపిన చేతిలో వుంచాడు.

సత్యమూర్తి దశాశ్వమేధఘాట్ సమీపంలో వున్న కేదారేశ్వర్ ఆలయానికి వెళ్ళి దణ్ణం పెట్టుకుని తర్వాత ఇళ్ళ మధ్యగల అతి సన్నటి బాటవెంట విశ్వేశ్వరస్వామి ఆలయం చేరుకున్నాడు.

విశ్వేశ్వరస్వామి ఆలయంలో ప్రత్యేకంగా పూజారి అంటూ ఎవరూ లేరు. భక్తులు తెచ్చుకోవాలి పూజారిని బయట నుంచి. సత్యమూర్తి ప్రణామం చేసాడు లింగానికి.

1669 కి మునుపు కాశీవిశ్వేశ్వరస్వామి ఆలయం వున్న భాగం, ఔరంగజేబు ఆ ఆలయాన్ని పగలకొట్టి అక్కడ నిర్మించిన మసీదు, తిరిగి శివలింగం వుద్భవించిన మసీదు వెనక బావి మొదలయిన ప్రదేశాలన్నీ చూసాడు. తను హైద్రాబాద్‌లోని లైబ్రరీలో చదివిన ఓ పుస్తకంలోని అనేక అంశాలు గుర్తుకు వచ్చాయి.

"ముస్లిం రాజులు ధ్వంసం చేసిన తర్వాత అక్బర్ ఆర్థికమంత్రి తోడర్‌మల్ తిరిగి కట్టించాడు విశ్వనాథ ఆలయాన్ని. తర్వాత దాన్ని ఔరంగజేబు పడగొట్టించి మసీదు కట్టించాడు. దాదాపు వంద సంవత్సరాలు జరిగాక 1785 లో మహారాణీ అహల్యాబాయ్ హోల్‌కర్ ఈ ఆలయాన్ని కట్టించింది. పంజాబ్‌కి చెందిన రంజిత్‌సింగ్ మహారాజు ఇరవై రెండున్నర మణుగుల బరువుగల, అంటే షుమారు వంద కిలోల బరువు గల బంగారంతో చేసిన రేకుని ఈ గోపురం మీద కప్పించాడు. అందుకనే దీనికి గోల్డెన్ టెంపుల్ అనే పేరు కూడా వచ్చింది. బూడిద రాసుకుని తిరిగే ఈశ్వరుడికి బంగారం! ఈ ఆలయంలోని గంట నేపాల్ మహారాజు పంపించారు.... ఈ బావిని జ్ఞాన్‌వపి వెల్ అంటారు. విశ్వేశ్వరస్వామి లింగం ఈ బావిలోంచే ఉద్భవించింది. ఔరంగజేబు దాన్ని నాశనం చేయించినా. ఈ బావి నీటిని తాగితే ఆత్మజ్ఞానం అర్థమవుతుందని ప్రతీతి ..." మనసులో జ్ఞాపకాలు తిరుగాడాయి.

ప్రక్కనే వున్న కాశీ అన్నపూర్ణ మందిరానికి మరోమూల వున్న రామ మందిరానికి వెళ్లాడు సత్యమూర్తి.

చీకటి పడుతుండగా దగ్గరలోనే వున్న ఓ సత్రం చేరుకున్నాడు. నకనకలాడు తోంది కడుపు, అన్నం తిని రెండు రోజులపైనే అవడంవల్ల. అయినా అన్నం తినకుండా వేడిపాలు తాగి పడు కున్నాడు. రాత్రి చాలాసేపు నిద్ర పట్ట లేదు. నిద్ర పడుతూండగా ఎవరో తల కింద బ్రీఫ్‌కేస్ తీసుకోవడంతో నిద్ర తేలిపోయి లేచి.కూర్చున్నాడు.

సత్యమూర్తి లేవడంతో కాషాయ బట్టల్లో వున్న ఓ సన్యాసి బయటకి పరి గెత్తాడు భయంగా వాటిని వదిలేసి.

సత్యమూర్తి మళ్ళీ నిద్రకి ఉపక్ర మించాడు.

*　　　*　　　*

సత్యమూర్తి పదకొండు రోజులు అదే సత్రంలో పడుక్కుంటూ, రెండు పూటలా పాలు మాత్రం తాగుతూ, చీక టితో లేచి గంగానది వడ్డుకివెళ్ళి స్నానం చేసి, ఉదయిస్తున్న సూర్యుడికి సంధ్యా వందనం చేసి, ఆ తడి బట్టలతోనే ఆల యానికి వెళ్ళి కాళ్ళు నొప్పులు పుట్టేదాకా తిరిగి సత్రం చేరుకుంటున్నాడు.

రోజూ ఒకటొకటే తన వస్తువులు అమ్మేయసాగాడు. ఓ రోజు తనతో తెచ్చుకున్న రెండు జతల బట్టలని ఓ బిచ్చగాడి చేతిలో పెట్టి పది రూపాయలు కావాలన్నట్లుగా పది వేళ్ళు చూపించాడు. వాడు ఎనిమిది రూపాయలు ఇచ్చాడు సత్యమూర్తికి.

మరో రోజు మిగతా సామానుని పది హేను రూపాయలకి అమ్మేసాడు. ఇంకో రోజు బ్రీఫ్‌కేస్‌ని పాతిక రూపాయలకి అమ్మేసాడు.

ఒంటి మీద బట్టలు తప్ప నేను, నాది అనేదే లేకుండాపోయింది సత్యమూర్తికి. మనసులో దిగులు, గుండెల్లో గుబులు, జ్ఞాపకాల్లో మంత్రాలు,శ్లోకాలు, అంతులేని జ్ఞానం.

సత్యమూర్తి తోటి మనుషుల వంక సరిగ్గా కన్నెత్తి కూడా చూడటం లేదు. ఎక్కువ భాగం గంగానది ఒడ్డున గడిపే స్తున్నాడు. లేదా సర్వేశ్వరుడి ఆలయంలో కూర్చుంటున్నాడు కళ్ళు మూసుకుని. గడ్డం బాగా పెరిగింది.

కొద్దికొద్దిగా సత్యమూర్తిలో డుంఖు గాడిని అన్యాయం చేసానన్న బాధ తగ్గి మనసు తేలిక పడుతోంది. సన్యాసులు. విరాగులు ఎక్కడయినా కూర్చుని మాట్లాడుకుంటూంటే మాత్రం ఆసక్తిగా వింటాడు. వాళ్ల ప్రాపంచిక విషయాల గూర్చి మాట్లాడుకుంటే వెళ్ళిపోతాడు. అధ్యాత్మికచింతన గురించి మాట్లాడు తుంటే ఆసక్తిగా వింటాడు.

హైద్రాబాద్ గురించి కాని, తన వుద్యోగం గురించి కాని, తన రాజీనామా అంగీకరించారా లేదా అన్న విషయం కాని, ప్రియంవద ఎలా వుందో అన్న విషయం గురించి కాని, ఎలాంటి ధ్యాసా, చింతా, ఆలోచనా లేదు. గంగానది ఒడ్డున శ్రీవల్లికి తర్పణం వదిలినప్పటి నుంచి శ్రీవల్లి కూడా తలపులోకి రావటం లేదు.

సత్యమూర్తిలో ఇప్పుడు ఎలాంటి ధ్యేయం, ఆశ, విచారం లేవు. గంగా నదిలో రోజూ స్నానంచేసి తల తుడుచు కోకపోవటంవల్ల భోజనం లేకపోవటం వల్ల కలిగిన నీరసంవల్ల, జ్వరం వచ్చింది.

(ఇంకా వుంది)

# పారువేట



కేతు విశ్వనాథరెడ్డి

కోటయ్యకు కొడుకు వాలకమేమీ అర్థం కాలేదు. యూనిఫారం విప్పకుండా మౌనంగా పడకేసిన కొడుకును భోజనానికి వెళ్లేముందు పిలిచి చూచేడు. ఈశ్వరయ్య "నువ్వుతిను" అని మాత్రం అన్నాడు.

పుట్టింటికి కాన్పుకోసం పోయిన పెళ్ళాం కోసం ఆత్ర పడుతున్నాడేమో! వుండదు, పై ఆఫీసర్ల తిట్లుతిని వేడిలో వున్నట్లుంది. అయినా తిట్లు ఆరోగ్యానికి మంచివేలే. యెదురు దెబ్బలు తింటేనే గట్టిపడేది. అనుకుంటూ కోటయ్య తాను తీరికగా భోంచేసి వచ్చేడు. యింకా మంచంలోంచి లేవని కొడుకును చూచి 'యేదైనా గొడవలో యిరుక్కోలేదు కదా' అనే అనుమానం కలిగింది. కొడుకును కదిపేడు.

"యేం అట్లా వున్నావు?"

"యీ వుద్యోగం నేను చెయ్యలేను. మనిషన్న వాడెవ్వడూ చెయ్యలేడు.''

ఈశ్వరయ్య కంఠంలో ధ్వనించిన దృఢ

నిశ్చయానికి కోటయ్య అదిరిపడ్డాడు.

వీడెంత సులభంగా వుద్యోగం చెయ్య లేనంటున్నాడు? తన ముప్పయి అయిదేళ్ళ సర్వీసులో మాటవరుసకయినా తాను అను కోని మాటను యెంత కష్టం లేకుండా అంటు న్నాడు? గార్డుగా రిటయిరయినాననీ, పదిమంది పిల్లల సంసారమనీ, యే ఆధారంలేదనీ, పై ఆఫీసర్ల కడుపులూ కాళ్ళూ పట్టుకొని, నానా గడ్డీ గరిచి టెంపరరీగా వేయించుకొన్న ఫారెస్టు రుద్యోగాన్ని యెంత సునాయాసంగా తీసి పార వేస్తున్నాడు. ముండమోపి బి.ఎస్.సి. డిగ్రీ తీసుకొని నాలుగేళ్ళు ఖాళీగా మూలని కూర్చు న్నది మరిచిపోయినాడేమో! మనిషన్న వాడె వడూ యీ వుద్యోగం చెయ్యలేడట! చేసే వాళ్ళంతా అడివి జంతువు లయినట్లు! యే దేవుడో దిగివచ్చి కల్పవృక్షాన్నో కామధేను వునో కోరుకోమంటే రిటయిరుమెంటు అనేది లేకుండా యెర్ర చందనం, మందలు మందలు మేకలూ వుండే రేంజిలో వాచరు వుద్యోగమయినా కోరుకునే తన కడు పున యెట్లా పుట్టినాడు వీడు? చిన్నప్పటినుంచీ యింతే! తలతిక్క వెధవ! వీని తలకాయ రిపేరు చెయ్యాలి. లేకపోతే వీడెక్కడ తేలు తాడో వీడికే తెలియదు.

కోటయ్య నిశ్చయానికివచ్చి కొడుకును అడి గేడు:

"ఏం? ఏ రేంజరు సారో, డి. యఫ్. వో. దొరో తిట్టినారా? ఈకాలం ఆఫీసర్లు వొక ఆఫీసర్లా, వీళ్ళతిట్లు ఒక తిట్లూనా? తెల్లోడి రాజ్యంలోని ఆఫీసర్లయితే వాళ్ల జాతిపుట్టు ఆఫీసర్లు. తిట్టినా సొగుసే. తన్నినా సొగుసే. బ్రిటీషు కాలంలో వాచరుద్యోగంలో వున్నప్పుడు- నువ్వు పుట్టలేదు—వొకమారు యేం జరిగిందో తెలుసా?"

'ఇక సోది మొదలయింది' అనుకుంటూ ఈశ్వరయ్య అటుతిరిగి పడుకున్నాడు. కోటయ్య పూనకం వచ్చినవాడిలా చెప్పుకపోయేడు:

"డి. యఫ్. వో. దొర మన నల్లదొరే. అయితే నేం! తెల్లదొరల నోట్లోంచి వూడిపడి నోడు. కేంపుకొచ్చినాడు. ఆ దొరకేమో తెల్లవారి ఐదింటికే బెడ్డుకాఫీ అలవాటు. అర్ధ రాత్రి కటిక చీకట్లో దగ్గరున్న పల్లెకు నడిచి పోయి సేరుపాలు తెచ్చినాను! కాగబెడుతూంటే పొరపాటున వులికి పోయినాయి. పై ప్రాణాలు పైన్నే పోయినాయి. కాసిన్ని పాలు మిగిల్తే వాటితో కాఫీ చేసుకొని తీసుకపోయినా. 'ఇంత నల్లగుందేం కాఫీ' అని చిందులు దొక్కినాడు. కావలసిన పాలు దొరకలేదని అబద్ధమాడినా 'పాల్లేకపోతే నీ పెళ్లాం చళ్ళు పిండి కాఫీ కల పాల్రా లంజకొడుకా—అని... "

"వాన్ని అక్కడే అడవిలోనే పాతిపెట్టక పోయినావా, అప్పుడే."

ఈశ్వరయ్య అటు తిరిగి పడుకున్న వాడల్లా లేచి కూచుని వుద్రేకంతో అన్నాడు.

కోటయ్య పకపకా నవ్వి ప్రశ్నించేడు:

"అడవిలోకి వచ్చే కట్టెల మోపులోళ్ళనో, మేకలోళ్ళనో మనం అటులనే తిడతా మనుకో. వాళ్ళు మనల్ని పాతి పెడుతున్నారా? పెద్ద జీవాలు పెద్ద జీవాలే. సన్నజీవాలు సన్నజీవాలే"

ఈశ్వరయ్య దిగ్గున మంచం మీంచి లేచి కూచొని వుద్రేకంతో చెప్పుక పోయేడు:

"అందుకే నేననేది. సన్నజీవాలను హింసించే యీ పనికిమాలిన వుద్యోగం వద్దని. యీ దినం రేంజాఫీసరు రెయిడుకు పోవా లన్నాడా? పోయినాం. యెందుకో తెలుసా? నెలకొక్కసారి యేదో వొకకేసు బుక్ చెయ్యక పోతే మా మొగుళ్ళు వూరుకోరట! రెవెన్యూ చూపాలట! పైన ఫ్లయింగ్ స్క్వాడ్ భయం. నమ్మకముండి కాదు; అడవిని రక్షించడానికి కాదు....యీవాళ రెయిడ్‌లో దొరక్క-దొరక్క యీ దినమో రేపో చావడానికున్న ముసల్ది దొరికింది—కట్టెల మోపుతో. పది పండ్రెం డేండ్లు కూడా లేని యిద్దరు పిల్లకాయలు దొరికినారు—అరమూటె బొగ్గుల్తో. మరో ముసలోడు పది బడుగు మేకల్తో దొరికినాడు.

ఆ దృశ్యాన్ని తలచుకుంటేనే కడుపు మండుతుంది. మా వాళ్ళు తరిమితే కట్టెల మోపుమీద పడి ముసల్ది కూలబడింది. పిల్ల

కాయలేమో కంపల్లో పడినారు. వాళ్ళ దగ్గర గతికినా కూడా మావాళ్ళు వాళ్ళను బండ తిట్లు తిట్టడం, తన్నడం! 'మొన్ననే వొక కోడి పెట్టను తెచ్చిస్తినే మీ దూము తగలా అంత లోనే యింత అన్నేయమా' అని రేంజరుతో ఆ ముసల్ది మొత్తుకుంది. 'మేకపిల్లను తోలి పెట్టినానే మేం తిని బతికేదెట్లా' అని ఆ ముసలోడు యేడ్చినాడు. యీ ఘోరానికి తోడు మోపుకు పదీ, మేకకు అయిదూ కాంప వుంది. అరమూట బొగ్గులకు ముప్పయి రూపాయలు కాంపవుండు. యెక్కణ్ణుంచి తెచ్చి కడతారు? మళ్ళీ అడవి కొస్తారు, కట్టెలకూ, బొగ్గులకూ, మేకల మేతకూ. మళ్ళీ తన్నులు, కాంపవుండ్! యీ ఘోరాలు నేను చెయ్యలేను. యీ అడవి డ్యూటీ నాకువద్దు. యీ రకం అడవి రక్షణ నాకు చేతకాదు. కటిక దరిద్రుల్ని పీక్కుతినే యీ వుద్యోగం నాకు వద్దు. చేత నయితే అడవిమీద లక్షలు సంపాదించే వాళ్ళను పట్టుకోవాలి."

ఈశ్వరయ్య తన బాధనూ, అక్కసునూ వెళ్ళగక్కేడు. గుండె తేలికయింది. మళ్ళీ మౌనంగా పడుకున్నాడు.

కొడుకు మాటలు విని కోటయ్యకు మతి పోయింది.ఆ మధ్య ఎప్పుడో చూచిన కురుక్షేత్ర నాటకం మనసులో మెదిలింది. జీవితంలో తాను గడించిన అనుభవ సారాన్ని బోధించేడు:

"వొరే నాయనా! నువ్వుండేది అడవి. నువ్వు చేసేది అడివుద్యోగం. నువ్వేమీ అదేంది జీవ కారుణ్య సంఘమోడివి కావు. యెవడి బతుకు వాడిది. నువ్వు ఆర్చే వాడివీ కాదు తీర్చేవాడివీ కాదు. వుద్యోగంలో చేరి పదిరోజులన్నా కాలేదు. నీ వాలకమేదో విచిత్రంగా వుంది. వాడెవడో బుద్ధుని మాదిరి మాటలాడుతున్నావు. నేను కొన్ని అడుగుతాను చెప్పు. యెవడో జాలిపడితేనే నీకు వుద్యోగం దొరికిందా? లేదే. మరి నాకు రెండుమూడువేల ఖర్చెల్లా అయింది? రేపు యే ఆఫీసర్లోవచ్చి తలకోన గెస్టవుసులో దిగి డిన్నర్లంటే, జాలిపడి నీ రేంజరు నిన్నొదులుతాడా? వదలడే. దమ్మిడీ లంచం ముట్టకోకపోయినా 'గతికి వుంటావులే నా కొడకా నీ భాగం యే యిన్నూరో తీసకరా' అనడా ఆ మీసాల రేంజిరోడు. మామూళ్ళు వసూలు కావా? నీ పెండ్లాం రేపు పుట్టింటి నుంచీ కొడుకునో కూతుర్నో యెత్తుకొని వస్తే వాళ్ళను జాలిపడి లోకం సాకుతుందా? సాకదే. అడవి మీద బతికే వాళ్ళు వాళ్ళ తిప్పలేవో పడతారు. వాళ్ళమీద బతికేది మన వుద్యోగం. యిటుల జాలీగిలీ మాటలువద్దు. అడివిలో బతుకిది. మట్టు మీదేసుకొని కూచోవద్దు. నువ్వేదో అడవిమీద లక్షలు సంపాయించే వాళ్ళను పట్టాలంటాన్నావు. అదేం కాలేజీల్లో స్ట్రయికు అనుకున్నావా? శాంతమ్మ మాదిరివాళ్ళు అడవి మీద లక్షలు సంపాయిస్తున్నారు నిజమే. వాళ్ళనేం జేస్తావు—వాళ్ళకు మచ్చిక కావడం తప్ప. చిల్లరోళ్ళ సంగతంటావా? వాళ్ళంతే. రిజర్వు ఫారెస్టులో మేక అరుపు వింటే నిద్దర్లో వున్నా మేకకు పావలా మామూలు కోసం చెయ్యి చాస్తున్నాడే—మీ డి. యఫ్. వో. ఆ దొరకులేని జాలి నీకెందుకు? న్యాయమో అన్యాయమో నువ్వెవడు చెప్పడానికి. అడివి రూల్సు అట్లున్నాయి...."

కొడుకేమీ జవాబు చెప్పలేదే అని "యేమంటావు?" అని కోటయ్య ఈశ్వరయ్యను హెచ్చరించేడు. ఈశ్వరయ్య నిద్రపోయాడని తెలుసుకున్నాడు. 'అదేందీ వుద్యోగ వైరాగ్యం అయి వుంటుందిలే' అని కోటయ్య నవ్వుకొని పడకేశేడు. కొడుకు తిండి తినకుండా పడుకున్నందుకు కోటయ్య మనసు కలత పడింది.

నిద్రపోతున్న ఈశ్వరయ్య మనసులో యేవేవో చిత్రాలు, చెవుల్లో వింత వింత శబ్ద తరంగాలు. ఈశ్వరయ్య మెదడును యెవరో కుదిపి నట్లయింది. ముళ్ళ చెయ్యితో గుండెను కెలికినట్లయింది. మనసును తొలిచినట్లయింది.

ఈశ్వరయ్య కలసాగిపోతోంది.

యెవరూ? యెవరది??

రిజర్వు ఫారెస్టులో కాకి డుస్తులు. కాకి దుస్తుల్లో కట్టెలమోపు ముసల్ది; చింపిరి జుట్ల




పిల్లలు; మేకల ముసిలోడు. కట్టెల మోపులు మోస్తూ, బొగ్గుల మూటలు యెత్తుకొనివస్తూ, మేకలు కాస్తూ డి.యఫ్.వో, రేంజరు, గార్డులు. కాకీ దుస్తుల్లోకి వాళ్లు మురికి చిరుగు బట్టల డి. యఫ్. వోనూ, రేంజరునూ, గార్డులనూ, వాచర్లనూ తిడుతూ, తరుముతూ తంతున్నారు.

ఆశ్చర్యంగావుంది. తిరగబడరే. వీళ్ళకేం పొయ్యేకాలం!

తాను దూరంగా నిలబడి చూస్తున్నాడు.

అరే! అదేం!

ఫ్లయింగ్ స్క్వాడ్! రెట్ సాండర్స్ ఫ్లయింగ్ స్క్వాడ్!!

దిక్కుతోచని వురుకులు! దిక్కు తెలీని గెంతులు!!

అడవి కంపల్లో, ముళ్ళ పొదల్లో, రాళ్ళ సముద్రంలో,

వురుకులూ, పరుగులూ, గెంతులూ.

ముసలి డి.యఫ్.వో. కట్టెల మోపు మీద వేసుకున్నాడు.

మీసాల రేంజరు కంపల్లో పడ్డాడు.

తను నవ్వుతున్నాడు. నవ్వుతూ నవ్వుతూ తను మేకగా మారిపోయేడు.

మే .. మే .మే....

తనను తండ్రి తోలుకొని పోతున్నాడు.

'పో ముండా అడవిలో మెయ్యి' అంటు న్నాడు.

యెవరిది; యెక్కడా చూచినట్లు గుర్తులేదు. ముసల్దే అందమైన స్త్రీగా మారిపోయింది. ఆమె చుట్టు డి. యఫ్. వోలు, రేంజర్లు.

మేక దొరికిపోయింది. తను దొరికిపోయేడు.

'మేకపోతు మాంసం బాగుంటుంది' అంది ఆవిడ. ..శాంతమ్మా!

కాకీ దుస్తులవాళ్ళు తన గొంతుకోస్తున్నారు.

మే.... మే.... మే....

తన గర్భిణీ భార్య యేడుస్తోంది.

రక్తం.......రక్తం.... ..అడవి అంతటా రక్తం ...బొగ్గుల కోసం కాల్చే అడవి మంటల రక్తం....తన గొంతు విడివడి....

ఈశ్వరయ్యకు భయంతో మెలకువవచ్చింది. గుండెలు గుబగుబలాడేయి. పీడకల! ఆరాత్రి అంతా ఈశ్వరయ్యకు నిద్రలేదు.

తెల్లవారిందో లేదో, వాచరువచ్చి "డి. యఫ్. వో దొరగారు గెస్టుహావుసుకు అర్జంటుగా రమ్మంటున్నార"ని చెప్పేడు. కళ్ళ మంటలతో, విసుగుతో, అసహనంతో యూనిఫాం మార్చుకొని ఈశ్వరయ్య ఫారెస్టు బంగళా చేరుకున్నాడు.

డి. యఫ్. వో యెగాదిగా చూస్తూ తాపీగా తెల్పేడు:

"మీ రేంజాఫీసరు వారం రోజులు సెలవు పెట్టేడు. యే క్షణాన్నయినా ఫ్లయింగ్‌స్క్వాడ్ రావచ్చు. కాస్తా వాళ్లు జాగ్రత్త పెట్టుకొని వుండు, సెక్షన్లో. తలతిరుగుడు పనులు చేశేవో యింటికి పోతావు."

తనేం తలతిరుగుడు పనులు చేస్తాడని అనుకుంటున్నాడో ఈశ్వరయ్య డి.యఫ్.వోనే అడగాలనుకున్నాడు. నోరెండిపోయి నోట మాటరాలేదు.

అంతలోనే డి. యఫ్. వో అన్నాడు:

"గార్డు పోలయ్య చెబుతాడు మిగతా. యూ కెన్ గో...." చెమట తుడుచుకుంటూ ఈశ్వరయ్య బయటపడ్డాడు.

కోపాన్ని దిగమింగుకుంటూ గార్డు పోలయ్యను ఈశ్వరయ్య అడిగేడు;

"యేమిటి పోలయ్యా; యేమిటంట?"

"దొరగారి మాటలా! నువ్వెట్లా వుద్యోగం చేస్తావు సార్? నిన్ననేమో ఆ కట్టెలోళ్ళనుచూచి పాపం పావం అంటివి. మీ నాయన కడుపున పొరపాటున పుట్టినావు. గార్డు అయితేనేం మీ నాయన పిల్లరాజు యేలినట్లు రాజ్యం యేలినాడు. యీ అడవిని — వుద్యోగం చేసినన్నాళ్ళూ. నువ్వేమో...."

పోలయ్య నవ్వటం మొదలు పెట్టేడు.

ఫారెస్టరు ముందు గార్డు నవ్వటం ఈశ్వరయ్యకు నచ్చలేదు. కేడరు గుర్తు కొచ్చింది. పోలయ్య వయసు గుర్తుకొచ్చి తమాయించుకున్నాడు.

"అసలు విషయం చెప్పు" అన్నాడు.

"ఏంలేదు సార్! రెడ్ సాండర్స్ ఫ్లయింగ్ స్క్వాడు డి. యఫ్. వో. కు మన రేంజిమీదే కన్ను. వున్నట్టుండి మీద పడుతాడు, ఏ అర్ధరాత్రో. యమ స్ట్రిక్టు. యెర్రచందనం వుండేదీ మన రేంజిలోనే. బయటికి పోయేదీ మనరేంజి నుంచే. మరీ మన సెక్షన్‌నుంచే. యే వెధవ నా కొడుకో ఫలానా టయింలో ఫలానాలారీలు పోతాయని, ఫలానాచోట పట్టుకోవచ్చునని ఇన్ఫరుమేషను యిస్తాడు. దానికితోడు మన గార్డు నాకొడుకులూ, వాచరు గాడిదకొడుకులు యిన్ఫార్మెంట్లుగా వుంటారు. లారీలు దొరుకుతాయి. నమ్మకద్రోహం చేసినామని శాంతమ్మ మనుషులు మనపని పడతారు. షరీకైనామని, సరిగా డ్యూటీ చేయడంలేదని ఫ్లయింగు స్క్వాడోళ్ళు పైకిరాసే రిమార్కులు. ఇదొక గూటం! మన దొరగారు రిటైర్మెంటుకు దగ్గరో వున్నారా? ఈ గొడవంతా యెందుకని ఫ్లయింగ్ స్క్వాడు వచ్చేది ముందుగానే కనుక్కొని శాంతమ్మ మనుషులకు తెలపమంటారు."

"ఆమాట నీతో చెప్పినారా?"

"పై ఆఫీసర్లు నోటితో చెప్తారా సార్. మనం కనుక్కోవాల. తంటాలు పడాల— వొకరి సొమ్ము ఆశించినాక..."

"యెవరి సొమ్ము?"

"తెలీనట్లు మాటాడ్తావేం సార్? మీ నాయన చెప్పలేదా? అడుగు....నువ్వింకా కొత్త కదా?"

ఈశ్వరయ్యకు ఆ మర్మమేదో మనసుకు తట్టింది. అడవి పరిపాలన, అడవి న్యాయం, అడవిపంపకాలమీదఆధారపడ్డాయనుకొన్నాడు. ఈశ్వరయ్య నీరసంగా అడిగేడు:

"అయితే ఇప్పుడేం చేయాలంటావు?"

"చేసేదేముంది సార్? ఆ రేంజరు సారు వూర్లోలేడు. యీ శాంతమ్మ మహాతల్లేమో ఎర్రచందనం రెండు లారీలోడ్లు రేపు రాత్రికే మద్రాసు తోలి తీరాలని మొండికేసింది.జపాను స్టీమరు మర్నాడే పోతుందట! ఈ ఫ్లయింగు స్క్వాడు డి. యఫ్. వో వచ్చినాడంటే తాను తినడు వొకర్ని తిననీడు. వొక అర గంట ఆ దొరతో మాటాడినామా మనంకూడా ఇన్ఫార్మెంట్లుగా మారిపోతాము — నువ్వింకా




చూల్లేదుకానీ."

ఈశ్వరయ్యకు ఫ్లయింగ్‌స్క్వాడ్ డి.యఫ్.వోను చూడాలనిపించింది.

పోలయ్య దిగులు ముఖంతో అన్నాడు.

"చూడుసార్! నా పెండ్లాం తిరువతి ఆస్పత్రిలో వుంది. సీరియస్‌గా వుందని మనిషి వచ్చినాడు. మన దొరగారికికూడా చెప్పినా. సెలవుపెట్టి పోతా. నువ్వేమో మీ నాయనకు యీ విషయం చెప్పు చాలు. రిటయిరయితేనేం యిలాంటి వాటిల్లో డిపార్టుమెంటుకు యెంత తోడో! నేనుంటే బాగుండేది కానీ నాభార్య.."

"పాపం! నువ్వెళ్ళు. ఆమె కెట్లుందో? ఏదో తంటాలు పడవచ్చులే, మిగతా మన వాళ్ళతో."

ఈశ్వరయ్య సానుభూతి పోలయ్యని క్షణం పాటు కదిలించింది.

తను అబద్ధమాడినా నమ్మినాడు. ఎక్కడో స్కూలు టీచరుగా స్థిమితంగా వుండవలసినోడు ఇంకా సంపాయించాలని ముదనష్టపు కోటయ్య అడవిలో పడేసినాడు. యేం నెత్తికి తెచ్చుకుంటాడో?

పోలయ్య జాలిపడి తప్పుకున్నాడు.

ఈశ్వరయ్య మనసు తీవ్రంగా మథనపడసాగింది. అతనిలో భయం, వెర్రివుత్సాహం;. పెద్దజీవాలకు మచ్చిక కాకూడదు. పడితే వాటి పనే పట్టాలనే సాహసం తలయెత్తింది. కట్టెల ముసిలిదానిలాంటి యే కుందేలునో, వెంటాడడం కాదు, చేతనయితే శాంతమ్మలాంటి పులుల్ని వేటాడాలి. తరిమి తరిమి నీళ్లు తాగించి చంపి చంపి....

బి.యస్సీ. చదువుకునే రోజుల్లో సమ్మె నాయకత్వం వహించి, వొక పెద్దహోటలు వాడి మెడలువంచి ధరలు తగ్గించిన రోజులు ఈశ్వరయ్యకు గుర్తుకొచ్చేయి. వొక నిశ్చయానికి వచ్చేడు.

యింటికివెళ్ళి తండ్రికి పోలయ్యచెప్పిన విషయాలు చెప్పేడు ఈశ్వరయ్య. కోటయ్య ఈశ్వరయ్య వేపు మెచ్చుకోలుగా చూస్తూ అన్నాడు:

"ఇప్పుడు నువ్వు పనిచేస్తున్న యీ నెర బయలు సెక్షన్లో పదేండ్లు పనిచేసినా—ఆఫీసర్లకూ, కంట్రాక్టర్లకూ, అడివిమీద బతికే

ప్రతిజీవికీ గొడ్డకాకుండా. వాళ్ళు బతికినారు, మనల్ని బతకనిచ్చినారు. రేపు ఫ్లయింగ్ స్క్వాడ్ వస్తుంది. ఆ వూత్తుకోట రూటు తప్పించు....”

ఈశ్వరయ్య తలాడించేడు.

మరుసటిరోజు రాత్రి ఫ్లయింగ్ స్క్వాడ్ జీపు రానేవచ్చింది. ఈశ్వరయ్యనుకూడా వెంట తీసుకొని అడివిలోని రూట్లగాలింపు జరిగింది. తెల్లవారుజామున నాలుగుగంటల ప్రాంతంలో వూత్తుకోట దగ్గర మాటువేస్తే అనుకున్న రెండునంబర్లుగల లారీలు కనిపించాయి. కనిపించినట్టే కనిపించి రాష్ట్రసరిహద్దుదాటి మద్రాసు రాష్ట్రంలోకివెళ్ళి మాయమయ్యేయి.

లారీలు దొరక్కపోయినా ఈశ్వరయ్య ఫ్లయింగ్ స్క్వాడుకు బదిలీ అయ్యేడు. అంతలోనే ఫ్లయింగ్‌స్క్వాడ్ డి.యఫ్.వో రాజారావు కర్నూలు వర్కింగ్ ప్లాన్‌కు మారిపోయాడు. రాజారావు బదిలీతో ఈశ్వరయ్య నడుము విరిగినట్లయింది. తిరిగి రెగులర్ సెక్షన్‌కు బదిలీ జరిగింది.

రెగులర్ సెక్షన్లో ఫారెస్టురుగా చార్జితీసుకున్న రోజు కోటయ్య అతి శాంతంగా కొడుకుకు చెప్పేడు:

“నీ దేశసేవలు అందరికీ తెలిసినాయి. ఆ దినం లారీలు దొరికివుంటే తెలిసివుండేది. యెవడో తలతిక్క నాకొడుకు ఆఫీసరుస్ట్రిక్టుగా వుంటాడు. దేశమంతా వాళ్ళతోనే నిండిందనుకోకు. వాడితోన్నే యేదో జరుగుతుందనుకునేవు? నీ ఫ్లయింగ్‌స్క్వాడు డి యఫ్.వో మెప్పులు నిన్ను రక్షింపవు. రెగులరోళ్లు నీమీద కావలసిన పిటీషన్లు పెట్టించినారు—డబ్బుగుంజితింటున్నావని. పిటిషన్లు పెట్టింది నువ్వు జాలిపడిన మేకలోళ్లు. మర్యాదగా బతకడం నేర్చుకో—నీ పెండ్లాం పిల్లలవేపుచూడు. నువ్వూ, నేనూ మనకంటే తగ్గోళ్ళని యేడిపించి బతకాల్సిన వాళ్ళమే తప్ప మనకంటే పైవాళ్ళ నేదో పొడుస్తా మనుకోవడం మన నాశనానికే.’’

ఈశ్వరయ్య అయోమయంలో పడ్డాడు. కొత్తగా ఫ్లయింగ్ స్క్వాడుకు వచ్చిన డి.యఫ్.వో తన ట్రాన్స్ఫరుకు యెందుకువప్పుకున్నట్లో ఈశ్వరయ్యకు అరంకాలేదు. తన మీద మేకలోళ్ళు పెట్టినారని ముసలోడంటున్నది ఆబద్ధం. సర్వాబద్ధం. వాళ్ళెప్పుడూ అది చేయరు, చేయలేరు అనుకున్నాడు.

ఆ సాయంత్రం సెక్షన్లో మేకలమంద వుందనీ, డి.యఫ్.వో దొర వెళ్తున్నారని పోలయ్య పరిగెత్తుకుంటూవచ్చి ఈశ్వరయ్యతో చెప్పేడు. ఈశ్వరయ్య పరుగుతీశాడు.

తన సెక్షన్లో, తలకోన బీటులో.

కాకీదుస్తుల హడావిడి. కట్టెలమోపులు యెక్కడివక్కడ పడవేసి తన్నులు, కాంప వుండ్ల భయంతో పరిగెత్తిపోతున్న పిల్లాపీచూ, ముసలీ ముతకా. తోకలు తెగినట్లు అరుస్తూ అడవి అంతటా చెల్లాచెదరయి గొంతుల్లో, పరుగుల్లో మేకలు.. మేకపిల్లలు.

డి.యఫ్.వో కరిచేడు:

“డ్యూటీలో లేకుండా యెక్కడ చచ్చేవు బ్లాగర్డ్. ఫ్లయింగ్‌స్క్వాడ్‌కు యిన్ఫర్మేషన్ యివ్వను చచ్చేవా? బొక్కలో పెడతాను. యిప్పుడొచ్చిన పిటీషన్లు చాలు. పరుగెత్తు. పట్టుకో వాళ్ళను. యూ రాస్కెల్. మేకల్ని మళ్ళించు. వూ. అలా చూస్తావేం. కళ్ళు తిరుగుతున్నాయా? గో...రన్ ..”

ఎవర్ని తిడుతున్నాడో తెలీని బండబూతుల్తో ఈశ్వరయ్య అడ్డంగా అడవిలో మేకలవెంట.. మేకల్లో కలిసి . .



**వినయ్**

# శేష ప్రశ్న



ఆకలికడుపులా మండిపోతున్నాడు సూర్యుడు.

దొరల జులుంలా విసరి కొడుతున్న గాలికి బ్రతుకుల్లాగే ఎగిరి పోతున్నాయి పోలయ్య, పంతులు వేసుకున్న గావంచాలు. వాటిని ఆపటానికి విశ్వప్రయత్నం చేస్తూ నడుస్తున్నారు. పక్కనే దాదాపు ఎండిపోయిన చెరువు పల్లె ప్రజల మెదళ్ళలాగే వుంది. సిద్ధాంతాల్లాగా వున్నాయి, అక్కడొకటీ, ఇక్కడొకటీ మబ్బులు. అవి ఎప్పటికైనా వర్షమంటూ కురిసినా, ఆ చెరువు నిండటం కష్టమే. అది నిండితేగానీ రెండు పూటలా తిండి దొరకదు, వాళ్ళ బ్రతుకులు ఓదారిన పడవు.

అప్పట్నించీ ఏదో మాట్లాడుకుంటూ వస్తున్నారు, పోలయ్యా, పంతులూనూ.

“నువ్వేన్నన్న చెప్పు పంతులూ, బొత్తిగా

దొర రుదయం[1] లేనోడంటె నేన్నమ్మ."

"నువు నమ్మవు పోలయ్యా, గందుకే దొరలు గిట్ల రాజ్యాలేలు తాండ్లు. కటికోడు ముద్దుగ మేత బెడుతాంటె నువ్వు, నేను బొయి చెప్తె మేక నమ్ముతాది మనల. దానికదంత బత్తామీజు[2] గనే కనబడ్తది. యాళ్ళ పొద్దు గాల బిడ్డ నెత్తుకున్నట్టు ఎత్తుకోని దుకాండ్లకు తీస్కపోతాంటె గుడ దానికి జరంతన్న అను మానం రాదు. వాడు కత్తి నూరెటప్పుడు గని తెలిసొస్తది, మేతబెట్టి, కడుపు నింపి, నా ఆసొంటోళ్ళందర్ని[3] గీ కత్తితోనే నరికి వాని కడుపు నింపుకుంటాండని."

"యే, నువ్వు మరీ కైత్కాలు[4] జెప్పకు. మరి దొరగుడ గసొంటోడే ఐతే, మా అయ్య దీసుకున్న అప్పు, గిప్పటి దాక నన్నెందుకో అడుగకనే పాయె. గిది జెప్పు మళ్ళ." పెద్ద ప్రాబ్లమ్ ముందు పెట్టినట్టు దొరమీద చెద రని నమ్మకంతో అన్నాడు పోలయ్య.

"అప్పెందు కడుగుతడు నెల నెల నువ్వు వడ్డీ గడుతలేవు?"

"వడ్డీ వడ్డేనాయె. ఎన్నడన్న అసలు సంగ తెత్తినాడు. మల్ల ఈ నెలింక నా తన్న[5] పైస లేక వడ్డీ గుడ కట్టకనే పోతి. ఐనా, నేను ఊరికి బోతాంటె ఎరుకుండి గుడ వారీ[6] మల్ల వూరికి బోతాంటివి. వడ్డీ గట్టి పోవార పోలిగా అనన్న అన్నడా? మనం బోయెటప్పుడు దొరింటికి నేను బోలే, నువ్వు గుడుంటివి గద ఆడ."

"ఓ పిచ్చి పోలయ్యా వడ్డడు గని షరా బోడల్ల మంచోడని, దయునోడని, నీ ఆసొం టోళ్ళందరు అనుకుంటాంటెనే వాల్లు యిట్ల బంగ్లాల పక్క బంగ్లాలు గట్టి, పాపం పుణ్యాం అన్న రంది లేకుంట ఉంటాండ్లు. నీ అయ్య జేసిన బాకీ అసలు నువ్వెందుకు చెల్లు గట్టాలె. అచ్చా, కడుతవే అనుకో, వెయ్యి రూపాయ లకు నెలకు ముప్పైఛ రూపాయల లెక్కన ఇప్పటికి ఇర్వై ఏండ్లనుంచి ఐదారు వేల రూపాయలిచ్చినవు నువు దొరకు. రేపు నువు గుడ తీర్చకుంటనే సస్తె, నీ కొడుకు దొర కొడుకుక్క వడ్డీ గడ్తడు. మరి అప్పుడే మీ అయ్యనో, ఇప్పుడు నిన్నో అసలడుగుతె, వాల్ల తరతరాలు ఎట్ల బతుకాలె?"

"గట్లనుకుంటె యిగ దునియంత[7] ఎట్ల నడుస్తది పంతులు?" అది సృష్టి ధర్మమన్న ట్టుగా అన్నాడు పోలయ్య.

"అంటె, దునియ నడువాల్నంటే ఒగ న్నొగడు దోసుకోవాలన్నట్టా?"

"ఔగద మల్ల, పెద్ద శావ[8] చిన్న శావను దింటది. చిన్న శావ పురుగులను దింటది. లేకుంటె అవెట్ల బతుకాలె."

అవును మరి పోలయ్య చెప్పిందీ నిజమే కదా. పంట బాగా పెరగాలంటే చుట్టుపట్ల చిన్న వాటిని ఏరి పారేయక తప్పదు. ఆ పని మనం చేయకున్నా, మర్రి తాను పెరుగుతుందే కానీ పక్కన మరో చిన్న మొక్కను కూడా పెరగనీయదు. నిజమే. ఐతే, మనిషికీ మానుకూ తేడా లేదా.

"నీ ఆసొంటి ఎడ్డిబాగులోనికి[9] నేను సమజు జెయ్యలేను[10]. అందుకే, దేశమెట్ల బాగుపడుతదంటె ఎవడైన ఏంజవాబు జెప్తడు? మంది[11] గొర్రెలోలె ఐతాంటె" లోలోపలే అనుకున్నాడు. పంతులు ఆ మాట పైకి అన లేదు. ఎందుకంటే, అంటే పోలయ్య మళ్ళీ యింకొకటంటాడు. అవన్నిటికీ సమాధానం చెప్పే శక్తి పంతులుకు లేదు. అతనికి తెలిసిం దొక్కటే దొరలు దోచుకుంటారన్నది. కానీ, అది అన్యాయం కాదని అనే వాళ్ళకు ఏం చెప్పాలో అతనికి తెలియదు.

తరాలనుండీ కౌలుకు తీసుకుంటున్న తనది కాని పొలంలో దొరల్లాగా ఏపుగా పెరిగిన

---

1. రుదయం-హృదయం, 2. బత్తామీజు-అసమంజసం. 3. ఆసొంటోళ్లు-లాంటివాళ్ళు. 4. కైత్కాలు-కవిత్వాలు.

5. తన్న-దగ్గర, 6. వారీ-ఒరే, 7. దుని య-ప్రపంచం, 8. శావ-చేప, 9. ఎడ్డిబాగు లోడు-వెర్రి బాగులవాడు, 10. సమజు జెయ్య లేను-అర్థం చేయలేను, 11. మంది-జనం.




పంటను చూసుకుని దొరబిడ్డలా మురిసిపోతూ వున్నాడు పోలయ్య. ఇద్దరూ అలా మాట్లాడు కుంటూనే ఊళ్ళోకి అడుగుపెట్టారు.

అక్కడా ఇక్కడా ఏదో ఒకటి యేరుకుని తింటున్న పశువులు విప్లవ కవుల్లాగా వుండుండి ఓ అరుపు అరుస్తున్నాయి. పల్లెవాళ్ళకు అది మామూలే. వాళ్ళకో గోలకిందే లెక్కకాదు.

ఇద్దరూ స్కూలుకు దగ్గరపడ్డారు.

“ఐతారం[1] గద. పోరగాండ్లు[2] కనబడుత లేదు బడికాడ” చుట్టూ కలయచూస్తూ అన్నాడు పోలయ్య.

ఆ బడినిచూస్తే చాలు, దేశమంతా చూడ నక్కరలేదు.

“బడున్ననాడు యెన్నడో అంతవొచ్చి పొడుగుజేసినట్టు.”

“అదిగూడ రైటేలే, మరి పంతులూ, నువు గిన్ని మాట్లాడుతవుగదా. బడిపంతులై తేంది” అంతా పంతులు చేతిలోనే వున్నట్టు అన్నాడు పోలయ్య.

“నాకిప్పుడు ఎత్తలేదు గనుకనా? ఎల్లన్నాడు సూద్దాం లెయ్యి” దూరంగా వస్తున్న మనిషిని చూస్తూ అన్నాడు పంతులు.

ఇక వాళ్ళు ఊళ్ళోకి వచ్చినట్టే. మొదటి ఇంటితో మొదలయింది పలకరింపు—“ఇప్పుడేనా పంతులూ. పోలిగా యిప్పుడేనార రాకడ” అంటూ. అది పల్లెల్లో పొరుగూరికి వెళ్ళొచ్చే ఎవడికయినా తప్పదు. ఐతే, పోలయ్యను పలకరించటంలో ఏదోజాలి కనిపిస్తుందీ సారి. ఆ యిద్దరూ అది గమనించలేదు.

దూరంగా వస్తున్న మనిషి దగ్గరయ్యాడు. దేవాలయం అర్చకుడు. దొర యింటికి వెళ్ళి వస్తున్నాడని వాలకమే చెబుతుంది. ఆముఖంలో రక్తమే లేనట్టుంది. దొర ఎంత పులిలాటోడైనా మనిషి రక్తం తాగుతాడంటే నిజంకాదు. దొర గారు విస్కీతప్ప మరొకటి తాగరు.

“ఏంది సాములూ, దొరింటి కాణ్నించేనా” పలుకరించాడు పంతులు.

“ఆఁ దొరవారి యింటి దగ్గిర్నుండేనాయనా.

---

1. ఐతారం-ఆదివారం, 2. పోరగాండ్లు-పిల్లలు

పొద్దున్నే లేచి ఆ రాములవారి బొమ్మ చూశాను గనుక బతికి బయటపడ్డాను'' అక్కడెవరూ లేరని గమనించినాకే అన్నాడు అర్చకుడు.

"అదేంది సాములూ. దొర నిన్నేమన్నడు. అసలేమయింది" ఆశ్చర్యపోయినట్టుగా అడిగే శాడు పంతులు.

పోలయ్యకూడా ఆగిపోయాడు.

"ఏముంది నాయనా. ఉత్సవాలకోసం సేక రించిన సొమ్ములో మరికొంత యిప్పిస్తే రాములవారి పేరుమీదుగా సంతర్పణ చేద్దా మన్నాను. వద్దన్నారు. నోరు ఊరుకోదుకదా. నచ్చజెప్పబోయాను. నాలికజారి, దేవుడిసొమ్మే కదా—అన్నాను. అంతే, మరో మాటంటే దేవుణ్నే చూపిస్తానన్నారు. మనకెందుకొచ్చింది చెప్పు. యథారాజా తథాప్రజా అన్నారు. ఆయన పలికింది మంత్రమూ, చేసింది అర్చనా అయినప్పుడు ఆ దేవుడయితే కాదనడు కదా, నేను అని నా పెళ్ళాం బిడ్డలను ఏ దేవుడికప్ప గించను చెప్పు. వెయ్యి క్షమార్పణలు కోరి, లెంపలేసుకుని,ఆశీర్వచన మంత్రాలుచెప్పి, దీర్ఘ ఆయురారోగ్య ఐశ్వర్యాలతో వర్థిల్లమని దీవించి, ఇలా వస్తున్నాను.''

దీనికి పోలయ్య ఏమీ జవాబుచెప్పలేదు. మౌనంగా ఆలోచిస్తూ వుండిపోయాడు. దేవుడి సొమ్ము దేవుడికీ యొద్దన్న దొరమాటను పిచ్చి పోలయ్య ఏమని సమర్థిస్తాడు... ?

అర్చకుడు రెండుమూడు మాటలుమాట్లాడి వెళ్ళిపోయాడు. పంతులుకూడా తనదారిన వెళ్ళటంతో పోలయ్య ఇంటిదారి పట్టాడు, ఎదురయిన వాళ్ళనల్లా ముక్తసరిగా పలకరిస్తూ. ఇంటి దాపులకు సమీపిస్తూనే ఆ నిశ్శబ్దానికి ఆశ్చర్యపోయాడు.

"సుబ్బీ, ఒలే సుబ్బీ'' అంటూ ఉత్సా హంగా కేకవేస్తూ లోనికి నడిచాడు.

సుబ్బులు బయటకొచ్చింది.

"వచ్చినావా మావా'' అంది నిట్టూరుస్తూ.

తననుచూసి ఎగిరి గంతేయవలసిన సుబ్బులు ఎందుకలా నీరసంగా వుందో అర్థంకాలేదు పోలయ్యకు.

"ఏందే గట్లున్నావు. ఒంట్లె[1] బాగలేదా'' ఆప్యాయంగా అన్నాడు దగ్గరకెళుతూ.

"ఒంటికేమయింది. మంచిగనే వున్నది. మన నొసటిరాతే మంచిగలేంది.''

"సరే తియ్యే. మనరాతల కేమొచ్చె గనీ. పట్నంలకెళ్ళి నీకు రైక[1] గుడ్డ తెచ్చినాచూడు'' అన్నాడు మంచం వాల్చుకుని కూచుంటూ.

"సూస్త తియ్యి. ముందుగాల అన్నం తిందువుగనీ, రా. బాయికాడ కాల్లుగడుక్కోని'' అంటూ లోపలకి పోయింది.

కాళ్ళు కడుక్కొని పీటవాల్చుకుని, భోజనం ముందు కూచున్నాడు. అప్పుడు గుర్తొచ్చింది, ఆ నిస్సబతకు కారణం.

"రాముడు, భీముడెవ్వే. చెరువుకాడ నాకు కనపడకనే పాయె. కష్టాలగడ్డ[2] దిక్కుగిన బొయినయా ఏంది'' అన్నాడు.

ఆ మాటకు ఉలిక్కిపడింది సుబ్బులు. వెంటనే సర్దుకొని—"నువు ముందుగాల అన్న మైతే తిన్నాదు. వాటి సంగతి అటుంక చెప్త గని'' అంది.

'తరువాత చెబుతాను' అనిగనక సుబ్బులు అనకపోతే అన్నం తినేవాడే. కానీ, ఆమాటే అతన్ని ఆలోచింపచేసింది. నోటిదాకా వెళ్ళిన చేయిన వెనక్కి తీసుకుని,

"ఏమైందే వాటికి. నేను బోయేటప్పుడు మంచిగనే వుండెగాదే'' ఆందోళనతోఅన్నాడు.

"ఏంగాలేగని, నువ్వన్నం దిను'' అంది సుబ్బులు నొచ్చుకుంటూ.

పోలయ్య అన్నం తినలేదు. అతను తిన లేడు. రాముడు, భీముడు అతని జీవనాధార మయిన ఎద్దులు. అవి లేకపోతే అతనికి గడ వదు. అందుకే, పోలయ్యకు సుబ్బులుమీద కాస్త కోపం వచ్చింది.

"సే యవ్వ, చెప్పే అంటే. .'' విసుగ్గా అన్నాడు.

చెప్పలేక, చెప్పలేక చెప్పింది సుబ్బులు—

ఆరోజు ఉదయమే దొరపాలేర్లు ఇద్దరొచ్చి

---

1. ఒంట్లె-ఒంట్లో

పోలయ్య ఇవ్వవలసిన వడ్డీ యివ్వనందుకు, సుబ్బులు ఎంత వారించినా వినకుండా వాటిని తీసుకెళ్ళారు.

దొర ఎద్దుల్లో ఒకటి చచ్చిపోవటంతో, విరుగుట పెరుగుట కొరకే అన్నట్టు పోలయ్య ఎద్దులు రెండు దొర మందలో కలిశాయి.

సుబ్బులు చెప్పింది వినగానే పోలయ్య అలాగే వుండిపోయాడు చాలా సేపటిదాకా. చివరకన్నాడు,

"నిజంగనానె. దొరజెప్పిండని, రాముణ్ని బీముణ్ని తోలుకపోయిండ్లా, అప్పుకింద" నమ్మలేనట్టుగా.

"నేను ఎంత బతిలాడినా యినలే మాఁవా. మనకున్నయి గవ్వేనని, నువ్వు వచ్చేదాకనన్న ఆగమని, నెత్తిల నోరుబెట్టుకుని మొత్తుకున్న."

"ఐతే, దొర నా ఎడ్లను తోలిపిచ్చుకున్నాడులే?" వింత యిన విషయాన్నిలాగ అన్నాడు

"సుబ్బీ, ఈ అప్పు ఎవలే జేసింది?" అదోలాగ అన్నాడు పోలయ్య.

ఆ దించిన చెయ్యి, చేతిలోని అన్నమూ అలాగే వున్నాయి.

సుబ్బులుకెందుకో కాస్తభయమనిపించింది. మెల్లగా జవాబుచెప్పింది.

"మీ అయ్య అని నువ్వే అంటివిగద."

"ఆ, నా పెండ్లిగాక తలికె[1], మా అయ్య దీసుకున్నడే. బతకిన్నాళ్ళు వడ్డీగడుతనే వున్నడు, తిండికి జచ్చినా. నాకు ఆస్తేమీ యిచ్చిపోలే, అయ్య అప్పు నేను తీర్చేదానికి. ఐనా కట్టుకుంటనే వొచ్చిన. ఇయ్యాల ఒక్క నెల వడ్డీగట్టుడు అలిసెమైతే, నా ఎడ్లుతోల్కపోతడులే దొర" తనలో తనే అనుకున్నట్టు ఒక్కోమాట అని, చేతిలోని అన్నం కంచం

1. రైకె - జాకెట్, 2. కష్టాలగడ్డ - వల్లకాడు.

1. పెండ్లిగాక తలికె - పెళ్ళికాక ముందు.

లోకి విసిరికొట్టి, లేచి నిలబడి, దాన్నొక్క తోపు తోశాడు.

"సీయవ్వ. దొరంటే దొరోని లెక్కుం డాలెగానీ, కొంచెపు బుద్దులున్నోడు దొరెట్ల ఐతదే" విసురుగావుంది ఒక్కో మాటా.

ఒక్క ఉదుటున పోయి, మూలనున్న గొడ్డలి చేతిలోకి తీసుకున్నాడు. అది భుజాన పెట్టుకుని—

"ఇయ్యాల బాకీ అన్నపోవాలె, దొరన్న పోవాలె" ఆవేశంగా అంటూ, అడ్డువచ్చిన సుబ్బులును, పక్కకుతోసి బయటకు పరుగు తీశాడు.

* * *

"నిజంగ దొరా, ఏనుగు మేంటెనింగ్ నీకన్న ఎవ్వరికీ తెలవదు" దొర కాళ్ళొత్తు కుంటూ అన్నాడు రాజయ్య.

ఒకసారి చిద్విలాసంగా నవ్వారు దొరగారు మీసాలు మెలేసుకుంటూ.

"కరెక్ట్ అన్నావురా రాజిగా. ఈ యేనుగే కాదు, ఏ యేనుగయినా అంతేరా. మనకు గొప్పకోసం ఏనుగున్న పేరు కావాలె. మరి కూసోబెట్టి పెడితే ఏనుగుకు మదమెక్కుతది. కాదు, దానికి తిండి పెట్టకనే, పనిజేయి స్తే తిరుగబడుతది. అందుకనే పొద్దంతా పని జేయించి, పెట్టేంత తిండిబెట్టాలె. దాని తాత యినా సరే,యిగ మాటాడదు."

దొరగారి పాలసీ నచ్చింది రాజయ్యకు. కానీ ఒకచిన్న అనుమానం వచ్చింది. అది ఏనుగు గురించి కాదు. కానీ మొత్తానికి అలా టిదే.

"ఐతే దొరా, ఎట్లనో, ఎందుకో ఏనుగు మన దగ్గిరున్నది. మనం తిండి పెడుతానం గనుక పనిజేస్తోందో, పనిజే స్తదని తిండిపెడు తానమో పోనియ్యగనీ, నాకో చిన్నదౌటు[1]. ఏందంటే మరి ఎక్కడ్నో అడవిల కష్టపడి తేనెటీగలు, తుట్టిబెడితె మనం దీసుకుంటంగద. అవి మరి ఊకోవుగద. కుడతయి, సచ్చేటట్టు."

"కుడతయి. కుట్టయిమరి, తెలివిలేకపోతె. అందుకే గాదుర తేనె పిండుకునేటప్పుడు ముసుగప్పుకునేది."

అది రాజయ్యకు తట్టనేలేదు. తట్టివుంటే రాజయ్యే దొర అయ్యేవాడు. అందరు దొర లయితే, మరి బాంచెననెటోళ్ళెవరు?[2] అందుకే మరి కాలేదు. కాడు.

ఇంతలో దొర కొడుకు సంతోషంతో గెంతుతూ వచ్చాడు —

"నాయనా, కోడిపిల్లలు పొదిగిందే"అంటూ.

"అన్నిగుడ్లు పొదిగినాదిరా'' అన్నాడు. దొర ఉత్సాహంగా.

"అన్ని పొదిగింది గాని, నాయనా, అసలు గుడ్డు ఉన్నదున్నట్టే వుండి పిల్లెట్లయితదే?"

"ఉన్నదున్నట్టుగాక గుడ్డుకు యీకలొస్తే మనం బీకిపెట్టం. ఇరవైఒక్కరోజులు అట్లనే వుంటది. మచ్చుగుడ్ల మీదికి కండ్లబడది. లోపట్నే పెరుగుతాంటది. ఒక్కసారి పిల్ల ఇవతలికొ సది.'

"ఐతే నాయనా...." ఏదో అనబోతోన్న కొడుకును,

"సువు లోపలికి పోబిడ్డా" అన్నాడు ఏదో కలకలం వినిపించి.

"ఏందిరా ఆ లొల్లి[1]" అన్నాడు, పక్కన కూచున్న రాజయ్యతో.

ఇంతలో పాలేరు పరిగెత్తుకుంటూ వచ్చి, దొరముందు చేతులు కట్టుకుని తలవంచి,

"బాంచెను దొర, గులాపోన్ని[2] దొర. చెపితే తిట్టకుదొర" అన్నాడు వణకుతూ.

"ఎహె కుక్కలకొడకా. ముందుగాల చెప్పేడువు" విసుక్కున్నాడు దొర.

"పోలిగాడు నిన్ను సంపెడానికి గొడ్డలిబట్టు కొనొస్తాండు దొరా'' పాలేరుమాట పూర్తికాక ముందే పోలయ్య దొరముందుకొచ్చి, భుజాన గొడ్డలి పెట్టుకుని నిలుచున్నాడు,

"దొరా" అని అరుస్తూ.

రాజులందరినీ వధించటానికి బయలుదేరిన పరశురాముడిలా వున్నాడు పోలయ్య వీరా

1. దౌటు-సందేహం, 2. బాంచెను-బానిసను.

1. లొల్లి-అల్లరి, 2. గులాపోన్ని-బానిసను.




వేశంతో. అతను దొరకు పోలిగాడిలా కని పించటంలేదు, పులిలా కన్పిస్తున్నాడు. తను పోలిగాడికి దొరకావచ్చు గాని గొడ్డలికి గాదని దొరకు తెలుసు. వెన్నులోంచి వణుకుపుట్టు కొచ్చింది. లేచి నిలుచున్నాడు. కానీ దొరగారి బుర్రలో వెయ్యి వోల్టుల విద్యుల్లత మెరిసింది, హఠాత్తుగా. సర్దుకుని నిలబడ్డాడు.

"ఏందిరా పోలిగా, గొడ్డలేంది. వీరబద్రుని వేశమేస్తానవా ఏంది?" ప్రశాంతంగా అన్నాడు.

"యీరబద్రుడుగాదు. యముడు దొరా" ఆవేశంతో ఊగిపోతూ అన్నాడు పోలయ్య.

"నీకేమన్న పిచ్చిలేసినాదిర. ఇట్లరా కూకో అట్ల. ఎంటో మెల్లగ జెప్పు."

పోలయ్య కూచోలేదు గొడ్డలి దింపలేదు.

"ఇయ్యాటితోని నా అప్పన్న తీరాలి. నీ నూకలన్న తీరాలి. నీయవ్వ."

పోలయ్య మాటలు వింటూంటే దొరకు గుండె దడదడమంటూనే వుంది, కానీ అతి కష్టంమీద సర్దుకున్నాడు.

"ఎడ్ల సంగతార నువ్వనేది. రాజిగాణ్ని గందుకే తిడ్తాన. ఇంతల నువ్వొచ్చినవ్."

దొర మాటలు పోలయ్యకు అర్థం కావటం లేదు అందుకే కాస్త తగ్గాడు.

"ఆ గాడ్డి కొడుకును, నీ పెళ్ళానికి జెప్పి, అడిగి ఎడ్లు దీస్కరారా, బాకీ యిస్తే వడ్డీదేరా అని జెప్తెవాడు నీ ఎడ్లు దీసుకొచ్చిండు."

"ఏంది దొరా" అంటూ గొడ్డలి దింపాడు పోలయ్య.

"నువ్వూరికి బొయిన సంగతి నాకు తెలువ దుర. నువ్వులేని యాళ్ళచూసి నీ అప్పు ఎట్ల అడుగుత ననుకున్నవురా?"

"మరి ఎడ్లు...." నసిగాడు పోలయ్య.

"నీ యవ్వ చెప్పలేనురా. సవారికచ్చరం[1] ఓ ఎద్దు జచ్చె. నీయి మంచి గుంటయని, చెప్పి పట్కరమ్మన్న. వాడుగట్ల జేసిండని ఇప్పుడే ఎరుకై తిడ్తనే వున్న లంజ కొడుకును. ఇచ్చి రమ్మని తోలుతాన[2]. నువ్వొచ్చినవ్."

"గట్లనా దొర?" ఆశ్చర్యంగా అన్నాడు పోలయ్య.

"అరే సువ్వర్[3] చెప్పవేందిరా" రాజయ్య దిక్కు తిరిగి అన్నాడు దొర.

1. సవారి కచ్చరం-సవారీ బండి, 2. తోలు తాన-పంపుతున్నాను, 3. సువర్-పంది.

దొరను రక్షించటమే తన ధ్యేయంగా భావించినట్టు—

"అవునురా పోలిగా" అంటూ దొరచెప్పిన కథనే—మళ్ళీ చెబుతున్నంతలో, దొర లోపలి కెళ్ళి, ఓ కాగితం చేతిలో పట్టుకుని వచ్చాడు.

"కూసోరా, వారీ" ఆప్యాయత కనబరుస్తూ అన్నాడు పోలయ్యతో.

పోలయ్య కూర్చోలేదు. దొరేదిగి, పోలయ్య దగ్గర కెళ్ళాడు.

"ఇగోరా మీ అయ్య రాసిచ్చిన కాయిదం. అసలు మీ అయ్యజేసింది నువ్వెందుకు తీర్చాల్రా. ఏదో, షరాఫత్[1] ఉన్నోనివి గనుక. అసలు యియ్యకున్నా, వడ్డీ గడుతనే వుంటివి. అసోంటిది ఒక్కనెల వడ్డీ గట్ట కుంటే ఏమో ఐందని, ఎల్లలేదని నీ ఎడ్లు తీసుకొస్తాడుర దొర. ఎట్ల అనుకున్నావురా."

పోలయ్యను దొర మంచితనం ఉక్కిరి బిక్కిరి చేస్తూంది. దొరను గురించి పంతులు చెప్పిందంతా నిజమనుకుని తాను చేయబోయిన తప్పుకు అతని హృదయం పశ్చాత్తాప పడ నారంభించింది.

దొర ఆగలేదు.

"ఇగోరా," అంటూ నోటు కాగితం ముక్కలు ముక్కలుగా చించేశాడు. పోలయ్య తదితరులు నోళ్ళు వెళ్ళబెట్టుకుని చూస్తూ నిలుచుండి పోయారు.

"నీయవ్వ యిగనీకు అప్పుపీడ బోయిందిరా, సక్కగ నీ ఎడ్లు తోల్కపో—" ఏదో పెద్దబరువు తీరినట్టు, ఖరోసాగా అన్నాడు దొర.

పోలయ్య ఇహ ఆగలేకపోయాడు, దొర కాళ్ళమీద పడి బోరుమన్నాడు.

"దొరా నీ గులాపోన్ని తప్పు కాయి దొరా. ఏందో అనుకోని, దేవునాసొంటి నిన్ను సంపుదామనొచ్చినా, నన్ను సంపు దొరా, సంపు" అన్నాడు ఆవేశంగా.

"ఓర్నీ ఏందిరా ఇది లే—" అంటూ పోలయ్యను దొర స్వయంగా లేవనెత్తాడు. "నీ కష్టం నా కష్టంగాదుర, నువు అప్పుతోని ఇడ్దైతాంటే నేను మంచి గెట్లుంటరా బిడ్డా" అనురాగం కురిపించాడు దొర.

"దొరా, మా అయ్యచేసిన అప్పు కొడుకును నేను దీర్చకుంటె ఎంత నామర్ద, నీయవ్వ కూడులేక జచ్చినా సరే. అప్పుదీరుస దొరా. నువ్వు కాయిదం జింపినవుగన, నేను మల్ల రాసిస్త దొరా" ఏడుస్తూ అన్నాడు పోలయ్య.

పంతులుంటే అనేవాడు—"నీ అసొంటి ఎడ్డిబాగులోల్లకు దొరబుద్ధి ఎన్నడర్థమైతదో" అనిపించి పంతులుమీద పీకలదాకా కోప మొచ్చింది, ఎద్దులు తీసుకుని ఇంటి ముఖం పట్టిన పోలయ్యకు.

అప్పటిదాకా వెలిగిపోయిన సూర్యుడు పడమరన జారిపోయాడు. అది చూసి, "మళ్ళీ ఎప్పటికో వెలుగు" అనుకుంటుందా పల్లె అన్నట్టుంది చిక్కగా అలముకున్న చీకట్లతో, బిక్కుబిక్కుమంటూ.

1. షరాఫత్ - మంచితనం. 

# ప్రాతో-మలక్ష్య



ఐ.వి.యస్. అచ్యుతవల్లి

సుమన మాట్లాడలేదు. జగన్నాధం చెప్పిన దానిలో సబబువుంది. లోపం ఒక్క నళినిదే కాదు. అతనిది కూడా కావచ్చును. అయినా అదేమిటో తేల్చుకోకుండా ఇంతకాలం వరకు

ఎందుకు వున్నారు? అని అడుగుదామనుకుంది. కాని ఇప్పుడు సమయంకాదు అనుకుంది.

* * *

జిల్లాలోవున్న పంచాయితీ లన్నిటా, వీళ్ళ గ్రామ పంచాయితీ ఉత్తమమైనదిగా ఎన్నికయినందుకు పట్నంలో సభ జరుపుతున్నారు. ప్రెసిడెంట్, ఊరి మనసబా అయిన అర్జునరావు చెప్పటానికి వచ్చేడు. వరాండాలో పేము కుర్చీలు పెద్ద రౌండు టేబులు చుట్టూ వేసివున్నాయి. వరాండాకు పెద్ద పెద్ద స్తంభాలున్నాయి. అటు చివర ఇటు చివర సన్నజాజి తీగలు పైకి పోయేట్లు ప్రాకించారు. వరండా ఆ పొడుగునించి ఈ పొడుగువరకూ సన్నటి వైర్ కట్టి మనీప్లాంట్ ప్రాకించారు. అది దోసెడేసి ఆకులు వేసింది. ఎప్పుడూ వరండాలో చల్లటి గాలివీస్తూ వుంటుంది.

"ఇన్నాళ్ళ బట్టీ-ఈ ఊళ్ళో పుట్టాము. పెరిగాము - ఇది ఇలా వుంటే అందంగా వుంటుంది అని వక్కరికీ తట్టలేదు. నళి నమ్మ దిగింది రంగంలోకి. మనవూరు అన్నిటా పేరు తెచ్చుకుంటోంది. కలక్టర్‌గారు మెచ్చుకున్నారంటే ఆ కీర్తి ఎవరిది!" అన్నాడు అర్జునరావు. వెంకటయ్యా కొడుకు అర్జునరావు. వెంకటయ్యా తాత ముత్తాతలు జగన్నాధరావు తాతముత్తాతల వద్ద పాలికాపుల గావుండే వారట.

వెంకటయ్యా తరం వచ్చేసరికి కాయ కష్టం చేసి, వడ్డు కమిషన్ బేరంచేసి, పది ఎకరాల భూస్వామి కాగల్గాడు. అర్జునరావు కొంచెం సంతకం చేయటం తెలిసున్నవాడు. పెద్ద బాధ్యతగల పనులు అతనికేమీ రావు. పొలంపనులు పాలేర్లని పెట్టి చేయించు కుంటున్నాడు. మోటారు సైకిల్ అత్తవారు కొనిచ్చారు. భార్య వల్ల కూడా మంచి సారవంతమయిన భూమి నాలుగెకరాలు కలిసి వచ్చింది. కొద్దిలో కొద్దిగా ఎదుటి వాళ్ళ మాట వినిపించుకునే గుణం వుంది. అందుకనే నళిని అతనిని పంచాయితీ బోర్డు ప్రెసిడెంట్‌గా ఎన్నుకోమని సలహా చెప్పింది. అతని భార్య చిట్టి తల్లికూడా మంచి ఉత్సాహవంతురాలు. అందువల్ల గ్రామోద్ధరణ కార్యక్రమాలకు ఆ భార్యా భర్తల ఉత్సాహం ఉపయోగపడేది. అందులో అడుగుబడిన బలహీన వర్గాలవారికి బుగతలు కాకుండా తమలో వాడే పంచాయితీ ప్రెసిడెంట్ అయినాడంటే వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్లుంటుంది బూగతల మాటకు యెదురు చెప్పగలిగేటంతటి ఆర్థిక సుస్థిరత వాళ్ళకు లేదు. అలా అని వాళ్ళ యాజమాన్యం అంగీకరించేటంతటి సౌమనస్యమూ లేదు. అర్జునరావు ఏది చెప్పినా వెంటనే చేయటానికి ముందుకు వచ్చేవారు. ఒకరోజు కూలి పనులు మాని రోడ్డు పని చేయమంటే చేసారు. స్కూలు, గ్రంథాలయము, చిన్న పిల్లలకు చక్కని చిన్నపార్కు, ఆడుకుందుకు ఊయల, జారుడు బండ, ఆడవాళ్ళు పుంతల్లోకి వెళ్ళ నవసరం లేకుండా మరుగు దొడ్లు అన్నీ అమర్చుకున్నారు.

మైనరు పంచాయితీ గ్రామాల్లో ఒకటయిన ఈ గ్రామం ఇంత అభివృద్ధి సాధించటం జిల్లా కలక్టర్ గారికే ఆశ్చర్యం వేసింది.

మంచి పనులు చేస్తామంటే ప్రభుత్వం నిధులు మంజూర్ చేయటానికి వెనుతీయటం లేదు. అయినా లక్షలాది గ్రామాలు ఎందుకిలా అంధకారంలో మగ్గి పోతున్నాయి! గ్రామ పెద్దలు ముఠా తత్వాలు, కులంపట్టింపులతో వూరి బాగోగులు పట్టించుకోరు. చదువుకున్న యువకులు, పున్నవాళ్ళు కుర్చీల కంటుకు పోయే ఉద్యోగాలకు ఎగబడుతారు తప్ప ఊరి సంగతులు పట్టించుకోరు. యువకులమాట ఇల్లా వుంటే యువతులు పల్లెల్లో పనులు చేయటానికి సాహసం చూపరు. ఉద్యోగాలు చేసే యువతులంటే ఇంకా ఈనాటికీ మారుమూల గ్రామాల్లో సదభిప్రాయం లేదు. జనంలోకి వచ్చి తిరిగే ఆడవాళ్ళను గౌరవించ గలిగే సాధారణ మన స్థితి గ్రామ వాసులకు లేదు. అందువల్లే, చాలా గ్రామాలు ప్రభుత్వ ధనం ఇంతగా వ్యయం అవుతున్నా చాలా అభివృద్ధి కార్య క్రమాలలో వెనుకబడి వుంటున్నాయి. ఒకనాడు వెంకటయ్యా పనిమీద జగన్నాధరావు ఇంటికి రావలసివస్తే, వరండా మెట్లమీద తల

రామనాథం కూతురు సుమన ఆ వూళ్ళోని మరో రైతు జగన్నాధరావు వైపు ఆకర్షితురాలయింది. జగన్నాధరావు భార్య నళినికీ సుమనకూ స్నేహం కలిగింది. పరస్పరం ఆకర్షింపబడ్డ జగన్నాధరావు, సుమన లభించిన అనుకూల పరిస్థితులలో శారీరకంగా కూడా దగ్గరయ్యారు. నళినికీ, వినతకూ కూడా జగన్నాధరావు, సుమనలపై అనుమానం కలిగింది. తన ఆరోగ్యం చెడిపోవడంతో తన భర్తను చేసుకొమ్మని సుమనను కోరింది సావిత్రి. సుమన అంగీకరించలేదు. వినత ఒప్పుకొంది బావగారిని చేసుకోవడానికి. తనని పెళ్లి చేసుకొమ్మని జగన్నాధరావుని అడిగింది సుమన. జగన్నాధరావు అందుకు సుముఖంగా లేడు.

గుడ్డ పరుచుకుని కూర్చునేవాడు. ఇప్పుడు అర్జునరావు ఒక కుర్చీలో కూర్చున్నాడు. జగన్నాధరావు ఒక కుర్చీలో కూర్చున్నాడు. నళిని ఏదో మాట్లాడుతూ అటూ ఇటూ తిరుగుతోంది.

"మీరు ఇద్దరూ తప్పక రావాలి. మీరు చేస్తోన్న అజ్ఞాతమయిన సహాయం నేను అందరికీ తెలియ చెప్తాను." అన్నాడు అర్జునరావు.

"నా దేముంది! నేనూ ఇన్నాళ్ళూ అంత పట్టించుకో లేదు, నా గృహ నిర్వహణతోనే నాకు సరిపోయేది. మీరంతా కలిసి వచ్చేరు కనుక మన గ్రామం బాగుపడింది. మనగ్రామం పిల్లలు గట్లమ్మటా పుట్లమ్మటా నడిచి పొరుగూళ్ళకు వెళ్ళి అక్షరం ముక్కలు నేర్చుకో నక్కరలేదు. రోడ్డు బాగుపడింది కనుక, హైస్కూల్ చదువుకు సైకిళ్లు వేసుకుని వెళ్ళవచ్చును. ఇంకా స్తోమతువుంటే పట్నంకు మన ఊరుకూ ఒక బస్సు నడుపుకో వచ్చును. నలుగురూ పూనుకుని ఒక బస్సు కొనుక్కుని గ్రామంనించి పట్నానికి నడుపుకుంటే వచ్చిన లాభం నలుగురూ పంచుకో వచ్చును. పిల్లల చదువుల సమస్యలు పరిష్కారం చేసుకున్నాము, ఇంక నలుగురూ పూనుకుంటే ఒక డిస్పెన్సరీ కూడా నడుపుకోవచ్చును. ఒక శుభ్రమయిన హాస్పటల్ వుంటే ప్రజలు ఏమి రోగాలు వచ్చినా పట్నానికి పరిగెట్టి పోవల్సిన అవసరం వుండదు." అంది నళిని.

"మీ ప్రోత్సాహం, సలహావుంటే అన్నీ సమకూరుస్తాము." అన్నాడు అర్జునరావు.

"మునుపువాళ్ళ ఆలోచనా సరళి వేరు. ఇప్పటి తరం ఆలోచనా సరళివేరు. పూర్వం పదియకరాలున్న ఆసామీ, పాతిక యకరాలు చేయాలి. పాతిక యకరాలున్న ఆసామీ యాభయి యకరాలు చేయాలి అని తాపత్రయ పడేవారు. ఎంతకీ మనుమలకూ ముని మనుమలకూ మూట కట్టాలనే ఆరాట పడేవారు. ఇప్పటివారు ఎంతకీ స్వసుఖం చూసుకుంటున్నారు, కన్నపిల్లల కోసమైనా కానీ దాచుదామనే బుద్ధి వుండదు. ఎంతకూ సంచి దులిపేసుకు పోదామనే ఉబలాటం, అందని ఆకాశానికి నిచ్చెనలు వేయటం. కుదేలు అయి పోవటం." అన్నాడు జగన్నాధరావు,

"క్రితం తరంవారికి సంఘ దృష్టి తక్కువగా వుండేది. ఎంతకీ తమ సంసారం బాగోగులే తప్ప ఇతరం వాళ్ళని ఆకర్షించేవి కాదు." అన్నాడు అర్జునరావు.

అతను వెళ్లాక.

"ని కీర్తి దిగంతాలకు వ్యాపిస్తోంది. చూసేవా!" అన్నాడు జగన్నాధరావు.

"సొమ్ము ఒకరిది షోకు ఒకరిది. మీరిచ్చిన స్వేచ్ఛను సద్వినియోగం చేసుకున్నాను. ఆ కీర్తి కాంతకు మూలకారకులు మీరే!" అంది నళిని.

"అఖిల భారత మహిళా సమాఖ్య ఏదో సభలు జరుపుతారట ఢిల్లీలో వెళ్తావా!" అన్నాడు.

ఈ మధ్య ఆంధ్రలో గ్రామీణ మహిళా మండలి సమావేశాల్లో చాలా చోట్ల పాల్గొంది నళిని. అందువల్ల ఆమె పేరు ఢిల్లీ వరకూ ప్రాకింది.

"వెళ్తాను. అక్కడ మా సభ వున్నది. నన్ను తప్పక రమ్మనమని వ్రాసింది. ఒక వారం పది రోజులుండి, ఆ చుట్టుపక్కల చూడ వలసినవన్నీ చూసి వస్తాను." అంది నళిని.

"ఎంతకీ నువ్వు వక్కర్తివే వెళ్తాను అంటావు కాని నన్ను ఎక్కడికీ రమ్మన మనవేం?" అన్నాడు.

ఆ ప్రశ్నకు చకితయైంది నళిని. ఇన్నేళ్ళ బట్టీ సంసారం చేస్తున్నారు. ఎప్పుడూ ఇక్క డకు వెళ్ళుదాం అక్కడకు వెళ్ళుదాం అనే ఉత్సాహం అతనిలో ఎప్పుడూ చూడలేదు. సుమన స్నేహం వచ్చేదాక అతను ఒక చీర కూడ తనకై తాను నళనికి ప్రేమతోకొని తెచ్చి నది లేదు. చేతినిండా డబ్బువున్నా, మనస్సు నిండా ప్రేమ, అనురాగం లుప్తమయి ఎండిన ఎడారిలా వుండేది జీవితం. అలా అని అసహ్యం లేదు. కోపం లేదు. వైవాహిక జీవితం అంతా నిరామయంగా గడిచిపోయింది. అందం, చదువు, ఆకర్షణ, ఆర్థిక సుస్థిరత ఇవి అన్నీ నళిని జీవితం సుఖంగానే గడుస్తుం దనుకోవటానికి నిదర్శనాలుగానే వున్నాయి. కాని అంతా కరిమింగిన వెలగపండు మాదిరి జీవితం అయింది. అయినా ఆ అసంతృప్తి ఎన్నడూ వెళ్ళ బుచ్చలేదు, ఎవరిముందూ నళిని.

"మీరు ఎప్పుడూ ఎక్కడికీ ప్రయాణం కారు. మీకు తిరగటం నచ్చదేమో అని అడగ లేదు." అంది నళిని.

"నాకూ ఈ ప్రయాణాలూ అలసట అంటే ఇష్టం వుండదు. దరిచేరిన కెరటంలా ఈ ఇంటినీ వంటినీ కనిపెట్టుకుని వుంటాను." అన్నాడు.

"నాకు తిరగటం అంటే ఇష్టం వుంటుం దను కున్నారా! జస్ట్ ఫర్ ఎ లిటిల్ ఛేంజ్ అల్లా వెళ్ళివస్తూ వుంటాను. సంవత్సరంలో ఒకనెల హాలిడేగా గడపగల్గితే మిగత పదకొండు నెలలూ ఈ మధుర స్మృతులతో ఎంతటి కఠిన మయిన సమస్యల నయినా ఎదుర్కొగలిగే మానసిక స్థితికి తగివుంటారు. అసమానూ ఇల్లు వదిలి తిరగటం కాదు. వేసవికాలం ఆర్థిక స్థితివున్న వాళ్ళు ఏదయినా హిల్ స్టేషన్‌కు వెళ్ళి కులాసాగ కాలం గడవగల్గటం తప్పేమీ కాదు.." అంది నళిని. జగన్నాధరావు మాట్లాడలేదు.

నళిని ఢిల్లీ ప్రయాణం దగ్గరకు వస్తూన్న కొద్దీ జగన్నాధరావుకు గుండెల్లో ఏదో చెప్పుకో లేని గుబులుగా వుంటోంది. సుమనని కలుసు కున్నా మునపట్లా శరీరంలో వేడి పుట్టుకు రావటంలేదు. సుమనని చూస్తూన్న కొద్దీ "టైం బాంబు" గుర్తుకు వస్తోంది. నువ్వు నాకేమీ వద్దు నీ దారి నువ్వు చూసుకో అనే టంతటి నీచత్వం లేదు. నలుగురిముందూ అవమానం సహించి సుమనకు, భార్యాత్వం ఇచ్చే టంతటి ధీరత్వం లేదు, తెలిసి తెలిసీ చల్లగా హాయిగా గౌరవంగా సుఖ ప్రదంగా జరిగిపోయే సంసార నౌకను తిమింగలానికి ఎదురుగా నడిపినట్లు చేసుకున్నాడు. ఏ మింగలం తోకతో విసరే విసురుకు ఈ నౌక సహస్ర శకలాలు అయ్యేటందుకు ఏ క్షణాని కాక్షణమే ఎదురుచూస్తున్నట్లుంది. ఇది మామూలు దారి లోకి రావటానికి చాలా కొంచెం అవకాశం, అదీ ఏదోవక అద్భుతం జరిగితేనే వుంది, అనుకున్నాడు మనస్సులో. "భగవంతుడా ఒక సచ్చింతన, మంచి మార్గం నాకు చూపించు నేరమే చేశాను, దోషమే చేశాను కాని నన్ను మనిషిగా నిలబెట్టు." అంటూ పదేపదే మననం చేసుకోవటం మొదలు పెట్టాడు.

నళినిలో ఏదో నూతన ఉత్సాహం ఉరకలు వేస్తోంది. ఇన్నాళ్ళు ఈ మేడ, అంతఃపురం లోని మహారాణిలా తనను దాచుకుంది. తనే మిటో తనకి తెలియకుండానే పది సంవత్స

రాలు వైవాహిక జీవితం గడిపేసింది. ఏదో తెలియని వింతకదలికతో వూరి బాగోగులు చూడాలని నలుగురితో రాసుకు పూసుకు తిరగటం మొదలు పెట్టింది. తన చుట్టూ ఇంత జనం పోగవుతారని తను ఊహించలేదు. ఒక మంచిపని చేసినా, చెడుపని చేసినా నలుగురి దృష్టి ఒకచోట కేంద్రీకృతం అవుతున్నదన్న విషయం నళినికి అనుభవంలోకి వచ్చింది. అంతఃపుర జీవితం, సాంఘిక భద్రత నిచ్చింది అనుకుంది. అంతకన్న ఎక్కువగా సాంఘిక జీవనం, తనకి సామాజిక ఉన్నతిని చేకూర్చి పెట్టింది. ఇంత మంది జనం తన వెనుక వున్నారు. ఇప్పుడు నళిని ఒక అమ్మగారు! ఇప్పుడు, అమ్మగారిమీద ఈగవాలితే దయ్యమల్లె ఈగను పీక్కు తింటానికి రెడీగావున్నారు ఆ ఊరి జనం! పుట్టినింటికీ మెట్టినింటికీ ఖ్యాతి తేవాలి ఆడది! ఎప్పుడూ నాలుగు వెంపులా తన మనుగడకి తగిన ప్రాతిపదిక చూసుకుంటూ నడవాలి ఆడది! ఆడవాని జీవన యాత్రలో అడుగడుగునా ఎన్నెన్నో ముళ్ళుగుచ్చుకుంటూ వుంటాయి. ఆ ముళ్ళని జాగ్రత్తగా నొప్పి కలగకుండా తీసుకోగలగాలి. దానికి చాలా నిశితమైన పరిశీలన వుండాలి. పూలల్లాంటి వాళ్లు ఆడవాళ్ళు! పూల సున్నితముతో పోల్చారు ఆడవాళ్ళని! అంత మృదువయిన వారా స్త్రీలు! మృదుత్వానికి ప్రతీకలనా స్త్రీలని పూల సుకుమారులు అన్నారు! పూల తోటలకు ముళ్ళ కంచెలు వేస్తారు, రక్షణకు! కాని ఆ కంచెల మీదకు వాలిన పూల రెమ్మలను ముళ్ళ కంచెలు నిర్దాక్షిణ్యంగా చీల్చేస్తాయి! అల్లాగే పూవుల్లాంటి కన్నెలని కట్నకానుకలతో జీవితం అంతా రక్షగా వుండమని పురుషులచేతుల్లో పెడుతారు. రక్షకులే భక్షకులయితే ఇంక ఆ స్త్రీ జీవితం ఎల్లా వుంటుంది! నందనవనంలో దేవ పారిజాతంలా సుమ సౌరభాలు విరిసే జీవితం అనేక రకాలయిన వేసటలతో విసిగిపోవటం ఎంత దురదృష్టకరం? నళినికి జనం తనని అభిమానించటం

నూతనోత్సాహాన్ని, చైతన్యాన్ని కలిగించినా ఏ జనం తనని ఆరాధ్య దైవంగా కొలుస్తున్నారో, ఆ జనం ఆసరానే తనుకోరి, జగన్నాధాన్ని నలుగురిలో అవమాన పరిచి, తను మిగిలిన జీవితం-డిఫీటెడ్ లేడీగా గడపటం సుతరామూ ఇష్టం లేదు. అందువలనే ఈ ఢిల్లీ ప్రయాణము తన జీవితంలో మరో ముఖ్యమయిన మలుపు కావాలని కోరుకుంటోంది. అందుకనే ఆమెలో ప్రయాణం దగ్గరికి వస్తున్నకొద్దీ, తన పని వాళ్ళు, జగన్నాధరావు అంతా ఎంతో అపురూపమయిన వ్యక్తుల్లా విపరీతమయిన అభిమానం కలగసాగింది. నళినిలోని ఉత్సాహం చూస్తున్న కొద్దీ జగన్నాథరావుకి నీరసంకలగ సాగింది.

*　　*　　*

సుమనకు ఆశ్చర్యం కలుగుతోంది. జగన్నాధరావుతో తన సంబంధం నళిని గుర్తించిందో లేదో తన ఊహకు అందటంలేదు. నళిని కాన్ఫరెన్స్‌కి వెళ్తున్నదని మహిళామండలి వారు మీటింగ్ ఏర్పాటు చేసారు. మంచీ చెడ్డ అన్నీ మెంబర్లు అందరితో కలసి మాట్లాడుకుని ఇంటికి వచ్చేసరికి పదకొండు దాటింది. ఈరోజు సుమనని ఎందుకనో వదలకుండా కూడా కూడా తిప్పుకుంటోంది. కారు ఇంటి ముందరి పోర్టికోలో ఆపేసరికి ఇంక వుండబట్టలేక—

"చాలా రాత్రయింది. ఇంటికి పోతాను." అంది సుమన. కారుదిగి డోర్ లాక్ చేసి క్షణం ఆలోచనగ నించుంది నళిని.

"ఇంత రాత్రి వెళ్లిపోవట మెందుకు? భోజనంచేసి రెస్టు తీసుకుందువుగాని. ఉదయం వెళ్ళచ్చులే" అంది. సుమనతో కలిసి డైనింగ్ టేబులు వద్ద హాజరయిన నళినిని చూసేడు జగన్నాధరావు.

"ఇంత రాత్రిదాకా మీ మహాసభ జరుగుతూనే వుందా?" అన్నాడు,

"సభ కాదు. ఏదో ఊసుపోక కబుర్లతో కాలం గమనించలేదు." అంది నళిని. సుమన మౌనంగా తలవంచుకుని భోజనం చేస్తూంది. పదార్థాలు చాలామటుకు చల్లారి పోయినాయి. జగన్నాధరావు ఎనిమిదింటికే భోజనం చేసేవాడు. భార్య వంటరిగా తినాల్సి వుంటుందని రీడింగ్ రూంలోంచి తిరిగివచ్చి టేబుల్‌ముందు కూర్చున్నాడు.

"అన్నీ చప్పగా చల్లారిపోయినాయి." అంది రాజమ్మ వంటకాలు చల్లారి పోయినందుకు నొచ్చుకుంటూ. నళిని భర్తవైపు చూసి నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నావ్?" అన్నాడు.

"రాజమ్మ చాలా అమాయకురాలు. వంటకాలు చల్లారి పోయినందుకు చాలా కించపడుతోంది. ఒక్క రోజుకి ఎల్లా తింటే యేం? ఇంట్లో వున్నప్పుడు వేడి వేడివి తినలేదా?"

"కాదు తెల్లవారి నీవు వెళ్ళిపోతున్నావు కదా? అన్నీ నీ కిష్టమయినవి చేసింది. కాని అన్నీ చప్పగా చల్లారిపోయి, వాటివాటిరుచుల్ని పోగొట్టుకుని వుంటాయి." అన్నాడు.

"ఇష్టమయినవి రుచుల్ని పోగొట్టుకున్నంత మాత్రాన్న తినకుండా వుండలేను. నాకు ఎంతో ఇష్టమయినవి చెడిపోయినా ఫరవాలేదు. వాటి మీది మమకారం చంపుకోలేను" అంది నళిని. సుమన వాళ్ళ సంభాషణలో పాల్గొనటలేదు. జగన్నాధరావు చాలా అనీజీగా ఫీలవుతున్నాడు. సుమన లేకుండా వుంటే సుమన విషయం నళినితో చెప్పుదామనుకున్నాడు. సుమన ఎదురుగా తమ విషయం నళినితో చెప్పి ఘర్షణపడటం చాలా అవమానకరంగా వుంటుంది అనుకున్నాడు. అయినా ఇన్ని రోజులులేని తొందర ఇప్పుడెందుకు? పదిరోజుల్లో నళిని తిరిగి రానేవస్తుంది. అప్పుడే నెమ్మదిగా అన్ని సంగతులూ చర్చించుకోవచ్చును అనుకున్నాడు.

భోజనాలు అయాక, సుమనను తనతోకూడా తన బెడ్‌రూంకి తీసుకువెళ్ళింది. జగన్నాథరావు పడుకున్నే మంచంమీద ప్రక్క దులిపింది. సుమన టేబులుమీదవున్న వక్కపొడి భరిణతీసి కొంచెం వక్కపొడి తనునోటిలో వేసుకుని కొంచెం నళినికి ఇచ్చింది. నళిని దోమ తెరపైకి ఎత్తిపెట్టి మంచం నడుంగా




ఖాసిం పట్టువేసుకుని కూర్చుంది.

"మీకు నిద్రరావటం లేదా?" అంది సుమన మంచంమీద ఒత్తిగిలి ఒంపుగాపడుక్కుంటూ.

"తేలిపోయింది. చూడు సుమనా! నువ్వు స్కూల్‌పనే కాకుండా అప్పుడప్పుడూ ఇంటికి వచ్చి ఇంటిలో రాజమ్మకు కూడా ఏమయినా సలహాలు ఇస్తూవుండు. ఆయన సంగతి చూస్తూనే వున్నావుగా! ఏమీ పట్టించుకోరు. అసలు నువ్వు, నేను వచ్చేదాక ఇక్కడే వుంటే నయం. స్కూల్ విషయాలు, ఇంటి విషయాలు చక్కదిద్దుకోవచ్చును." అంది నళిని. సుమనకు ఆశ్చర్యం కలుగుతోంది. నళినికి జగన్నాధరావుగారు తమ సంగతి చెప్పేడా? లేక కేవలం సహాయంచేసే ధోరణిలోనే అంటోందా? సుమన నళిని ముఖంలోకి గుచ్చిగుచ్చి చూసింది, నళిని అంతరంగం కల్లోలిత సాగరంలా వుంది. అయినా పైకి చాలా శాంతంగా తనకి అసలు ఏమీ తెలియదన్నట్లుగా వుంది. ముఖంలో కించిత్తు ఈర్ష్యాసూయల జాడలులేవు. అదే స్నిగ్ధదరహాసం.

"ఏం మాట్లాడవు?"

"ఇన్ని బాధ్యతలు అప్పచెప్పేస్తున్నారు? ఎన్ని రోజులు కాంపు వేద్దామని వుంది?" అంది సుమన.

"అసలు వుండే పని రెండు రోజుల్లో తెమిలిపోతుంది. ఆగ్రా అవీ చూడాలనివుంది. ఢిల్లీలో చాలామంది బంధువులున్నారు.అందర్నీ కలుసుకుందామని వుంది. చాలామందిని నేను, చిన్న పిల్లగా వుండగా చూసేను. ఇప్పుడు ఆనమాలు పట్టుతారో లేదో?"

"చప్పున తెమిలి రండి. ఇన్ని పనులు నేను సమర్ధవంతంగా నిర్వహించలేను. మీతో చెప్పుదామనుకుంటూనే అశ్రద్ధ చేస్తున్నాను. స్కూల్ కరస్పాండెంట్‌గా కూడా నేను వుండను, మీరు వచ్చేక ఇంకొకరికి ఈ బాధ్యత అప్పచెప్పాలి మీరు." అంది సుమన.

"అదేం?"

"ఏమీ లేదు.నా మనస్సు కుదురుగా వుండటం లేదు. మనోనిశ్చలత లేనప్పుడు విధి సక్రమంగా నిర్వర్తించలేము."

"జీవితం ఏమి చూసానని నీ కప్పుడే మనోవైకల్యం సంభవించింది?"

"నేను చెప్పలేను. ఇంక ఉద్యోగంమటుకు చేయలేను."

"పూరికేకూర్చుని ఏమిచేస్తావు? పోనీ ఇంకా చదువుకుంటావా?"

"చదవ బుద్ధి పుట్టటంలేదు. నాలుగేళ్ళు డిస్కంటిన్యూ చేసినాక తిరిగి పుస్తకాలు చదవాలంటె బుర్రకి ఎక్కటంలేదు."

"ఏదో వక వ్యాపకం వుండాలి. బద్ధకం వుండకూడదు."

"అనవసరమయిన ఆలోచనలతో పదిసంవత్సరాలు చాలా దీర్ఘంగా రాళ్ళల్లా గడిపాను జీవితాన్ని. ఈ స్కూలు పని పెట్టుకున్నాక వకదాని తర్వాత వకటిగా ఎన్నెన్నో పనులు నేను చేయగలిగినవి కనిపించుతున్నాయి. మునుపు రోజు ఒక సంవత్సర కాలంలా ఉదాసీనంగా గడిచేది. సంవత్సరం ఒక క్షణంలో నడుస్తూంది ఇప్పుడు. ఈ చైతన్యం మనలో ఎండిపోకూడదు. చాలా చిన్నదానివి. అప్పుడే నీకు నిరాసక్తత కలగకూడదు." అంది నళిని.

"జీవితం వడ్డించిన విస్తరి అయింది మీకు? కడుపునిండినతల్లి కబుర్లు ఇల్లాగే వుంటాయి." అనుకుంది మనస్సులో సుమన, పైకి అనలేదు. పైకి అంటే దానికి జవాబు నళినివద్ద సిద్ధంగానే వున్నది.

ఉదయం సుమన లేచేసరికే నళిని ప్రయాణానికి రెడీగా వుంది. సుమన ఆదరా బాదరాగా ముఖం కడుగుకుని కాఫీ తీసుకుని వచ్చింది.

"నువ్వుకూడా స్టేషన్‌దాకా వస్తావా!" జగన్నాధరావు నళిని వేపు ఇబ్బందిగా చూసేడు. ఇరవయి నాలుగ్గంటల ముందునించి నళిని వంటరిగా జగన్నాధరావుగారికి దొరకటంలేదు. ఎందుకని? జగన్నాధరావు మనస్సులో చాలా కించపడ్డాడు. సుమన చప్పున తయారయి వచ్చింది. కారులో భార్యాభర్తలు ముందుసీట్లో కూర్చున్నారు. వెనకాతల సుమన కూర్చుంది.

"జీవితం అంతా ఇల్లా వీళ్ళ వెనకాతల ప్రయాణం చేయవలసిందేనా? అందరూ తననేదో వింత మృగాన్ని చూసినట్లు చూస్తారు. మానసికంగా జగన్నాధరావు నళినిని కోరుకున్నా కోరుకోకపోయినా, బాహాటంగా నళినిని వద్దనుకునే సాహసం జగన్నాధరావు చేయలేడు. క్రమక్రమంగా వయస్సులోని వరవడి తగ్గగానే తనంటే చికాకుకూడా కలగవచ్చును. అప్పుడు తను నళిని ముందు జగన్నాధరావు గారి ముందు అపరాధివలె సంచరించాలి. రాజమ్మకు తనకు తేడావుండదు? తొలి వలపుకు ప్రతిగా తాను పొందగలిగినది, అదేనా వళ్ళు జలదరించింది సుమనకు. అవ్యక్తమయిన భయం వెన్ను పూసగుండా నరం నరంకూ ప్రాకింది. కళ్ళు చెమరించాయి.

ట్రయిన్ కదుల్తుండగా అల్చిప్పలాంటి ముఖంతో ఆర్ద్రమయిన కళ్ళతో ప్లాట్‌ఫారం మీద నిలబడిన సుమనని చూస్తే జాలి వేసింది నళినికి. సుమన చేయి పుచ్చుకుని మృదువుగా నిమిరింది నళిని.

తిరుగు ప్రయాణంలో కూడా వెనుక సీటులోనే కూర్చుంది సుమన. జగన్నాధరావుగారు ఫ్రంట్ సీటులోనికి రమ్మని సుమనని అనలేదు. ఇంటివద్ద డ్రాప్‌చేసేసి తన ఇంటికివెళ్ళిపోయేడు. సుమన నవ్వుకుంది తనలో, భార్య వెళ్ళిందని బెంగగా వుంది కాబోలు మానవుడికి? ఏం మగవాళ్ళు? ఆమె ఇంటికి దీపంలా ఇంటిలో మసలుతూన్నన్ని రోజులూ నళిని ఒక అభిమానించదగ్గ యువతిలా కనపడలేదు కాబోలు. ఇప్పుడు దిగులంతా ముఖంమీదే పెట్టుకుని చిటపటలాడుతున్నాడు, అనుకుంది సుమన.

"అయ్యాయా రాచకార్యాలు? ఇల్లు గుర్తుకు వచ్చిందా!" అంది శాంతమ్మ పాలచెంబు తీసుకువస్తూ. సుమన మాట్లాడలేదు. మౌనంగా మేడ ఎక్కి తన గదిలోకి వెళ్ళింది. ఈ మధ్య శాంతమ్మ ఏమన్నా సణుగుకోవటం ఎక్కువ చేసింది. ఆవిడకి సణుగుడు అలవాటు. అయిన దానికీ కాని దానికీ అన్నట్లుగా సుమన పట్టించుకోవటం మానేసింది. శ్రీనివాసు శాంతమ్మ కొంగు వెనకాతల అమ్మకూచిలా తిరుగుతూ వుంటాడు. తల్లి ఏమంటే దానికి తాళంవేస్తాడు. ఖరీదయిన బట్టలు వేసుకోవటం, పట్నంచుట్టూ షికార్లు తిరగటం, సుమన ఏమయినా అంటే వితండవాదం వేసుకు కూర్చోవటం.

సుమనకు తన ఇంటి వాతావరణం ఏమీ

నచ్చటంలేదు. చీటికీ మాటికీ తనేదో కావాలని ఇల్లు పట్టకుండా తిరుగుతూన్నట్లు తల్లి దెప్పుతూంటె విసుగెత్తిపోతోంది. జగన్నాథరావు ఆలోచన చాప క్రింద నీరులా వుంది. ఎప్పటికి తను ఒక తీరం చేరుకునేటట్టు? వుట్టినే వుండకుండా ఉద్యోగం అంటూచేస్తూ నాలుగయిదు వందలు తెచ్చి దోసిట్లో పోస్తూన్నా, తల్లికి తనంటె చులకనభావం ఎందుకు కలుగుతుంది? ఒకప్పుడు వినతకు చదువు వంట బట్టదని పల్లెటూరు మోటుపనులు చేస్తూ కాలం గడిపేస్తుందని తల్లి తండ్రులు అనుకునేవారు. అది ఇప్పుడు పెద్ద ఇల్లాలయి పోయింది. తనంటె పట్నంలో వుండి చదుపుకొంటూందని ఎంతో విలువగా చూసేవారు. ఇప్పుడు వాళ్ళకి తను మోయరాని బరువుగా కన్పడుతోంది. ఇల్లా ఆలోచనల్లో సతమతమవుతూ తన మంచం మీద జేరబడింది సుమన. ఈ ఆలోచనల్లో ఎదురుగ్గా ఇంకో మంచంమీద ముసుగులోవున్న మనిషి ఎవరా అని చూడలేదు. అల్లానే చాలా సేపు ఎదురుగ్గావున్న పెద్ద కిటికీలోంచి దూరంగా నీలాకాశం కన్పడకుండా వత్తుగావున్న కొబ్బరి మట్టలని జూస్తూ కూర్చుండిపోయింది. వాళ్ళ ఇంటి కావల పెద్ద కొబ్బరితోట లున్నాయి. అవి పొట్టీ పొడుగూగా ఎదిగి ఆకాశపు నీలం రంగు కన్పడకుండా పచ్చని ఆకులతో వేసిన పెళ్ళి పందిరిలా చేస్తున్నాయి. సాయంకాలం ఉదయం పూట లేత నారింజ రంగు కాంతులు కొబ్బరి ఆకుల మధ్యనుంచి మెరుస్తూ కనపడుతాయి. చిన్నప్పుడు ఆ ఆకులన్నీ అంటుకుపోయి మండిపోతాయేమో అని భయపడేది సుమన. పది పన్నెండేళ్ళు వచ్చేసరికి అరుణోదయ కాంతుల్ని ఆనమాలు పట్టటం వచ్చింది. పచ్చని పచ్చికొబ్బరి ఆకులు, ఆకాశంలో ఎల్లా అంటుకుపోతాయి? తన చిన్నప్పటి నిష్కారణ భయం గుర్తుకు వచ్చి నవ్వుకుంది సుమన. ఎన్నెన్ని ఆలోచనలు! ఒకప్పుడు ఆలోచన భయం కలిగిస్తే, అదే ఆలోచన కాలం గడిచినప్పుడు నవ్వు పుట్టిస్తోంది! కారణం! అనుభవం పెరిగిన కొద్దీ, అనుభవంయొక్క అనుభూతి తాలూకు స్పందన సాంద్రత తగ్గిపోతుంది. జీవితంలో కష్టం కాని, సుఖం కాని, ఏ అనుభూతి అయినా జీవితాన్ని స్పర్శించేది స్వల్ప కాలమే!

"హాయ్ సుమ్మీ! కన్వాశ్రమంలో శకుంతల వలె వున్నావేమిటే!" అంది వినోద. ముసుగు తీసి అర్ధగంటనించి సుమనని పరిశీలించుతోంది. సుమన ఉలిక్కిపడి వినోదనిచూసి నవ్వేసింది.

"ఏమిటి! ఎప్పుడు ఎల్లా ఎక్కడ్నించి, రాక!" అంది వినోదని జూసి సుమన తను మొనాటనీనుంచి బయటపడ్డాను భగవంతుడా అని సంతోష పడింది.

"స్పుత్నిక్‌లా తిరుగుతున్నాను. జనక్‌రాం, శ్రీకాంత్‌కూడా వచ్చేరు. ఖాళీగా వున్నాను కదా అని వాళ్ళతో నేనూ బయలుదేరాను." అంది వినోద

"ఏరీ! వాళ్ళు!"

"శ్రీనివాస్ వాళ్ళూ పట్నం ఉడాయించేరు"

"చల్ ఉడ్ జారే పంఛీ! మరి తమరో!"

"నేను ఎంత చెడ్డా ఆడదానిని కదా! నీ కోసం వుండిపోయాను, కష్టం సుఖం మాట్లాడుకుందామని" అంది వినోద.

"వినో! నువ్వేమీ మారలేదే! ఎంత జాలీగా వున్నావు! నువ్వు వుంటే యెంత సరదాగా హాయిగా గడిచి పోతాయో రోజులు." అంది సుమన.

"ప్చ్! ఇదంతా నా ఖర్మ!" పెదవి విరిచింది వినోద.

"ఏం?" విసుక్కోయింది సుమన.

"నన్ను ఇంత ప్రేమించే దానివి, ఆడదానివి కావటం నా పూర్వ జన్మ ఖర్మ కాకపోతే ఏమిటి? నువ్వే మగవాడివి అయితే చక్కగా ఇద్దరం చిలకల్లా సంసారం చేసుకుందుము."

"ఓసి ఇదా! చిలకల్లా కాదే. చిలకా గోరువంకల్లా అంటారు, పచ్చగా కలకల్లాడుతున్న సంసారుల్ని."

"ప్చ్! చిలక గోరువంక బాగుండవే! చిలకమ్మ పచ్చగా ఎఱ్ఱటి ముక్కుతో సింగారంగా వుంటుంది. గోరువంక ఏం బాగుంటుంది!

పల్లగా అసహ్యంగా! మన కవులకు, యతులు ఏవో కుదిరాయి కాబోలు దానితో చిలకా గోరు వంకా అంటూ మనకు నాలుగుదస్తాలు కవిత్వం వ్రాసి పడేసారు. మనం ఆ యతుల్నే మతులు లేకుండా వాడుకుంటున్నాం, స్వయంగా ఆలోచన చేయకుండా!"

"....ఊఁ సరే! దానికేం గాని ఇప్పుడేం చేద్దాం,"

"ఏదీ నేను ఇంకా లేవలేదు కదా! మహా బద్ధకంగా వుంది. సాయంకాలం ప్రొగ్రాం నువ్వే ఆలోచించు. నీ అడుగుజాడల్లో నడవడానికి నేను రెడీగావున్నామ." అంది వినోద.

"సర్లే! క్రిందికి పద. మీరు వచ్చినట్లు అమ్మ చెప్పనే లేదు చూడు!" అంటూ లేచింది సుమన.

"నువ్వేమిటే మరీ గైర్ హాజర్ అయిపోతున్నావు! ఇల్లన్నాక చుట్టం పక్కం వస్తూవుంటారు. నలుగురు వచ్చి పోయే కొంపలో పెళ్ళి కావాల్సిన అమ్మాయిలు 'నైట్ అవుట్' చేసేస్తూవుంటే ఆ కొంపకి పరువు ఏమయినా మిగిలుంటుందా!" అంది పెద్ద ఆరిందాలాగ. సుమన పకపకా నవ్వింది. చాలా రోజులకు సుమన మనస్సు ఉషోదయంలో మంచు బిందువుల సున్నిత స్పర్శకు అలవోకగా రేకులు విప్పి, బద్ధకంగా ప్రకృతిని చూస్తూన్న లేత గులాబీమొగ్గలావుంది.

"ఎందుకా నవ్వు?" అంది వినోద, హాండ్ బాగ్‌లోంచి టూత్ బ్రష్ మీద పేస్టు వేసుకుంటూ.

"నీ కళ్ళకు నేనింకా పెళ్ళికాని అమ్మాయిలానే కనపడుతున్నానా!" వినోద చప్పున సుమన ముఖంమీద దృష్టి నిలిపింది.

"సుమ్మీ!"

"ఊఁ."

"ఏమంటున్నారు, మీ నాధులుంగారు! ఎన్ని జాబుల్లోనో వ్రాస్తున్నాను. అవిషయం దాచేస్తున్నావు. నళిని ఏమంటోంది! ఈ మధ్య ఊరు మరామత్తు మొదలెట్టింది అని మన శ్రీనివాస్ చెప్పాడు. డబ్బు ఎడాపెడా ఖర్చు చేస్తోందిట కదా! ఊరు మంది జనం ఆమె వెంట తోకలు ఆడించుకుంటూ తిరుగుతున్నారుట నిజమేనా!"

"నిజమే...."

"జగన్నాధులవారు ఆమెకి పూర్తి స్వేచ్ఛనిచ్చినట్లున్నారు."

"ఆయన అందరినీ స్వేచ్ఛగా వుండమంటాడు. స్వేచ్ఛ అంటే భయపడి వినగెత్తిపోయిన వాళ్ళు బందీగా వుండాలని ఊలాట పడుతోంటారు."

"ఇంతకీ నీ స్థానం ఏమిటి అక్కడ!"

"ఇంకా పరస్థానమే."

"మైగాడ్! ఇన్నాళ్ళకీ, నీ కథ అఁ అంగుళమన్నా కదల లేదన్నమాట!"

"నేనే కదలనివ్వటం లేదు ఇన్ని రోజులూ! ఇంక కదలటం మాటేమిటి! పరుగులు పెట్టిస్తాను చూడు," అంది సుమన.

"యూ బ్రేవో! అల్లాగ జి. యన్. టి రోడ్డులోకి రానియ్యి రథాన్ని. ఎన్నిరోజులని పల్లెటూరు గతుకుల రోడ్డుమీద, గాడిదసవారీ చేయిస్తావు! పూల రథంలాంటి జీవితాన్ని!"

"చూస్తావుగా!"

"చూడను. వింటాను!" నవ్వింది వినోద.

* * *

సుబ్బలక్ష్మి సుభా గౌతం క్రింద మారినా నళిని పట్ల చిన్నప్పుడులా ఒక గొప్పింటి పిల్ల అనే గౌరవం పోలేదు. అందుకనే నళిని టెలిగ్రాం చూస్తూనే ఎగిరి గంతులు వేయసాగింది.

"ఏమిటి? అంత ఉషారుగా వున్నావు" అన్నాడు గౌతం.

"మా నళిని వస్తున్నానని టెలిగ్రాం ఇచ్చింది."

"ఎవరూ?" అన్నాడు గౌతం.

"అప్పుడే మర్చిపోయేరా! సోమనాధంగారి అమ్మాయి. మీరు బి.ఎ. చదువుతూండగ తను ఇంటరు చదివేది."

"ఓ! చాలా పచ్చగా మెరుపు తీగలవుండేది."

"అదే వద్దంటాను, మిమ్మల్ని!"

"ఏమిటి?"

"నా ఎదురుగా ఇంకో స్త్రీని వర్ణించటం."

"ఏం వర్ణించాను? ఆవిడ ఎలావుండేదో చెప్పాను. నాకే కనుక కవిత్వం వస్తే "ఇన్సాన్ బన్ గయీ హై కిరణోఁ మాహతాబ్‌కీ, అబ్ క్యా మేసాల్ దూఁ హై తుమాహరీ షబాబ్‌కీ" అంటూ పొడగల్గేవాణ్ని!"

"అంటే మీకు చాలా జ్ఞాపకం వున్నదన్న మాట!"

గౌతం చప్పున సుబ్బలక్ష్మి ముఖంలోకి చూసాడు చిలిపిగా నవ్వుతోంది,

"సుభా! నేనొకమాట చెప్పనా!"

"ఓ! ఒక్క మాటేమిటి లక్ష మాటలు వింటాను."

"వెన్నెలని మరిచి పోతామా! గులాబీలని మర్చిపోతామా! ఎండాకాలం, సాయం కాలాలలో సముద్రపు తీరప్రాంతపు గాలిని మర్చిపోతామా! మనం మనుష్యులం. ఎంత రసానుభూతిలేని మనుష్యులయినా అందమయిన సంఘటనలకు చలించక మానరు. ఆర్ద్రితవున్న మనుష్యులు వాగ్దేవి కరుణవుంటె అందమయిన మాటలలో తను భావములను వ్యక్తపరుస్తారు. లేనివాళ్ళు "చాలా బాగుంది ఎంత హాయిగా వుందో!" అనేసి వూరుకుంటారు. స్పందన అనేది జీవలక్షణం!"

"అయితే మిమ్మల్ని నళిని అందం కదిలించేదన్నమాట!"

"నన్నేకాదు, మొత్తం మా కాలేజీ విద్యార్థులందర్నీ నిలబెట్టేది. మాకు ఆమె నేదో చేయాలనే ఉద్దేశ్యం కలిగేది కాదు. దేవాలయంలో దీపధూపాల వెలుగులో మెరిసే దివ్య దేవతా విగ్రహంలా భక్తి తన్మయత్వం కలిగేది. సౌందర్యం దైవస్వరూపం అన్నమాట నిజమనిపించేది."

"నిజమే మా నళిని ఇప్పటికీ అలాగేవుంది ముట్టుకుంటె కందిపోయే లావణ్యం ఆమెది."

"ఎవరో పల్లెటూరు జమీందార్ల కోడలు అయినదని విన్నాను. ఇక్కడికి ఎందుకు









వస్తోంది?"

"కొన్నాళ్ళు పల్లెటూళ్లో అంతఃపుర స్త్రీలా వుంది. ఇప్పుడు గ్రామోద్ధరణ కార్యక్రమాలు చేపట్టి నలుగురితో కాన్ఫరెన్స్ దాకా ఆమె పేరు ప్రాకింది." అంది సుభ.

"ఇన్నేళ్ళ తర్వాత నువ్వు ఇక్కడున్నావని ఎంత గుర్తుపెట్టుకున్నాదో చూడు!"

"ఆమెకు మనం ఇక్కడున్నట్లు గుర్తు వుందో లేదో కాని, క్రితం సంవత్సరం నేను

వాళ్ళ వూరువెళ్ళాను. అప్పట్నించీ మా ఇద్దరి మధ్యా ఉత్తర ప్రత్యుత్తరాలు అడపా దడపా జరుగుతున్నాయి. ఇలా సభలు జరుగుతున్నా యని తనకి ఆహ్వానం వచ్చిందని వ్రాసింది. మన ఇంటిలో దిగమని నేను వ్రాసేను. దానికి బదులుగా వస్తోన్నట్లు టెలిగ్రాం ఇచ్చింది.

"అమ్మ దొంగా ఇన్నాళ్ళబట్టి చెప్పావు కావేం?"

"ఏదీ సందర్భం రాలేదు." అంది సుభ.

"ఆంధ్రానించి మాదోస్త్ వస్తోంది." అంది క్రిందికివెళ్ళి. "దులారీ" వంటింట్లో పూరీలు చేస్తోంది. మేడమీద రెండు గదులున్నాయి. క్రింద నాలుగ్గదులు, పొడవుగా సన్నగా వుండే హాలువున్నాయి. ఇల్లంతా సన్నగా పొడుగ్గా వుంటుంది. నాలుగ్గదులకీ హాలులోకి గుమ్మా లున్నాయి. నాలుగ్గదులూ హాలుకీ కలిసి అడ్డంగా వసారా రేకులతో దింపివుంది. సగంలో బాత్‌రూం సగంలో వంట పనికి పనికివచ్చేలా నడుంగా గోడవుంది. మేడమీద పెద్ద పెద్ద గాజు తలుపున్న కిటికీలున్నాయి. రెండు గదు ల్లోనూ దులారీ పిల్లలు, సుభ, గౌతం, పడు క్కొంటారు. క్రింద అన్నిగదుల్లోనూ సామాన్లు న్నాయి. బస్తాలతో గోధుమలు బంగాళా దుంపలు ఉల్లిపాయలు నిలవ వుంటాయి ఎప్పుడూ. క్రింద ఎప్పుడూ డాల్డావాసన. పంచ దార పాకం వాసన వేస్తూంటుంది. దూర ప్రయాణంచేసి వచ్చిన వారికి వాళ్లింటిలోకి రాగానే డాల్డాలో వేగిన గోధుమరవ్వ, పంచ దార పాకంలో ఉడుకుతూన్న వాసన నోరూరిస్తూ వుంటుంది. అదే రెండు రోజులు వరసాగా వుంటే ఆ తీపి వాసన వెగటు వచ్చేస్తుంది. జీవితం కూడా అంతే.

ఒక సమస్యలో చిక్కుకుని ఆ సమస్య లోంచి ఉక్కిరి బిక్కిరి అవుతూ బయటపడితే ఆకలి వేసినవారికి అన్నం దొరికినంత సంబ రంగా వుంటుంది. ఏ ఒడిదుడుకులూ లేకుండా జీవితం జరిగిపోతే, ఆ జీవితం పట్ల విసుగు వస్తుంది, పదేళ్ళలోపు పిల్లలు యెప్పుడు పెద్ద వాళ్ళం అవుతామా అని యెదురు చూస్తో వుంటారు. పెళ్ళిళ్ళు చేసుకున్నాక పిల్లల కోసం, పిల్లలు కలిగాక వాళ్ళ పెరుగుదల కోసం, వాళ్ళ పెళ్ళిళ్ళు పేరంటాలు చేసుకుని పెద్ద వాళ్ళు అవటం కోసం ఇల్లా నిరంతరం ఒకదాని తర్వాత ఒకటిగా ఏవేవో అంతేలం చెల కార్యక్రమాల మధ్యన జీవితం నడు స్తుంది. కూలి వాడికయినా గుమాస్తా కయినా పెద్ద జమీందారు కయినా ఏదో నిరంతరం నిత్య నూతన మయిన సంఘటనల ప్రాబల్యం కోసం తహ తహ వుంటుంది.

నళినికి వారం పదిరోజుల దాకా, తన గురించి తను ఆలోచించుకునే తీరికలేకుండా సభలతోనూ, సన్మానాలతోనూ, సైట్ సీయింగ్‌కు తిరగటంతోనూ సరిపోయింది. ఆ రోజు తీరిగ్గా సుభా గదిలో పందిరి మంచం మీద కూర్చుంది నళిని. తలంతా దుమ్మెక్కి-పోయిందని షాంపూ వేసి రుద్దుకుంది. లేత నీలం చీర, ముదురు నీలం జాకెట్టు, పచ్చగా పొడుగ్గా మెడలో కనపడకుండా వున్న సన్నని బంగారు చెయిన్, జుట్టు పొడి పొడిగా ముఖమంతా యెగురుతోంది.

"ప్స్" అంది సుభ. తదేకంగా నళిని వెంపూ చూస్తూ.

"ఏమిటీ!" అంది నళిని.

"వసే! నువ్వు నాకన్న పెద్దదానివా? చిన్న దానివా!"

"రెండు మూడేళ్ళు పెద్ద వుంటాను."

"ఇంకా టీనేజ్ గర్ల్‌లా మెయిన్‌టయిన్ చేస్తున్నావు. ఎంచేత అల్లా వుండగలావే! ఆ కిటు కేదో నాకూ చెప్పుదూ! ఎన్ని సౌందర్య పోషక వస్తువులు వాడినా ముఖాన్ని గ్లామర్‌గా వుంచుకోలేక పోతున్నాను." అంది.. సుభ దిగులుగా.

"నువ్వు అదృష్టవంతురాలిని సుభా! జీవి తంలో ప్రేమించిన యువకుడ్ని పొందగల్గావు. ముత్యాల్లాంటి పిల్లలకు తల్లివి కాగలావు. ఒక ప్పుడు కులాంతరం చేసుకున్నందుకు నువ్వు జీవితంలో ఎన్నిరకాల అవాంతరాల నెదుర్కో-వాలో అని నీగురించి ఆలోచించే దానిని. కాని

ఇప్పుడు నువ్వే నాకన్న అన్నివిధాల ఉన్నత మయిన స్థితిలో వున్నావు. డబ్బుతో నీ కన్న ఎక్కువగా అయిన ఇంగ్లీష్ మీడియమ్ స్కూల్‌లో చదువయితే చదువుకోగల్గాను. కాని నా డబ్బుతో, అందంతో, ఆకర్షణతో అగ్నిసాక్షిగా తాళికట్టిన భర్త మనస్సుని ఆక ట్టుకోలేకపోయేను. నా వైవాహిక జీవితం గులాబీలు పరచిన బాటమీద నడుస్తోంది అను కున్నాను కాని వల్లేరు కాయలు ఒత్తుగా విస రిన గతుకుల రోడ్డుమీదకు నా సంసార రధం వచ్చిందని గమనించలేదు. నా ముఖం ఎంతలా మెరిస్తే ఎందుకు!" అనుకుంది నళిని.

"ఏమిటే ఆలోచన! ఒకవేళ పెళ్లి అయిన రెండేళ్ళనించీ వరసగా నలుగుర్ని కన్నందు వల్లనా? అయినా శరీరంలో బిగువు సడలి పోకుండా అన్నీ జాగ్రత్తలూ తీసుకున్నాను. ఛెస్టువెయిస్టు కొలతలలో ఏమీ మార్పురాలేదు. ముఖం మీద మటుకు రింకిల్స్ వచ్చే స్తున్నాయి. ఆలివ్ ఆయిల్ వ్రాస్తున్నాను. ఆవిరి పడుతున్నాను. అయినా వయస్సు వస్తున్నా వస్తున్నా అంటూ బెదిరిస్తూ వచ్చి నా ముఖం ముడతల్లో తిష్టవేసుకు కూర్చొంటూంది ఏది దారి! నువ్వు చూస్తే పెళ్లికాని పిల్లలానే వున్నావు" అంది సుభ.

నళిని నవ్వింది.

"నీ అభిమానం అల్లా అనిపించుతూంది, నలభయ్యో పడిలోకి వచ్చేము. ఇంకా కన్యల్లా వుంటా మేమిటే! పిల్లా జెల్లా లేరుకనుక, బాగా పోషణలో వున్నాను కనుక కొంచెం మెర మెర లాడుతున్నాను" అంది నళిని.

దులారీ "టీ" తెచ్చింది. దులారీ పచ్చగా లావుగా వుంటుంది, జామ పండు రంగు. పూర్వకాలం మనిషి. ఎప్పుడూ జార్జెట్ వోణీ మేలి ముసుగు వేసుకుని వుంటుంది, బుగ్గలు బొద్దుగా వున్నా నవ్వితే సొట్టలుపడి ముద్దు వస్తాయి. ఇల్లంత పనీ దులారీయే చేసు కుంటుంది. పిల్లలు ఎప్పుడూ ఏది కావాల్సినా దులారీ చుట్టూ తిరుగుతూ వుంటారు తప్ప తల్లిని దగ్గరగా అడగరు తల్లి వాళ్ళ కళ్ళకి షో కేసులో బొమ్మమాదిరి కనపడు తుందేమో ఎప్పుడూ తల్లితో మాట్లాడరు.

"అయ్యో! టీ మీరు పైకితెచ్చారా! మేమే క్రిందికి వద్దుము కదా!" అంది నళిని నొచ్చు కుంటూ!

"ఆమె పైకి ఎక్కాలని ప్రయత్నించుతే మనం క్రిందనే వుండమనటం భావ్యంకాదు. పైనవున్న వాళ్ళు క్షణంలో క్రిందకు గెంత గలరు. క్రింద వున్నవాళ్ళు పైకి ఎగరలేరు కదా! ఒక్కొక్క మెట్టూ ఎక్కి పైకి రావాలంటే చాలా శ్రమపడాలి!" అంది సుభ నవ్వుతూ.

దులారీకి తెలుగు అర్థంకాదు. అక్కడో మాటా ఇక్కడో మాటా వాడుతుంది. సుభ నవ్వు ముఖం జూసి ఏదో సరదాగా మాట్లాడు కుంటున్నారని తనూ నవ్వు ముఖం పెట్టింది.

"ఇవ్వాళ ఎక్కడికన్నా వెళ్లుదామా!" అంది నళిని.

"అన్నట్టు మీ నాధుడు ట్రంకాల్ చేసారుట హోటలుకి. నీవు ఎప్పుడు వస్తావో కనుక్కో మన్నాడుట. మరి స్టేషన్‌కి కారు తీసుకురావాలి కదా." అంది సుభ.

వచ్చిన మర్నాడు సుభ వాళ్ళ హోటల్ ఫోను నెంబరు ఇస్తూ కులాసగ చేరినట్లు జాబు వ్రాసింది నళిని. వారం పదిరోజు లయినా నళిని వస్తోన్నట్లుగా టెలిగ్రాం ఇయ్యక పోయేసరికి జగన్నాధరావుగారు ట్రంకాలు చేసారు.

జగన్నాధరావుగారు ఫోను చేసారనే మాట వినగానే నళిని ముఖం చిన్నబోయింది.

"ఎప్పుడంట?" అంది నీరసంగా.

"మొన్ననే చేశారుట. మనం ఫతేపూర్ సిక్రీ వెళ్ళాము కదా! అమ్మాజీ చెప్పారుట గౌతం. అంది సుభ,

"ఇంకా ఏమేమి చూడాలో చెప్పెయ్యి!" అంది నళిని.

"పిండి కొద్దీ రొట్టె అన్నట్లు టైం, డబ్బు వుంటే చూడాల్సిన స్థలాలేకరువా! మన పవిత్ర భారతదేశంలో అడుగడుగునా గుళ్లు గోపురాలు వేదాలనాటి చరిత్రలతో వున్నాయి. కావాలంటే ఫారిన్ కంట్రీస్ కూడా పోవచ్చును డబ్బు వుండాలి కాని!" (సశేషం)

మహిళాజ్యోతి

# పాశ్చాత్య ప్రపంచంలో స్త్రీలు

భారతీయ సంస్కృతి విదేశ సంస్కృతికి విభిన్నమనేది నగ్నసత్యం. పాశ్చాత్య దేశాల్లో స్త్రీలు సైతం పురుషులతో పూర్తి సమానత్వం పొందలేదనే విషయం గమనార్హం. రెండో తరగతి పౌరులుగా జీవిస్తున్నారనే మనం నమ్మాలి. అనేక దేశ స్త్రీలను మీ దేశంలో స్త్రీలస్థాయి, స్థానం ఎలా వున్నై అని నేనడిగితే చైనా మహిళతో సహా వారు చట్టాల్లో సమానత్వం ఆచరణలోలేదని చెప్పారు. వారూ సర్దుకొనిపోతూనే వుంటారు. ప్రతి కజ్జాకూ విడాకులు పుచ్చుకోరు. విదేశ స్త్రీలు బట్టలు మార్చినట్లు భర్తల్ని మారుస్తారనే అపప్రథ వుంది. ఇది సత్యదూరం. కానీ ఈ దేశంలో స్త్రీ తన వ్యక్తిత్వాన్ని చంపుకొని సర్వస్వం భర్త కర్పించినంతగా వారుండరు. ముఖ్య కారణం విద్య. జపాన్‌తో 100./. రష్యాలో 99./. అమెరికాలో 98./. విద్యవుంటే ఇండియాలో స్త్రీ విద్య 18./. వుంది. అందుచే మన దేశంలో స్త్రీలకున్న మూఢాచారాలు, కుల మతాల పట్టింపులు, జడ సంస్కృతి, సాంఘిక అసమానత్వాలు వారిలో మృగ్యమౌచ్చు.

గత ఆగస్టులో జరిగిన అంతర్జాతీయ హ్యూమనిష్టు సభలకు 18 దేశాలనుండి 120 మంది హాజరైన ప్రతినిధులలో దాదాపు సగం మంది స్త్రీలున్నారు. అమెరికా నైతిక సంఘం వారి జాతీయ మహిళా మహాసభ తీర్మానం: ఉద్యోగం, వివాహం, విద్య, గర్భస్రావం విషయాలలో స్త్రీకి సంపూర్ణ స్వేచ్ఛ ఉండాలనేది ఏకగ్రీవంగా ఆమోదించబడింది. ఉద్యోగ స్థాయిలో స్త్రీ పురుషుల మధ్య సమానస్థాయి వుండాలని, అలావుంటే తప్ప ప్రజాస్వామిక ప్రక్రియ జయప్రదం కాదని మహాసభ అభిప్రాయపడింది. అలాగే మతస్తుల మూఢవైఖరిని ఖండించిన తీర్మానం టెస్టు ట్యూబు చేసే సందర్భంగా ఆమోదించబడింది. మానవ శరీరానికి వెలుపల టెస్టు ట్యూబులో శుక్లశోణితాలు కలయిక చేయించటం అవినీతికి దారి తీస్తుందని దానిని బహిష్కరించాలని రోమన్ కేథలిక్కులు, మతవాదులు ప్రచారం చేస్తున్నారు. వారి వైఖరిని మహాసభ ఖండిస్తూ వంధ్యలయిన దంపతులకు సంతానావకాశం కల్గుట హర్షదాయకమని, తమ జీవితాలను గురించి తామే బాధ్యత వహించటానికి గల హక్కును, స్వేచ్ఛను వ్యక్తికి ముఖ్యంగా స్త్రీలకుండాలని మహాసభ స్పష్టీకరించింది. అధిక సంతానంవల్ల స్త్రీ అణగారి పోతోందని, జననాల రేటు తగ్గించుకోవాలని తీర్మానించారు. స్త్రీ జాతి విముక్తికై హ్యూమనిష్టుల తపనకివి మైలురాళ్ళు. ఆ మహాసభకు భారత హ్యూమనిస్టు సంఘంనుండి ప్రతినిధులుగా ఎ. ఎం. తార్కుండే, ఎం. వి. రామమూర్తి, నేను హాజరైనాము.

పాశ్చాత్య స్త్రీలు ప్రేమించి పెళ్ళిచేసుకుంటారు. ఇండియాలో కట్నం సంగతి విని అమెరికన్ స్త్రీలు చకితులయ్యారు. 'అరేంజిడ్' వివాహాలు ఎలా సాధ్యమని వింత ధోరణిలో విస్మయాన్ని చూపారు. వివాహానికి పూర్వం దాంపత్య జీవితాన్ని గడుపుట వారు తప్పుగా భావించరు. పెండ్లి కాని కన్య పిల్లను కంటే సంఘ బహిష్కారంలేదు. తలవంచాల్సిన పని లేదు. వివాహం జరిగాక పరస్పర విశ్వాసంతోనే జీవిస్తారు. విడాకులు పొందిన స్త్రీ, పురుషులు వేరే పెండ్లాడి మళ్ళీ ప్రేమాభిమానాలతో జీవయాత్ర సాగిస్తారు. యువ జంటలు, మధ్య వయస్కులు, ముసలివారు సైతం జంటలు జంటలుగా తిరుగుతారు. రైళ్ళల్లో, బస్సుల్లో స్త్రీలకు ప్రత్యేకంగా సీట్లు కేటాయించరు. అలాగే 'క్యూ'ల్లో కూడా స్త్రీ పురుషులు వేరు వేరుగా నుంచోరు. మద్యపానం, సిగరెట్లు త్రాగటం స్త్రీలలోకూడా ఎక్కువే. అది తప్పుగా

మల్లాది వెంకటసుబ్బమ్మ

అనుకోరు. 'పొగ త్రాగరాదని' ఉన్నచోట్ల ఏ వ్యక్తి త్రాగని క్రమశిక్షణ వారిలో వుంది. బారులలో కేఫ్‌లలో సమాన సంఖ్యలో స్త్రీలు కన్పిస్తారు పానీయాలు పుచ్చుకుంటూ. మొత్తంమీద మోతాదుగానే త్రాగుతారు. త్రాగి మత్తెక్కి పడిపోయిన స్త్రీ పురుషులను మేము చూడలేదు. గంటల తరబడి పానీయాన్ని సేవిస్తూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటూన్న జంటలను లక్షల సంఖ్యలో పారిస్‌లో చూడగలం. మద్యపానానికి, ఋజువర్తనానికి, శీలానికి వారు సంబంధం ఏర్పరచుకోలేదు. నీతులు చెప్పరు కాని పాటిస్తారు.

కుటుంబ జీవితంలో పనిపాటల్లో చెరో పని చేసుకుంటారు. పనులలో కేటాయింపులేదు. ఇల్లు శుభ్రంచేయుట, గిన్నెలు కడుగుట, వంటలో పురుషులు సైతం పాల్గొంటారు. కుటుంబమంటే భార్యాభర్త 14 సం. లోపు పిల్లలు మాత్రమే వుంటారు. వృద్ధులను ప్రభుత్వం భరిస్తుంది. వార ఆరోగ్యం, వసతి, ఆహారాలే కాక అంత్యక్రియలను సైతం మంచి హోదాతో నిర్వహిస్తుంది. నిరుద్యోగులకు వారానికి 45 పౌన్ల ధనాన్ని సహాయంచేస్తుంది. ఏ జబ్బు వచ్చినా ఉచిత వైద్య సహాయం కడు జాగ్రత్తతో ప్రభుత్వమే నిర్వహిస్తుంది. ఇళ్ళు, రోడ్లు, స్టేషన్లు, ఆఫీసులు చాలా పరిశుభ్రంగా వుంచుతారు. పిల్లలకు ఈ అలవాట్లు తల్లులు శ్రద్ధతో నేర్పుతారు. సామాన్యంగా ఇద్దరు పిల్లలకన్నా కనరు. స్కాట్లెండ్ స్త్రీ ఒకామె 4 వ పిల్లని కనటానికి ఇష్టపడుతున్నానన్నది. పనిమనిషిని ఆ దేశాలలో భరించలేరు. సొంతంగా చేసుకున్నా కష్టమనిపించని సులువైన యంత్రాలు కోకొల్లలుగావుంటై. అందరూ అవి కొని సుఖపడతారు. స్త్రీలు తమ సామాన్లు సరుకులు తామే స్వయంగా చిన్న చక్రాల ట్రాలీపై తెచ్చుకొంటారు. స్త్రీ పురుషులు కష్టపడి సంపాదిస్తారు. వారాంతానికి విహార యాత్రలు చేయుట సర్వసామాన్యము. దొంగతనాలు, లంచగొండి తనం, కత్తీ, మోసము,

హొంగవ్యాపారాలు మచ్చుకైనాలేవని చెప్పొచ్చు. రోడ్లపై, పార్కుల్లో, స్టేషన్లలో జంటలు ముద్దెట్టుకున్నా, కౌగలించుకున్నా వింతగా చూడరు. అదివారి సాంప్రదాయం. ప్రక్కవాళ్ని పలుకరించరు. మనం ఏదన్నా అడిగితే మాత్రం మర్యాదగా సమాధానం చెప్తారు.

యూరోపియను స్త్రీలు సైతం రాజకీయాల్లో విముఖతగానే వున్నట్లు తోచింది. వైస్ ఛాన్సలర్లు, జడ్జీలు, మేయర్లు, మంత్రుల ఉద్యోగాల్లో పురుషులు, నర్సులు, టీచర్లు, సేల్సు గరల్సు, స్టెనోలు, సెక్రెటరీలలాంటి ఉద్యోగాలలో స్త్రీలు వుంటారు. ఇది పురుషాధిక్యతకు నిదర్శనం. స్విజర్లెండులో 1971లోనే స్త్రీకి ఓటు లభించింది. నేటికి కొన్ని మునిసిపాలిటీలలో స్త్రీకి అప్పట ఓటులేదు. 1946 నాటివరకు ఫ్రాన్సులో స్త్రీకి ఓటు హక్కులేదు. ఇప్పటికీ ఆదేశస్త్రీలలో ఇంటివిషయం, పిల్లల రక్షణచూస్తే చాలదా? అనే భావంకలవారున్నారు. నార్వేదేశస్థురాలు 'ఆయన్ని ఉద్యోగం చెయ్యనిస్తున్నాను. నేను కుటుంబానికి న్యాయం చేస్తున్నా'నంది. మొత్తంమీద హెచ్చు సంఖ్యలో స్త్రీలు ఏదో ఒక వుద్యోగం చేస్తూనే వుంటారు. ఉద్యోగినుల పిల్లల్ని చూచుటకు వేరే వసతి గృహాలున్నై. నా ముఖంపై బొట్టుచూచి ఆదేశాల వారు ప్రశ్నల వర్షం కురిపించారు. ఇటలీ స్త్రీలువారూ బొట్టు పెట్టుకొని నాతో ఫొటోలు తీయించుకున్నారు.

ఐరోపానుండి మధ్యప్రాచ్య సంస్కృతిలో అడుగు పెట్టగానే ఆశ్చర్యం వేసింది. ఇది పర్షియన్ గల్ఫ్ ప్రాంతం. మసీదులు మిక్కుటం. మత ప్రచారం అధికం. కానీ స్త్రీలు మాత్రం మసీదుల్లో అడుగుపెట్టరాదు. పూర్తిగా నిషేధం. వారి ప్రార్థనలు గృహావరణలోనే. వారు బైటికే సామాన్యంగా రారు. వస్తే శరీరం నిండా బురఖాధరించాలి, ముక్కు పైభాగాన తోలుపట్ట కట్టుకొని రావాలి. ఇది అరబ్బు స్త్రీల ప్రత్యేకత. వారు అసలు హక్కులూ కోరరు, సమానత్వం వాంఛించరు. ఇలా రకరకాల ఆచారాలు, సంస్కృతి, వైవిధ్యంకల దేశాలున్నై. పాశ్చాత్య నాగరికత చాలాభాగం మెచ్చుకో తగ్గది. అందమూ, చదువూ, సంస్కారము కలవారు; సంపద కలిన జాతి. అనుభవించగల నేర్పరితనం వుంది. సాంకేతికజ్ఞానం వారి సొత్తు. కానివారిలో మతపిచ్చి అధికం.

ఇటీవల పాశ్చాత్య దేశాల్లో స్త్రీ విమోచనోద్యమాలు బాగా పనిచేస్తున్నాయి. సర్వ విషయాల్లో పురుషునితో సమానత్వం వుండాలనేదే వారి మనోరథం. ఒకనాడు గృహిణులకు వేతనాలు ఉండాలని, గృహిణిగా స్త్రీ చేసే పనికి పరిగణన ఉండాలని వేయి మంది స్త్రీలు లండన్‌లో ప్రదర్శనచేసిన విషయం అందరికీ విదితమే. ఆ దేశాల్లో వేతనము, సామాజిక సేవా పథకాలవల్ల ప్రతివ్యక్తి లాభం పొందుతున్నారు. అదీకాక జాతీయ ఆదాయంలో వాటాగా ప్రతి పౌరునికి ముట్టజెప్పాలనే అభిప్రాయం మొన్నటి కమ్యూనిష్టు సభలో వెల్లడయింది. ఇలా జరిగితే స్త్రీకి ప్రభుత్వంవల్ల కొంత ఆదాయం లభిస్తుందని. వారి పోరాటాలు కోర్కెలు వేరు. మనవి వేరు, మన పరిస్థితి వేరు. మొత్తంమీద పాశ్చాత్య మహిళలు భారతస్త్రీల కన్నా మెరుగే. పాశ్చాత్యులు భౌతికవాదులనీ, ప్రాచ్యులు ఆధ్యాత్మికులనీ భారతీయ సంస్కృతి పవిత్రమనే దురభిమానం మనలో పోవాలి. ఏ దేశంలో, ఏ నాగరికతలో, ఏ సమాజంలో మానవాభ్యున్నతి కలదో దానిని స్వీకరించుటలో ఏహ్యాపడరాదు. అన్నిదేశాల్లో అన్ని కాలాల్లో మంచీ, చెడూ వుంటాయి. ఒకరి మంచిని మరొక స్వీకరించుటలో తప్పు లేదు. అందరం మానవులమే కదా!

స్త్రీ జనాభ్యుదయమే సమాజానికి గీటురాయి. మన ప్రగతి కొరకు మనమే కృషి చెయ్యాలి. తర తరాల భావదాస్యం పోవాలి. ఇది ఒక సంవత్సరంలో మారదనే యు.ఎన్.ఓ. వారు మహిళా దశాబ్దాన్ని ప్రకటించారు. దానికి స్త్రీ విద్యా, వయోజన ప్రబోధాల ద్వారానే పురోగతి సాధించగలం. భారతదేశం కూడా పాశ్చాత్య దేశాలతో సరితూగాలనే వాంఛ నా విదేశ పర్యటనవల్ల నాలో ఉధృతమయింది. మన సమాజం మారకపోలేదు. స్త్రీ విద్యా, ఉద్యోగాల స్థాయి పెరిగింది. ఇది చాలదు. స్త్రీ పురుషుల సమిష్టి కృషివల్లనే మనకు విముక్తి వుంటుంది. □

# శ్రీశ్రీ నిర్వహించు పదబంధ ప్రహేళిక

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | ■ | 4 | 5 | | 6 |
| | ■ | 7 | | | | | ■ | |
| 8 | 9 | ■ | | ■ | | ■ | 10 | |
| 11 | | | ■ | 12 | ■ | 13 | | |
| ■ | | ■ | 14 | | | ■ | | ■ |
| 15 | | | ■ | | ■ | 16 | | 17 |
| 18 | | ■ | 19 | ■ | 20 | ■ | 21 | |
| | ■ | 22 | | | | 23 | ■ | |
| 24 | | | | ■ | 25 | | | |

ఆధారాలు డిసెంబరు '78

అడ్డం:

1. ఇలా అంటే అదా?
4. విశ్వామిత్రుడు కోరింది.
7. మేఘాలలో మేటి.
8. జలచరాలలో గొప్పది.
10. తిను (గడ్డి మొదలైనవి)
11. ఎన్నిక.
13. ఇవి దూరని చోటు లేదంటారు.
14. బోలెడు మంది.
15. బంగారు కొండ.
16. చతుర్ముఖ బ్రహ్మ (తలకిందులు)
18. వెదకటానికి - మూలలు.
21. చింతలో చావనిది.
22. పాత ఢిల్లీ.
24. 19 కి గ్రాంధిక రూపం.
25. అమూల్యమైనదా?

నిలువు:

1. ఆరు.
2. కులం ఫలించటం.
3. సహజ కర్మకాడు.

4. అంతా ఉంది కావ్యంలో.
5. గుంట.
6. రెండో తరగతి పౌరులా?
9. విస్ఫులింగాలు.
10. సుప్రభాతం?
12. శివుడు.
15. దగ్గర చుట్టం.
17. ఆఫ్రికా అమ్మాయి.
19. 24 కి వాడుక రూపం.
20. చేరువలో.
22. దెబ్బ.
23. ఏం లేదు.

## అక్టోబర్ పదబంధ ప్రహేళికకు సమాధానం:

అడ్డం: 1. గాలివాన 4. అగచాట్లు 7. తమ్మిమొగ్గరం 8. తూకం 10. పొగ 11. పుడమి 13. కాలిమం 14. ఆరుద్ర 15. వలితం 16. తులసి 18. రామి 21. నురి 22. తమిళనాడు 24. హసంతిక 25. సబ్బుబిళ్ళ.

నిలువు: 1. గాడ్పుతూపు 2. వాత 3. నమ్మిక 4. అగ్గలం 5. గరం 6. టుగాగమం 9. కండబలిమి 10. పొలికలను 12. హరువు 15. వరారోహ 17. సిరిసిళ్ళ 19. భూమిక 20. అనాస 22. తతి 23. డుబ్బు.

## నిబంధనలు గమనించండి!

పదబంధ ప్రహేళిక కొట్టివేతలు, దిద్దుబాట్లూ లేకుండా పూర్తిచేసి నవంబరు 27 వ తేదీలోపు మాకు చేరునట్లు పంపండి. తెల్లకాగితం మీద గళ్ళుగీసి పూర్తిచేసి పంపిన ఎంట్రీలు చెల్లవు. ఎంట్రీలు పంపువారు వారిపూర్తి చిరునామా ఎంట్రీపైనే రాసి పంపాలి. ఆల్ కరెక్ట్ ఎంట్రీకి రు. 50/- బహుమతి. ఒకటికి మించి ఆల్ కరెక్ట్ ఎంట్రీలు వొచ్చినప్పుడు బహుమతి సొమ్ము విజేతలకు సమానంగా పంచబడుతుంది. ఆల్‌కరెక్ట్ ఎంట్రీ ఒకటీ రాకపోతే బహుమతి సొమ్ము పైనెల బహుమతి సొమ్ముకు కలిపి అందజేయబడుతుంది.

అక్టోబర్ పదబంధ ప్రహేళిక

**ఆల్‌కరెక్ట్ ఎంట్రీ ఒక్కటీ రాలేదు**

డిసెంబర్ ప్రహేళిక బహుమతి

**జాక్‌పాట్ రు. 100/-**

# పలురంగాలలో ఆంధ్ర ప్రముఖులు

1944 లో కేవలం 224 మంది సభ్యులతో ప్రారంభమై ఈనాడు ఎనిమిదివేల సభ్యులను కలిగివున్న 'ఇండియన్ మెడికల్ ప్రాక్టీషనర్స్ కో ఆపరేటివ్ ఫార్మసీ అండ్ స్టోర్స్ లిమిటెడ్' (ఇంప్‌కాప్స్) ఆ సంస్థ స్థాపక కార్యదర్శి డా॥ వై. కొండలరావు కృషికి నిదర్శనంగా నిలుస్తోంది. ఇంప్‌కాప్స్ దాదాపు ఏడు వందల రకాల మందులు ఉత్పత్తి చేస్తుంది.

సహకార సంస్థల విజయానికి ప్రధానమైన కారణం.... ఓర్పు, నేర్పు, కృషి, స్వార్థరహితంగా ఆ సంస్థ విజయానికి పాటుపడటం—ఈ గుణాలు గల నాయకుడు. డా॥ కొండలరావులో ఈ గుణాలున్నాయనడానికి ఇంప్‌కాప్స్ విజయమే నిరూపణ.

"ఆహారం, విహారం, ఔషధం ఈక్రమంలో మనిషి అవసరాలుండగా మొదటి రెండూ మరచి పోతున్నాం మనం దురదృష్ట వశాత్తూ. చాలా చాలా అవసరమైతే తప్ప మందులు వాడకూడదు. ఆరోగ్య సూత్రాలు గురించి ప్రజలలో సరైన అవగాహన పెంపొందించ గలిగితే చాలావరకు అనారోగ్యాలూ ఉండవు, మందుల అవసరమూ ఉండదు" అంటారు డా॥ కొండలరావు. "వైద్యవృత్తి సేవాపరంగా గాక సంపాదన పరంగా తయారవడం విచారకరం. ఈ స్థితి పోవాలంటే ముందు డొనేషన్లతో సీట్లు ఇచ్చే పద్ధతిపోవాలి" అంటారీయన.

ప్రభుత్వ వైద్యశాలల గురించి అసంతృప్తి వ్యక్తంచేసిన డా॥ రావు ఇ. యస్. ఐ ఆస్పత్రుల విషయంగా మాట్లాడుతూ "ఒక్క పారిశ్రామిక కార్మికులకే ఈ సౌకర్యం ఎందుకుండాలో నాకర్థం కాకుండా ఉంది. ప్రతి వ్యక్తి వైద్య సదుపాయాల విషయంలో ఒకటిగానే చూడబడాలి. ఈ తేడా ఎందుకు?" అని ప్రశ్నించారాయన.

1918లో విజయవాడలో జన్మించిన డా॥రావు 1942 లో ఎల్. ఐ. ఎం. డిప్లొమా తీసుకొన్నారు. 1944 నుంచే ఇటీవలివరకూ (1978) ఇంప్‌కాప్స్‌కు సెక్రటరీగా ఉన్నారు.

ఇప్పుడు కూడా ఈయన ఆ సంస్థకు ఆనరరీ



కన్సల్టెంట్‌గా ఉన్నారు. 1945-1950 మధ్య 'జర్నల్ ఆఫ్ ఇండియన్ మెడిసిన్'కు సంపాదకుడుగా ఉన్నారు. 1944 నుంచి 1961 మధ్య వరుసగా ఎల్.ఐ.ఎం. అసోసియేషన్‌కు సెక్రటరీగాఎన్నుకోబడ్డారు. 19??లో మందుల పరిశ్రమ ప్రగతి గురించి పరిశీలన జరిపేందుకు ఇంగ్లండ్ వెస్టు జర్మనీ, డెన్మార్కు, ఫ్రాన్స్, ఇటలీ, ఆస్ట్రియాలు సందర్శించారు. 1963-68 మధ్య ఆయుర్వేద ఫార్మకోపియా కమిటీ సభ్యుడిగా కేంద్రప్రభుత్వంచే నియమించబడ్డారు. 1972లో 'డ్రగ్ టెక్నికల్ ఎడ్వైయిజరీబోర్డ్ ఆయుర్వేద అండ్ యూనాని'కి సభ్యుడిగా కేంద్ర ప్రభుత్వంచే నియమించబడ్డారు. శ్రీలంకలో ఆయుర్వేద, సిద్ధ, యూనాని మందుల తయారీకి ఫ్యాక్టరీ స్థాపించేందుకు భారత దేశంనుంచి వెళ్ళిన డెలిగేషన్‌లో ఎక్స్‌పర్ట్ మెంబర్‌గా 25-9-78 న శ్రీలంక వెళ్ళారీయన.

మరి కొంతమంది డా॥ కొండలరావులు గనుక ఉంటే ప్రకృతి సిద్ధమైన, మన సాంప్రదాయ సిద్ధమైన మందులు మొత్తం భారతదేశం లోనేగాక ప్రపంచం మొత్తంలోనే అధిక ప్రచారాన్నిపొంది ఉండేయని మేం బలంగా నమ్ముతున్నాము.

—పి. సరళా సూర్యారావు

# సినిమా

## 'ప్రెసిడెంట్ పేరమ్మ'

నిర్మాత డి.వి.యస్. రాజు కవితా ఆర్ట్ ప్రొడక్షన్స్ పతాకంపై నిర్మిస్తున్న ద్వితీయ వర్ణచిత్రానికి "ప్రెసిడెంట్ పేరమ్మ" అని నామకరణం చేశారు.

ప్రముఖ దర్శకులు కె విశ్వనాథ్ దర్శకత్వంలో పూర్తిగ్రామీణ వాతావరంలో చిత్రీకరణ జరుగుతున్న యీ రసవత్తర చిత్రంలో 'టైటిల్' పాత్రలో కవిత, నటిస్తోంది. నూతన్ ప్రసాద్, గోకిన రామారావు, రాజ్‌బాబు, సాక్షి రంగారావు, రమణామూర్తి, భీమరాజు, సి.హెచ్. కృష్ణమూర్తి, మంజుభార్గవి, జానకి మొదలయినవారు ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు.

## 'గతించని గతం'

కొమ్మినేని ఫిలిమ్స్ డిస్ట్రిబ్యూషన్ అధినేత, సెన్సార్‌బోర్డ్ సభ్యుడు, తమిళనాడు ఫిలింఇన్‌స్టిట్యూట్ అధ్యాపకుడు అయిన యువకుడు కొమ్మినేని కృష్ణమూర్తి యిప్పుడు డైరెక్టరుగాకూడా కొత్త బాధ్యతను స్వీకరిస్తున్నారు. స్వర్గీయ త్రిపురనేని గోపీచంద్ వ్రాసిన గతించని గతం అనే కథను అదే పేరుతో చలనచిత్రంగా కొమ్మినేని ప్రొడక్షన్స్ బ్యానరుపై నిర్మించబోతున్నారు. గుమ్మడి, శ్రీధర్, స్వరూప్‌దత్ ఇప్పటికి ఎన్నికయిన నటులు.

ఈస్ట్‌మన్ కలర్‌లో జనవరిలో షూటింగ్ ఆరంభం అయ్యే "గతించని గతం" చిత్రానికి సంభాషణలు శ్రీధరం. ఫొటోగ్రఫీ: నిమాయ్

'కరుణామయుడు'లో హలం, రావుగోపాలరావు



ఘోష్, సంగీతం: ఉస్తాద్ విలాయత్‌ఖాన్, ఎడిటింగ్: గోవింద్ - డి. జోషి, సాంస్కృతిక దర్శకత్వం: సంజీవ్‌దేవ్, నిర్మాత: డాక్టర్ కె. లక్ష్మీనారాయణరావు, కోప్రొడ్యూసర్‌గాను సినేరియో డైరక్షన్‌లనుకూడా కొమ్మినేని నిర్వహిస్తారు.

రజాకార్ వుద్యమంలో అనేక దారుణదురంతాలు జరిపి ఆ పిమ్మట మానసిక చైతన్యాన్ని పొందిన హస్సెన్‌ఖాన్ అనే యువకుని మానసిక ఘర్షణ ముఖ్య యితివృత్తంగా గల "గతించని గతం" పూర్తిగా హైద్రాబాద్ పరిసర ప్రాంతాలలో నిర్మించబడుతుంది.

## ఇది 'నిజం'

రావిశాస్త్రి "నిజం" ఇన్స్‌పిరేషన్‌తో దేవదాసు దర్శకత్వపు ప్రమాణాలతో తయారయిన ప్రజోపయోగాత్మకం అయిన "నిజం" ఒక ఆలోచనాత్మక చిత్రం.

సమాజంలో ఏ చట్టానికి శాసనానికి, నీతి సూత్రాలకి కట్టుబడకుండా నాగరికత ముసుగులో గౌరవనీయంగా చెలామణి అయే మనిషిలోని సార్వభౌమత్వదాహాన్ని జాగ్రత్తగా కనిపెట్టమని హెచ్చరించే యీ చిత్రం సామాజిక ప్రయోజనం ఉద్దేశించి రచించబడ్డ సెల్యూలాయిడ్ రచన.

గుమ్మడి, నారాయణరావు, నూతన్‌ప్రసాద్, శరత్‌బాబు, శ్రీనాధ్, అంకినీడు,విఠల్‌ప్రసాద్, బాబూ రాజేంద్రప్రసాద్, బెక్కం, జె.ఎస్. శాస్త్రి, పొట్టి ప్రసాద్, ధమ్, కె.వి. శాస్త్రి, హేమాచౌదరి, రాజేశ్వరి, సీమా (అంగడి బొమ్మ), లక్ష్మీదేవదాస్, గిరిజారాణి, కృష్ణప్రియ, లావణ్య వగైరా నటవర్గం పాల్గొన్న యీ చిత్రం సంగీతకర్త రాఘవులు, మాటలు: జంధ్యాల, పాటలు: నెల్లుట్ల, జాలాది.

కళాభారతి ఇంటర్నేషనల్ సంస్థ నిర్మించిన ఈ చిత్రం నిర్మాతలు సురేంద్రరెడ్డి, విద్యాసాగర్. సమర్పణ: శ్రీమతి బి. రాజమ్మ.

## 'కొండగాలి'

ఇది శ్రీకాకుళం కొండగాలి. శ్రీకాకుళం జిల్లాలోని కొండ ప్రాంతాల్లో వున్న గిరిజనుల జీవితాలు కథా వస్తువుగా (భూషణం రాసిన 'కొండగాలి' నవల ఆధారంగా) వై.జె. క్రియేషన్స్ పతాకం క్రింద వై.జె. రెడ్డి నిర్మిస్తున్న చలనచిత్రం ఇది. ప్రతి సంవత్సరం ఉత్తమ చిత్రానికి కేంద్ర ప్రభుత్వమిచ్చే బంగారు పత

'రామబాణం'లో జమున, శుభ, జయప్రద, శోభన్‌బాబు





'అతనికంటె ఘనుడు' కృష్ణ

కాన్ని తొలిసారిగా దక్షిణ భారతదేశానికి సంపాయించిన చెమ్మీన్ (మళయాళం) చిత్రదర్శకుడు రాము కరియత్ ఈ చిత్రానికి దర్శకుడు. పాటలు శ్రీశ్రీవి. సంగీతం సలీల్‌చౌదరిది. ఈ చిత్రం విశేషాలు వివరించేందుకు ఏర్పాటుచేసిన పత్రికా ప్రతినిధుల సమావేశంలో ఈ దర్శకుడు తెలుగు చలనచిత్రాలు తెలుగు సంస్కృతికి దూరంగా జరిగిపోయి ఊహాప్రపంచంలో తిరుగాడుతాయన్న అభిప్రాయం వ్యక్తపరుస్తూ ఒకనాటి తెలుగు చిత్రాలు (స్వర్గసీమ, మాలపిల్ల, సుమంగళి చిత్రాలపేర్లు ఉదహరించారు) తమనెంతగానో ఉత్తేజితుడిని చేశాయన్నారు. తెలుగు సంస్కృతిని ప్రతిబింబిస్తూ, జీవితానికి అతి సన్నిహితంగా వుండే ఈ చిత్రాన్ని శ్రీకాకుళంలోని గిరిజను లుండే ప్రాంతాలలోనే 'స్టార్స్' లేకుండా కొత్తవారితోనే నిర్మిస్తున్నట్లు చెప్పారు. సమావేశం తర్వాత గంటసేపు అద్భుత ప్రకృతి దృశ్యాల కనువిందు చేయడమే గాక, చక్కని అనుభూతినీ అందించిన రాము కరియత్ ఇటీవలి మళయాళ చిత్రం "అమ్మ అండ్ హర్ గోట్" పత్రికా విలేఖరులకు చూపించారు.

## బాపు విదేశయాత్ర

అందమైన చిత్రాలు గీసేవాడిగానే గాక, అందమైన చిత్రాలు తీసేవాడుగాకూడా పేరొందిన బాపు దర్శకత్వంలో తయారయిన కళాఖండం సీతాకళ్యాణం లండన్ ఫిలిం ఫెస్టివల్‌లో పాల్గొంటుంది. అంతేకాదు ఈ చిత్రం గురించి విన్న చికాగో (అమెరికా) ఫెస్టివల్ డైరక్టర్ ఈ చిత్రాన్ని చికాగోలో ప్రదర్శించేందుకు ఏర్పాటు చేశారు. బాపు ఈ నెల 2 వ తేదీన బయలేరి చికాగో వెళ్ళారు ఈ సందర్భంగా. లండన్‌లో ఫెస్టివల్‌కి బాపుతోపాటు, రచయిత ముళ్ళపూడి వెంకటరమణ, కెమెరామెన్ కె. యస్. ప్రసాద్, స్పెషల్ ఎఫెక్ట్స్ ఫోటోగ్రాఫర్ రవికాంత్‌నగాయిచ్, నిర్మాత ఆనందరావుకూడా హాజరవుతారు.

## నవత ఆర్ట్స్‌వారి కొత్తచిత్రం!

మంచి అభిరుచి వున్న నిర్మాత ఎన్.కృష్ణంరాజు తమ కొత్త చిత్రంగా "ఇంటింట రామాయణం" సమర్పిస్తున్నారు. రంగనాథ్, చంద్రమోహన్, గుమ్మడి, నూతన్‌ప్రసాద్, పి.ఎల్. నారాయణ, జయసుధ, ప్రభ, రమాప్రభ,

నిర్మల నటిస్తున్న ఈ రంగుల చిత్రానికి పి. సాంబశివరావు దర్శకుడు.

## రామబాణం!

నిర్మాత ఎం.ఎస్. రెడ్డి తెలుగు ప్రేక్షకుల పైకి చలనచిత్ర "రామబాణం" ప్రయోగిస్తున్నారు. ఈశ్వరరెడ్డిని దర్శకుడుగా పరిచయం చేసే ఈ వర్ణచిత్రంలో శోభన్‌బాబు, జయప్రద, కృష్ణంరాజు, లత, జగ్గయ్య, జమున, రంగనాథ్, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, శుభ, మోహన్‌బాబు, నాగేష్, రాజనాల, ఈశ్వర్రావు, కె.వి. చలం, జయమాలిని మొదలగువారు నటిస్తున్నారు. ఈ చిత్రానికి చిత్రానువాదం, మాటలు, పాటలు: మల్లెమాల. కథ: భీశెట్టి, జయంపు కృష్ణ.

## భాస్కర చిత్ర తాజా చిత్రం

ఎన్. టి. రామారావు, వాణిశ్రీ, జగ్గయ్య, గుమ్మడి, పద్మనాభం, మిక్కిలినేని, రమణమూర్తి, నూతన ప్రసాద్, పుష్పలత, ఛాయాదేవి మొదలగువారు నటిస్తున్న భాస్కర చిత్ర వారి తాజా చిత్రానికి బి. ఎ. సుబ్బారావు దర్శకుడు. నిర్మాత: టీ. పుండరీకాక్షయ్య.

## ఊర్వశీ నీవే నా ప్రేయసి!

ఇది తెలుగు సినిమా పాటలో ఒక చరణం కాదు. రాబోయే ఒక తెలుగు సినిమా పేరు. మురళీ మోహన్, శరత్‌బాబు, నాగేష్, గోకిన రామారావు, లత, సుభాషిణి, వీరితోపాటు కొత్తగా పరిచయమవుతున్న ప్రకాష్ నటిస్తున్న ఈ చిత్రాన్ని శ్రీ ధరణీ చిత్ర ఎంటర్‌ప్రైజెస్ పతాకం క్రింద బి. ధరణీరెడ్డి నిర్మిస్తున్నారు. కథ, స్క్రీన్‌ప్లే, డైరెక్షన్: శ్రీధర్.

## సింగపూర్ చిత్రం!

'ఔట్‌డోర్' భాగాలన్నీ సింగపూర్‌లో ముస్తాబయిన తెలుగు చిత్రం 'అందమైన అనుభవం.' ప్రేమాలయా కంబైన్స్ నిర్మిస్తున్న ఈ చిత్రంలో కమల్ హాసన్, రజనీకాంత్, జయప్రద ముఖ్యమైన పాత్రలలో నటించారు. బాలచందర్ దర్శకత్వంలో తయారవుతున్న చిత్రమిది. ఆర్. వెంకటరామన్ నిర్మాత.

## అతనికంటె ఘనుడు!

అడుసుమిల్లి లక్ష్మీకుమార్ మారుతీ ప్రొడక్షన్స్ పతాకం క్రింద నిర్మిస్తున్న ఈ సినిమా స్కోప్ కలర్ చిత్రంలో కృష్ణ, జయప్రద, జానకి, సత్యనారాయణ, రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య మొదలగు వారు నటిస్తున్నారు. దర్శకత్వం జి. సి. శేఖర్. సంగీతం: చక్రవర్తి, కెమెరా: పుష్పాలగోపీకృష్ణ.

## పట్నం పిల్ల

మురళీ మోహన్, కమల్‌హాసన్, శ్రీదేవి, సత్యప్రియ, సారథి, అనిత, మోహన్‌బాబు, పి. ఆర్. వరలక్ష్మి మొదలగువారు నటించిన 'పట్నం పిల్ల' చిత్రానికి కె. సత్యం దర్శకుడు. కె. తాతాజీ నిర్మిస్తున్న యీ వర్ణ చిత్రం ఉమాదేవి పిక్చర్స్ పతాకం క్రింద తయారవుతోంది.

'సీతాపతిసంసారం'లో చంద్రమోహన్





'ప్రేమ చేసిన పెళ్ళి' చంద్రమోహన్, జయసుధ

## పంచ ప్రాణాలు

ఎస్. గోపాల్ దర్శకత్వంలో శ్రీధర్, శరత్‌బాబు, ప్రసాద్‌బాబు, ఆనంద్ మోహన్, రవి, హాలం, జయమాలిని నటిస్తున్న చిత్రమిది. హారర్, థ్రిల్లర్ కథాంశంగా గల ఈ చిత్రాన్ని అనుభవజ్ఞులైన పలువురు సాంకేతిక నిపుణులు స్థాపించిన రాఘవేంద్ర శ్రీ ఆర్ట్స్ సంస్థ నిర్మిస్తున్నది. కథ, మాటలు: మధురాధన్; సంగీతం: ఉపేంద్రకుమార్; ఛాయాగ్రహణం: కె. సుఖదేవ్.

'అందమైన అనుభవం' జయప్రద, కమల్ హాసన్





[illegible]లై తే'లో చంద్రమోహన్, ఫటాఫట్

## గోపీ కృష్ణా యింటర్నేషనల్ చిత్రం

'చిలకమ్మ చెప్పింది' - వంటి విజయవంత మైన చిత్రాన్ని తెలుగు ప్రేక్షకులకు అందించిన గోపికృష్ణా యింటర్నేషనల్ సంస్థ ఈరంకి శర్మ దర్శకత్వంలో మరో సంచలనాత్మక చిత్రాన్ని రూపొందిస్తున్నది. హైదరాబాద్‌లో అక్టోబర్ 4 న ప్రారంభమై నెలాఖరువరకూ జరిగిన షెడ్యూలుతో సగభాగం పూర్తయింది. నవంబరులో జరిగే మరో షెడ్యూలులో చిత్ర నిర్మాణం పూర్తవుతుంది. నారాయణరావు, లక్ష్మీకాంత్, చిరంజీవి, పి. ఎల్. నారాయణ హేమసుందర్, వంకాయల, మాధవి, పల్లవి, జానకి ముఖ్య పాత్రలు ధరిస్తున్న యీ చిత్రం షూటింగ్ మొత్తం అశోక్‌నగర్‌లోని ఒక భవంతిలోను, నగరంలోని మరికొన్ని భవనా ల్లోను జరుగుతున్నది.

సాంకేతిక వర్గం: మాటలు: సి. ఎస్. రావ్, పాటలు: ఆత్రేయ. సంగీతం: ఎం. ఎస్. విశ్వ నాధన్, ఛాయాగ్రహణం: లోకనాధ్, రఘు నాధరెడ్డి. చేగొండి హరిబాబు సమర్పణలో, చలసాని గోపి ఈ చిత్రాన్ని నిర్మిస్తున్నారు.

## మనవూరి పాండవులు

బాపు దర్శకత్వంలో జయకృష్ణా మూవీస్ నిర్మించిన రంగుల చిత్రం ఇది. అత్యంత వినోదాన్నందిస్తూనే, ప్రయోజనాత్మకమైన కథకు చిత్రంగా రూపం కల్గిస్తూ రూపొందించ బడిన ఈ చిత్రంలో అత్యంత కీలకమైన పాత్రను పోషించిన నటుడు కృష్ణంరాజు ఈ చిత్రాన్ని సమర్పించారు. ముళ్ళపూడి వెంకటరమణ మాటలు సమకూర్చారు. జయకృష్ణ నిర్మించిన ఈ చిత్రంలో కృష్ణంరాజుతోపాటు, మురళీ మోహన్, రావుగోపాలరావు, అల్లు రామ లింగయ్య, కాంతారావు, సారధి, శోభ, గీత, హాలం కాక నటుడు ప్రసాద్‌బాబు ఒక ముఖ్య మైన పాత్రలో నటించారు. మరి కొంతమంది నటులుకూడా పరిచయమవుతున్నారీ చిత్రం ద్వారా.

— యస్వీనారాయణ

Edited & Published by V. Leelavathy Raghavaiah, at 17B Rajaram Colony Kodambakkam, Madras-600024, & Printed by D. Hanumantha Rao at Kranti Press, 12, Francis Joseph Street, Madras-600001.

JYOTI, DECEMBER, 78 Rs. 3/- REGD.NO: M.8669




# మనవూరి  పాండవులు

సంగీతం కె.వి.మహదేవన్
ఫోటోగ్రఫీ బాలూమహేంద్ర

దర్శకుడు బాపు

రచన ముళ్ళపూ
నిర్మాత జయ

printed at Sri Selvanayagi Printing Works, M